# ఆత్మ - చిత్

ప్రవచనములు



తత్త్వపరంగ
అర్థంచేసుకోటానికే

రజతోత్సవసందర్భంగ విడుదల

## శ్రీ కృష్ణానంద మఠం

MANAGEMENT BY
శ్రీ కృష్ణానందాశ్రమ గీతాప్రచార సంఘం
REGESTERED NO. 308/67
*16-11-511/2* శ్రీ కృష్ణానందమఠం రోడ్
దిల్ సుఖ్ నగర్ – హైదరాబాద్ - *500 036*
ఫోన్ : 876581



వెల రూ. 20/-

# విషయసూచిక



ఓం తత్ సత్

# సంసార కారణం ఏమిటో

నాయం జనో మే సుఖదుఃఖహేతుః,
న దేవతాత్మ-గ్రహ-కర్మ-కాలాః,
మనః పరంకారణమామనన్తి,
సంసారచక్రం పరివర్తయేద్యత్.
(భాగవతం-భిక్షుగీత)

సాధారణంగా అందరూ అనుకుంటున్నట్లు
దుఃఖభూయిష్ఠమూ, జన్మవ్యాధిజరామృత్యురూపమూ,
అయిన సంసారమునకు,

ఈలోకంలోని మనుష్యులూ, జంతువులూ గానీ,
పైలోకాల్లో కనబడకుండా ఉన్నారని భావించబడే
దేవతలూ, గ్రహాలూ గానీ,
కర్మగానీ, కాలంగానీ,
ఈశ్వరుడు గానీ,
ఎవ్వరూ కారణం గాదు.

అశుద్ధమైన, కామపూరితమైన
మన మనస్సే కారణం
అని సర్వశాస్త్రాలసారం.

అశుద్ధమైన మనస్సువల్ల అజ్ఞానం
అజ్ఞానంవల్ల కామప్రేరితమైన కర్మలు=గుణకర్మలు
గుణకర్మలవల్ల సంసారం

కనుక
మనస్సును నిగ్రహించి నిష్కామం చేసుకొనుటయే
మానవకర్తవ్యం.

ఓం తత్ సత్

# సంసారతాపం పోవాలంటే

1 సాధనకర్మ ఆచరించాలి.

2 ఇంద్రియలౌల్యం చావాలి.

3 చిత్తైకాగ్రత పొందాలి.

4 శ్రవణానందం అనుభవించాలి.

5 మననాభ్యాసం అలవడాలి.

6 నిదిధ్యాసన సౌభాగ్యం కలగాలి.

7 ఆచరణామృతం అబ్బాలి.

8 సంసారతాపం చల్లారాలి.

ఓం తత్ సత్

# మహావాక్యములు

1 ఏకమేవాద్వితీయం బ్రహ్మ

2 ప్రజ్ఞానం బ్రహ్మ

3 తత్త్వమసి

4 అహం బ్రహ్మాస్మి

5 అయమాత్మా బ్రహ్మ

6 విజ్ఞానమానన్దం బ్రహ్మ

7 సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ

8 సర్వం ఖల్విదం బ్రహ్మ

9 బ్రహ్మసత్యం జగన్మిథ్యా

10 జీవో బ్రహ్మైవ నాపరః

11 ఆత్మైవేదం సర్వం

12 వాసుదేవస్సర్వం

ఓం తత్ సత్

# అభ్యాసము = సాధన

అభ్యాసయోగ-యుక్తేన, చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి, పార్థానుచిన్తయన్. (గీ8-8)
అభ్యాసయోగేన తతః, మామిచ్ఛాఽప్తుం ధనఞ్జయ! (గీ12-9)

అని మాధవుడు మాటిమాటికి నీకు హితబోధ చేస్తూ సాధనను గురించి సందేహరహితంగ ఉపదేశిస్తున్నాడు.

తింటం, త్రాగటం, సినిమాలూ, భరతనాట్యాలూ, మోసాలూ, అన్యాయాలూ, వీటిలో మునిగిపోతూ, జీవితాన్ని పాడుచేసుకోవద్దు.

# సాధన చెయ్యి తండ్రీ!

దుఃఖాలు నీవు కోరకపోయినప్పటికీ అవి రావలసిన సమయంలో, నీకు తప్పనిసరిగా, నీ పూర్వకృతకర్మఫలంగా ఎట్లాసంభవిస్తున్నవో, అట్లా సుఖాలు కూడా నీకు రావలసినప్పుడు, నీవు ఏం చేసుకొచ్చావో దానికి తగినట్లుగా రానేవస్తవి. వాటికోసం, పూజలూ నోములూ అక్కరలేదు అనే సంపూర్ణవిశ్వాసంతో, పరమాత్మతత్త్వాన్ని తెలుసుకోటానికే

సాధనకర్మను ఆచరించు
ఉత్తిష్ఠత! జాగృత!! ప్రాప్యవరాన్నిబోధత!!!

లే! నిద్రనుంచి మేలుకో!! సత్సాంగత్యం వల్ల పరమార్థం తెలుసుకో!!!

సాధన అంటే,

1 క్రింద ఉన్న మానసికార్చన మంత్రములను కంఠస్థంచేసి, ప్రతిదినమూ, ఏకాంతమందుండి కండ్లుమూసుకొని అర్థయుక్తంగా జపించటం.

2 క్రమంగ, శ్రీమద్భగవద్గీతోపనిషత్తులలోని పదునెనిమిది అధ్యాయములను కంఠస్థం చేసి, అర్థయుక్తంగా మననం చేయటం, తత్త్వదృష్టితో తత్త్వమును గ్రహించి, తదనుగుణంగ ఆచరించటం.

సాధన చెయ్యండి తల్లులారా! తండ్రులారా!!
తత్త్వదృష్టిని అలవరచుకోండి!

ఓం తత్ సత్

# మానసికార్చన మంత్రములు

1 ఓం శ్రీకృష్ణాయ నమః
2 ఓం వాసుదేవాయ నమః
3 ఓం హరయే నమః
4 ఓం గోవిన్దాయ నమః
5 ఓం సంసారవైరిణే నమః
6 ఓం నారాయణాయ నమః
7 ఓం పరస్మైబ్రహ్మణే నమః
8 ఓం పరమపురుషాయ నమః
9 ఓం పరాత్పరాయ నమః
10 ఓం పరమేశ్వరాయ నమః
11 ఓం నిర్గుణాయ నమః
12 ఓం నిర్వికారాయ నమః
13 ఓం నిరాకారాయ నమః
14 ఓం నిరఞ్జనాయ నమః
15 ఓం అజాయ నమః
16 ఓం అవ్యక్తాయ నమః
17 ఓం అవ్యయాయ నమః
18 ఓం అవాఙ్మానసగోచరాయ నమః
19 ఓం అనిరూప్యస్వరూపాయ నమః
20 ఓం ఆదిమధ్యాన్తరహితాయ నమః
21 ఓం వేదవేద్యాయ నమః
22 ఓం లీలామానుషవిగ్రహాయ నమః
23 ఓం సచ్చిదానన్దవిగ్రహాయ నమః
24 ఓం గీతాఽమృతమహోదధయే నమః
25 ఓం జగద్గురవే నమః

ఓం తత్ సత్

ఓం పరస్మైబ్రహ్మణే నమః ఓం శ్రీకృష్ణాయ నమః
ఓం జగద్గురవే నమః ఓం సంసారవైరిణే నమః
ఓం గీతాఽమృతమహోదధయే నమః

# ముక్తి=మోక్షం ఏమిటో?-ఎలాగో?

మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః.
బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్.
(అమృతబిందూపనిషత్ 1)

మనుష్యులు సంసారంలో బంధింపబడ్డారో లేక సంసారంనుండి ముక్తిని =మోక్షంను పొందారో నిశ్చయించటానికి ఒకే గీటురాయి చెప్తున్నది శాస్త్రం. అదే మనస్సు. ఈ రెండింటికీ మనస్సే కారణం. తెచ్చినబంగారం కల్తీసరుకా లేక స్వచ్ఛమైనదా, ఎటువంటి వన్నె కలది అని తెలుసుకోవాలంటే, గీటురాయిమీద గీచిచూచి నిశ్చయించినట్లే, మనుష్యుల బంధమోక్షాలూ-జ్ఞానాన్నీ ఎంచటానికి మనస్సే గీటురాయి. మనస్సు-మనస్సు-మనస్సు అంటూ అంటూంటారేగానీ అది అంటే ఏమిటో-ఎలాంటిదో-ఎక్కడ-ఏవిధంగా-ఎందుకుంటుందో? దాని స్వరూపమేమో తెలియదు చాలామందికి--- తలకణతమీద వ్రేలుపెట్టి నా మనస్సు అని అంటూంటారు. ఉపనిషత్తులు సమాధానం చెప్తునయ్ చూడు నాయనా! అంతఃకరణం అనే మాట విన్నావుకదూ! అంటే లోపలిపనిముట్టు, అది ఎలాఉన్నదో దాని స్వరూపం తెలియకపోయినా, అది లోపలఉండి చేసేపని అందరికీ వ్యక్తమవుతూనే ఉన్నది. ఎప్పుడూ ఏదో తెలుసుకొనే ప్రయత్నంలో, ఈఅంతఃకరణం నాలుగువిధాలుగా (నాలుగు ఏజెన్సీలలో) పనిచేస్తూ ఉంటుంది. ప్రతివిషయాన్ని గురించి

1 మంచిది-బాగాలేదు-ఇది న్యాయం- అది అన్యాయం - అని సంకల్పవికల్పములు చేస్తూ ఉంటుంది, నిశ్చయంచెయ్యక ఊగులాడుతుంటుంది--- ఇలా చేసేదే మనస్సు.

2 సంకల్పవికల్పాలలో ఒక నిశ్చయంచేసి విషయాలను గ్రహించేదే బుద్ధి.

3 నిశ్చయంచేసేముందు ఆసమయంలో-ఈవిషయంలో-అలా జరిగింది. మరోసమయంలో-ఇంకోలా జరిగింది అనిచెప్పే పూర్వపుస్మృతులే చిత్తం.

4 నిశ్చయం అయిన తర్వాత, నిశ్చయప్రకారం విషయంలో తగుల్కొని కర్మలు చేసేదే అహంకారం.

అంటే, అంతఃకరణం చేసే నాలుగువిధాలైన పనులే మనస్సు-బుద్ధి-చిత్తం-అహంకారం అనే నాలుగు పేర్లతో చెప్పబడుతున్నయ్. అయితే,

మనస్సు సంకల్ప-వికల్పములు చేస్తున్నది కనుక బుద్ధి నిశ్చయం చెయ్యవలసి వస్తున్నది. బుద్ధి నిశ్చయంచెయ్యాలి కనుక, మంచీచెడ్డా విచారించటానికి చిత్తంనుండి పూర్వపుస్మృతులను జ్ఞాపకం చేసుకుంటున్నది, నిశ్చయం చేస్తున్నది. బుద్ధి నిశ్చయంచేస్తున్నది కనుక, నిశ్చయానికి తగినట్లు అహంకారంEXECUTIVE OFFICER పనులు చేస్తున్నది, అమలుపరుస్తున్నది. ఇంతకీ కారణం మనస్సూ, మనస్సు సంకల్పవికల్పములు చెయ్యటమూ. ఇదే లేకపోతే, అంటే మనస్సు సంకల్పములుచెయ్యకనేపోతే, బుద్ధి నిశ్చయమూ చెయ్యనక్కరలేదు, చిత్తంనుండి పూర్వస్మృతులను జ్ఞాపకం చేసుకోనవసరమూలేదు, అహంకారం పనులు చెయ్యనవసరమూ లేదు. లోపలనుండి (దేహంలోపలనుండి) కనిపించకుండ ఇదంతా జరగటానికి మనస్సే కారణం కనుక, అంతఃకరణం అని చెప్పటానికి మనస్సు అని చెప్తున్నది ఉపనిషత్తు.

1 ఈ అంతఃకరణం=మనస్సు లోపలఉండి, విషయములమీద ఆసక్తితో కౌగిలించుకొని, విషయములగురించే సంకల్ప-వికల్పములు చేస్తూ, వాటిని భోగించే నిశ్చయాలే చేస్తూ, పూర్వపు అనుభవాలలో కలిగిన సుఖఃదుఃఖాది ప్రమాణాలను యథాతథంగా గ్రహించక, విషయాలలో తగుల్కోవటమే విషయాసక్తి. సంసరతి అనేన ఇతి సంసారః విషయాసక్తి క్రమంగా పెరుగుతూ, విషయభోగములు అనుభవించిన కొద్దీ వృద్ధిచెందుతూ -- ఒకదాని తర్వాత ఒకటి, ఒకదానిని విడిచి ఇంకోదానిని - ఈ విధంగా మళ్ళీమళ్ళీ విషయాలలోకి జారిపడతారు. కోరిన విషయభోగాలననుభవించటానికి తగిన శరీరాలలోకి జారిపడుతుంటారు, చిక్కుకుంటుంటారు. చిక్కుకున్న దేహంతో విషయవాసనలను ఇంకా పెంచుకుంటారు. మళ్ళీ చచ్చి మళ్ళీమళ్ళీ పుట్టి, సంసారకారాణాన్ని పటాపంచలు చేసుకోక సంసారంలో ఇరుక్కుపోతారు, బంధంలో పడతారు. అంటే విడివడేమార్గం చిక్కక సంసారంలో కట్టుపడిపోతారు. ఈ అంతఃకరణం=మనస్సు లోపలఉండి, కనిపించకపోయినా, ఇంత పనిచేస్తున్నది, కనుక మనస్సుయొక్క స్వరూపం విషయవాసనలే. ఇదే అశుద్ధమైన మనస్సు -- బంధానికి కారణం - బంధం.

2 నిర్విషయమైన అంతఃకరణమునకు=మనస్సుకు విషయాసక్తి లేదు, సంకల్పవికల్పములూ లేవు, విషయభోగముల స్మరణా-నిశ్చయములూ లేవు. కనుక వాటిలో తగుల్కోవటమూ, కర్మలు చెయ్యటమూ లేవు. కనుక సంసారం (మళ్ళీమళ్ళీ జారిపడటమూ) లేదు. మళ్ళీమళ్ళీ దేహాలలోకి రావలసిన పనీలేదు, బంధమూలేదు. అంటే, నిర్విషయం= విషయవాసనలు లేని అంతఃకరణం=మనస్సే ముక్తి, ఇదే శుద్ధమైన మనస్సు. అంటే--- విషయవాసనలచేత అశుద్ధమైన మనస్సే బంధం=బంధస్వరూపం. విష

యవాసనల లేమిచే శుద్ధమైన మనస్సే ముక్తి=మోక్షం=మోక్షస్వరూపం. అంటే, కాఫీయందు ఆసక్తి (విషయాసక్తి) ఉంటే కాఫీకోసం ప్రయత్నించాలి. ఎవరైన తిట్టినా-కొట్టినా పడాలి, డబ్బు ఖర్చుచెయ్యాలి, సమయానికి దొరకకపోతే చికాకుపడాలి, తలనొప్పిని అనుభవించాలి, ఎవరింటికైనా వెళ్ళినప్పుడు కాఫీ ఇస్తారేమోనని ఆశించాలి -- ఇస్తారా అనిఅడగాలి, అడుగడుగుకు హోటళ్ళను పావనంచేసి కాఫీ సేవించాలి. కాఫీ ఆశ ఉన్నంతవరకు మళ్ళీమళ్ళీ ఈజన్మలెత్తాలి. ఇదీ కాఫీతోడి బంధం, విషయాసక్తివల్ల కలిగేబంధం. ఈబంధం పోవాలంటే కాఫీయందు ఆసక్తి చావాలి. వేరే మార్గం లేదు. కాఫీయందు ఆసక్తి=కోరిక చస్తే కాఫీ (బంధం)నుండి ముక్తి=మోక్షం=విడుదల కలుగుతుంది. బంధం సంపూర్ణంగా పటాపంచలు కావాలంటే విషయాసక్తి=కోరికలు అన్నీ చావాలి. బాహ్యంగా నామరూపాలతో కనబడే కాఫీలాంటి వాసనలు=కోరికలూ, నామరూపాలతో కనిపించని సుఖదుఃఖాది ద్వంద్వభావాల వాసనలూ అన్నీ సున్నకావాలి. అప్పుడే ముక్తి=మోక్షం=విడుదల. విషయవాసనలు సున్నకావటానికి చేసేప్రయత్నమే ముక్తికి సోపానం, జ్ఞానానికి నిచ్చెనలు. సిగరెట్ త్రాగేవారు సిగరెట్ మానితే, కృతయుగంలో వెయ్యియజ్ఞాలు చేసినఫలం పొందుతారు. ముక్తిపథంలో ఒక సోపానాన్ని అధిరోహిస్తారు. అర్ధనగ్న వేషధారణలు మానితే, సర్వాంగశోభితంగా ఆచరించిన కోటి అక్కలమ్మనోముల ఫలమూ, అనంతకోటి చేటలనోముల ఫలమూ దక్కుతుంది. రేడియోలూ-ట్రాన్సిస్టర్లూ-టెలివిజన్లతో ఊగులాడే దురాచారం పోతే వెయ్యిజన్మలపాపం నాశనమవుతుంది. సినిమాలూ-సర్కస్‌లూ-వారపత్రికలూ-తారలదుమ్ములూ(STAR DUST)లూ మనోదృక్పథంలో మాసిపోతే కోటిజన్మలపాపం కొండల పైఅంచులకు ఎగిరిపోతుంది. అద్దంలో అందం చూచుకొనే షోకు అణిగిపోతే కోటిజన్మలపాపం అందకుండా ఆకాశంలోకి లేచిపోతుంది. గోరింటాకుతో అందం-సౌభాగ్యాలను కోరే ప్రవృత్తిపోతే ఎన్నోజన్మల పాపాలను గోటితో పెరికిపారేసే శక్తి లభిస్తుంది. శ్రీరామకృష్ణ పరమహంసవలె భార్యను తల్లిగా చూడగలిగినటువంటి బ్రహ్మచర్యాన్ని పాటించగలిగితే సర్వపాపాలూ దహించుకుపోతయ్. కామం సంపూర్ణంగా నాశనమవుతేనే ఆత్మతత్త్వం అవగతమవుతుంది.

యత్రాభిలాషః తన్మ్నానం సంత్యజ్య స్థీయతే యది,
ప్రాప్త ఏవాఙ్గ తన్మోక్షః కిమేతావతి దుష్కరమ్. (వా.రామా)

ఇంతెందుకు? నీకు ఏవేవి-ఎక్కడ-ఎలా అభిలాష=కోరిక ఉన్నదో వాటినన్నిటిని నాశనంచేసి ఉండగలిగేవాడవే అయితే, నీవు నిజంగా అలా ఉండగలవాడవే అయితే, నీవుకోరిన మోక్షం నీకు ప్రాప్తమైందనే తెలుసుకో

పో అంటున్నది వాసిష్ఠ రామాయణం.

కనుక, నీవు నిజంగ మోక్షంను కోరినవాడవైతే, నీ మనస్సును విషయ వాసనలనుండి మళ్ళించు-నిగ్రహించు--వాటిని జయించు, తత్త్వవిచారణ చెయ్యమని సర్వశాస్త్రాల సారం నాయనా! సుసుఖం కర్తుం (గీ9-2)

శాస్త్రం పదేపదేచెప్తున్న ఈమాటను ఆచరించటం ఏమీ కష్టంకాదు నాయనా! నిజానికి అంతకంటే సుఖమైనదీ-సులభమైనదీ ఇంకొకటి లేదు.

**సుమనః పల్లవా మర్దే కిఞ్చిద్వ్యతికరో భవేత్.**

**పరమార్థపదప్రాప్తౌ న తు వ్యతికరో ఽల్పకః.** (వా.రామా.)

లేత చిరుగునుగానీ, లేత పుష్పాన్నిగానీ వ్రేళ్ళమధ్యకు తీసుకొని కొద్దిగా నలపాలన్నా కొంతప్రయత్నం కావాలి. పరమార్థం గ్రహించాలంటేనూ, ముక్తిని పొందాలంటేనూ అసలు ప్రయత్నమే అక్కరలేదు. అశుద్ధమైన నీ మనస్సు కోరిన విషయాలన్నిటిని కాదని తోసేస్తూ ఉండు.

# వద్దు వద్దు వద్దు వద్దు

అనే మహామంత్రాన్ని మననం చెయ్యి, ఈతారకమంత్రం పట్టుకో **అంతే.** మోక్షం నీ హస్తగతమౌతుంది. కొన్నాళ్ళకు క్రమంగా విషయవాసనలు నీమనస్సు జోలికికూడా రావు. వద్దు వద్దు అని స్మరించవలసిన అవసరంకూడా లేకుండా పరమానందం పొందుతావు.

**అసంయతాత్మనా యోగః, దుష్ప్రాప ఇతి మే మతిః,**

**వశ్యాత్మనా తు యతతా, శక్యో ఽవాప్తుముపాయతః.** (గీ6-36)

కానీ, నీకు నిజంగా ముక్తిని పొందాలనే ఇచ్ఛ లేక, ముక్తికి ఇంత సుఖమైన-సులభమైన మార్గాన్నికూడా ఆచరించే పసలేక,

1 బుడబుక్కలవాడు నూనెగుడ్డలు అనేకంగా వేసుకొని, బొంతలు వ్రేళ్ళాడదీసుకొని, తలపాగ ఇంకాఇంకా..... ఒంటినిండా అడ్డమైన బరువంతా వేసుకొని, క్షణం తీరికలేకుండా బుడబుక్కలు వాయించుకుంటూ రొద చేసినట్లుగానూ

2 చిన్న పిల్లవాళ్ళు రోడ్లమీదపోతూ, సోడామూతగానీ, సిగరెట్ పాకెట్ గానీ, అగ్గిపెట్టె బొమ్మగానీ----ఏవీ దొరికినా సంతోషంతో ఎగిరి దుమికి "అః...నాకూ....దొరికిందీ...నాకూ" అంటూ కల్పించినరాగాలు ఆలాపించినట్లుగానూ

3 "అంగడికి పోయి మందు తీసుకురారా తల పగిలిపోతోంది" అని తండ్రి చెప్తే, "రాత్రి 9 గంటలయింది. అంగడి ఉంటుందో లేదో" "ఉంటుంది. నాకోసం ఉంటానని చెప్పాడు పోయిరారా!" "కాంపౌండరు

ఉంటాడో లేదో" "ఉంటాడు పోయిరారా" "బస్సులు దొరుకతయ్యో లేదో" "దొరుకుతయ్‌రా! లేకపోతే సైకిలుమీద పోయిరారా" "కుక్కలుంటయ్యేమో" - అని అంటూ ఒక్క అడుగుకూడా ముందుకువెయ్యకనే వెయ్యి కుంటిసాకులు చెప్పే కుర్రవాడి వేషంలోనూ

4 తలంచుకుంటే ఎంతసేపూ, అట్టేసేపు పట్టదు. ఒకనెలరోజులలో--అయితే అసలు సిసలు సన్యాసినవుతా, కాకపోతే మొదటిరకం తాగుబోతునైనా అవుతా - అనే అసమర్థుడి ఫక్కీలోనూ, విషయవాసనలలో దారిన ఉన్న పెంటకుప్పనంతా నెత్తినవేసుకొని, నెత్తినవేసుకున్న చెత్తగురించే డబ్బా వాయిస్తూ, డబ్బా చప్పుడులోనే మురిసిపోతూ, మురిసేదాన్ని విడవమంటే కుంటిసాకులూ-దొంగసాకులూ వదర్తూ ఏముందండీ! ఎంతసేపండీ!! అనే అసమర్థులకు చేతగాదు గానీ---

నిజంగా మోక్షమేకావాలనీ, శాశ్వతసుఖాన్నిపొందాలనీ (నిజంగా)కోరినవారికి విషయవాసనలను నిగ్రహించటానికి ఎన్నో ఉపాయాలున్నయ్, ఎన్నెన్నో మార్గాలున్నయ్--- నేను చెప్తాను-చూపిస్తాను అంటున్నాడు భగవంతుడు భగవద్గీతలో.

మన్మనా భవ మద్భక్తః, మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవమ్, ఆత్మానం మత్పరాయణః. (గీ9-34)

బంధకారణాలైన విషయాలమీదకు విసుగులేకుండా విరుచుకు పడుతున్న నీమనస్సును మళ్ళించి, మోక్షస్వరూపమైన నాతత్త్వంమీద లగ్నంచెయ్యి. విషయాలను కోరి-కోరి-అనుభవిస్తూ వాటి భక్తుడవవుతున్న దుర్మార్గాన్ని విడిచి, మోక్షస్వరూపమైన నా తత్త్వాన్ని కోరే నాభక్తుడవవు. విషయాలలో మగ్గి వాటికోసం ప్రయత్నించి, వాటినే ఆరాధించే నీపాతబాటకు ఫుల్‌స్టాప్ పెట్టి, మోక్షస్వరూపమైన నాతత్త్వాన్ని మననంచేసి ఆరాధించు. విషయభోగాలు విరివిగా విసురుతారని ఆశించి అడ్డమైన దేవతలకు మ్రొక్కటమూ, నరరూప రాక్షసులను ఆశ్రయించటమూ అనే వెఱ్ఱితనం విడిచిపెట్టి, నాకు నమస్కారం చెయ్యి. మోక్షస్వరూపమైన నాతత్త్వం కోసం బంధకారణాలైన విషయవాసనలను త్యాగంచెయ్యి=విడిచిపెట్టు. ఏదో నేను చెప్తున్నానుగదా అనికాదు, మోక్షస్వరూపమైన నా తత్త్వం తెలుసుకున్నందువల్లనూ, నన్నే పరమగతిగా నాగురించే సర్వవిధాల ప్రయత్నించినందువల్లనూ, నన్నుపొంది నీవుకూడా మోక్షస్వరూపుడవవుతావనీ, నీసంసారబంధం తుత్తునియలైతుందనీ విశ్వసించి నేను చెప్పినవిధంగా నిగ్రహరూప అభ్యాసం=తపస్సు చెయ్యి! అని భగవంతుని బోధ తల్లులారా తండ్రులారా!

ఏమిటో స్వామి! ఎవరు ఎన్నిమార్లు చెప్పినా అశుద్ధమైన మనస్సనీ, విషయవాసనలలో నిండా మునిగి పోయిందనీ.

విషయవాసనలు మాడి పోవాలనీ ఇంద్రియాలను నిగ్రహించాలనీ
మనస్సును నియమించాలనీ కోరికలన్నీ సున్న కావాలనీ
జగద్భావం అంతమై పోవాలనీ

ఎప్పుడూ చెప్తుంటారు. అసలు, విషయవాసనలుంటే మోక్షం పొందలేక పోవటమేమిటో బోధపడదు. ఇవన్నీ భగవంతుడే సృష్టిచేశాడు గదా! వీటిని అనుభవించటమంటె భగవంతుని ఆరాధించటమే గదా! మరి వీరంతా నిగ్రహించమంటారెందుకు?

ఇవి అర్థంలేని ప్రశ్నలు నాయనా! ఇలాంటి ప్రశ్నలు ఉదయించటానికి కారణమేమో తెలుసా! విషయవాసనాధిక్యతయే. జగత్తూ–విషయాలే బాగారుచిగా ఉండి మోక్షఇచ్ఛ లేనివారు ఇలాంటి ప్రశ్నలు వేస్తుంటారు.

**వ్యవసాయాత్మికా బుద్ధిః, ఏకేహ కురునన్దన,**
**బహుశాఖా హ్యనన్తాశ్చ, బుద్ధయో ఽవ్యవసాయినామ్.** (గీ2–41)

మోక్షేచ్ఛగలిగి, ఏమాత్రమైన అభ్యాసంచేసి, కొంతైనా ఆనందం అనుభవించినవాని దృష్టి ఎప్పుడూ మోక్షమును కోరేఉంటుంది. మోక్షము కోసం ఏమైనా చేస్తాడు. ఏది నిగ్రహించమన్నా **మారుమాట్లాడకుండా** ప్రయత్నిస్తాడు. స్వయంగా నివృత్తిమార్గదృష్టిని పెంచుకొని అభ్యాసంచే సుకుంటూ పోతాడు. అలాంటివారికి ఇలాంటి శంకలూరావు, ఇన్నిసార్లు ఇన్నివిధాల చెప్పనవసరమూ లేదు. వారి నిరంతర అభ్యాసంచేతనూ– అనుభవంచేతనూ కొంచెంచెప్తే దానినిబట్టి తత్త్వాన్ని గ్రహించి, మరింత మననంచేసి అల్లుకుపోతుంటారు. వారి విషయమే వేరు. కానీ మోక్షేచ్ఛ లేనివారు ఎన్నోవిధాలుగా ఊహించి, సదభ్యాసంను ఎలా తప్పించుకోవాలో ఆలోచిస్తుంటారు. శాస్త్రాలలో తమ విషయభోగాలకు సరిపోయే అర్థాలను ఊడలాగుతుంటారు. ఇటువంటివి కోటానుకోట్ల వాదాలు చేస్తుంటారు. వీరందరికీ సమాధానం––

భగవంతుడు విషయవాసనలను సృష్టి చెయ్యలేదనీ, ఎవరి జగత్తుతోనూ భగవంతునికి సంబంధంలేదనీ, భగవత్తత్త్వం నిరంజనమనీ, భగవంతునికి జగత్తుతో సంబంధం కల్పించటంగానీ–ఊహించటంగానీ శుద్ధమూర్ఖత్వమనీ ఇదివరకు ప్రవచనాలలో చాల విస్తృతంగానే విచారించుకున్నాం. ఇప్పుడు, విషయవాసనలుంటే మోక్షం ఎందుకుపొందలేరో, కఠోపనిషత్తు ఏంచెప్తున్నదో చూద్దాం పట్టు.

**యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి,**
**ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ.** (కఠఉ.2–1–15)

శుద్ధమైననీరు శుద్ధమైననీటితో కలిస్తే, మిశ్రమం శుద్ధమైననీరుగానే ఉంటుంది. శుద్ధమైననీరు అశుద్ధమైననీటితో కలిసినప్పుడూ, అశుద్ధమైననీరు

శుద్ధమైననీటితో కలిసినప్పుడూ, అశుద్ధమైననీరు అశుద్ధమైన నీటితో కలిసిన ప్పుడూ--- మిశ్రమం అశుద్ధమైన నీరుగానే ఉంటుంది. అలాగే, తత్త్వం తెలుసుకున్నవారే మోక్షరూప ఆత్మతత్త్వాన్ని పొందుతారు. అంటే--- శుద్ధమైన మిశ్రమమే మోక్షం=కైవల్యం =భగవదైక్యం. శుద్ధమైన నీస్వరూ పమూ, శుద్ధమైన పరమాత్మస్వరూపమూ కలిసినప్పుడే శుద్ధమైనమిశ్రమం అనిచెప్పబడే కైవల్యం=భగవదైక్యం కలుగుతుంది. భగవదైక్యమంటే, సినిమాలలో చూపించినట్లు, నీలోనుంచి ఒక జ్యోతిలేచి గుళ్ళోఉన్న దేవుడి విగ్రహంలో కలవటం కాదు నాయనా! ఇలా నామరూపాలతో కనిపించే జ్యోతి లేవటం కాదు. అజ్ఞానమయమై, సంసారకారణమైన నీదేహంనుండి, నీదేహాన్ని విడిచి, నీదేహభావాన్ని విడిచి, నీజ్ఞానం (జ్ఞానజ్యోతి) పరమాత్మతత్త్వాన్ని వెతుక్కుని పోయి నిరంతర అభ్యాసంచేత కలుసుకోవాలి. అప్పుడే, అదే భగవదైక్యం. మరి జ్ఞానజ్యోతి అంటే, అదెలా ఉంటుందో, కఠోపనిషత్తు ఏంచెప్తున్నదో చూద్దాం పట్టు నాయనా! భగవదైక్యాన్ని ప్రసాదించేదే జ్ఞానం=జ్ఞానజ్యోతి అనీ, మరేదీకాదనీ ముందుగా తెలుసుకో! శుద్ధమైన పరమాత్మ స్వరూపాన్నీ, శుద్ధమైన నీనిజస్వరూపాన్నీ తెలుసుకోగలిగినదే జ్ఞానజ్యోతి.

1 పరమాత్మస్వరూపం=పరమాత్మతత్త్వం ఎప్పుడూ శుద్ధంగానే ఉన్నది--- అంటుకోవటానికి అశుద్ధం సాహసించలేదు కూడాను. అంటే, జన్మవ్యాధిజ రామృత్యువులనే అశుద్ధములుగానీ, సుఖదుఃఖాది ద్వంద్వభావాల అశుద్ధంగానీ పరమాత్మతత్త్వం జోలికేరావు. కనుక ఇప్పుడు అభ్యాసంచేత పరమాత్మ స్వరూపాన్ని (తత్త్వాన్ని) శుద్ధం చెయ్యవలసిన అవసరం లేదు. కానీ, (ఇప్పుడు నీవు అనుకుంటున్నట్లుగా) పరమాత్మకు=భగవంతునికికూడా పుట్టటం-పెరగటం-చావటం-ఇల్లు-వాకిలి-భార్య-సంసారం-మొదలైనవన్నీ (నీకు లాగానే) ఉన్నవనుకొనే నీఅశుద్ధభావాలు పోవాలి. అంటే పరమాత్మతత్త్వం స్వయంగా శుద్ధమే అయినప్పటికీ, నీదృష్టిలో అశుద్ధమైనదానివలెనే ఉన్నది కనుక, నీదృష్టిలో ఉన్న ఈఅశుద్ధం పోవాలి. నీదృష్టిలోకూడా పరమాత్మతత్త్వం, శుద్ధమైన తత్త్వంగానూ-ఉన్నదిఉన్నట్లుగానూ-శుద్ధంగానే ఉండాలి. అంటే, శుద్ధమైనపరమాత్మతత్త్వం తెలుసుకోవాలి. ఇది మొదటి జ్ఞానజ్యోతి.

2 నిన్ను నీవు శుద్ధంచేసుకోవాలి. దేహేంద్రియాదులతో స్నేహంచేసి, వాటిలోకలిగే మార్పులను నీవిగానే అనుకొని, అవికోరుతున్నవన్నీ నీకే కావాలనుకుంటూ, ఈ కోరికలలోనూ- విషయవాసనలలోనూ కాలం గడిపేస్తున్నావు. అసలు నీ నిజస్వరూపానికి ఈ గోలంతా అక్కరలేదు-లేదు, శుద్ధమైనదే నీనిజస్వరూపం. శుద్ధమై-స్వచ్ఛమైన తెల్లటి పాలరాతిగోడమీద అశుద్ధం విసిరినట్లుగానే, శుద్ధమై-స్వచ్ఛమైన నీనిజస్వరూపంమీద దేహేంద్రి

యాదుల వ్యాపారమనే అశుద్ధాన్ని అంటించుకొని తిరుగుతున్నావు. కనుక, నీదేహేంద్రియాదుల వ్యాపారం ముగించుకొని, నీకోరికలు సున్నచేసుకొని, నీవిషయవాసనలు నాశనంచేసుకొని, నిన్ను-నీవు శుద్ధంచేసుకుంటేనే పరమాత్మతత్త్వంలో చేరిఐక్యం పొందుతావు, శుద్ధమైన కైవల్యం=భగవదైక్యం పొందుతావు. కనుక, నీనిజస్వరూపంను అనుభవపూర్వకంగా తెలుసుకోవాలి. ఇది రెండవ జ్ఞానజ్యోతి.

ఈరెండూ నీఅభ్యాసం అనే నాణానికి బొమ్మాబొరుసులుTWO FACES. ఈరెండింటినీ ఇలా శుద్ధమైనవిగా తెలుసుకున్నప్పుడే శుద్ధమైన మిశ్రమం=మోక్షం లభ్యమవుతుంది. ఇలా కాకుండా

1 పరమాత్మ తత్త్వాన్ని శుద్ధంగా తెలుసుకోకపోయినా

2 నీనిజస్వరూపాన్ని తెలుసుకొని నిన్ను-నీవు శుద్ధంచేసుకోకపోయినా

నీఅభ్యాసంవల్ల నీవుపొందే ఫలం (మిశ్రమం) అసంపూర్ణమే, శుద్ధమైనది కాదు. ఎలాగైతే, మిశ్రమంచెందే నీళ్ళల్లో ఏనీటిలోగానీ ఎంతఅశుద్ధం ఉన్నా మిశ్రమం అంతటి అశుద్ధంగానే అవుతుందో, అలాగే పరమాత్మతత్త్వగ్రహణంలోగానీ, నీనిజస్వరూపానుభవంలోగానీ ఎక్కడ-ఎలాంటి అశుద్ధభావాలూ-అభ్యాసమూ ఉన్నప్పటికీ ఫలం అసంపూర్ణమైనదే, శుద్ధమైనది కాదు. సంపూర్ణమైన జ్ఞానజ్యోతిని పొందిన మునులు=జ్ఞానులే మునేర్విజానతః ఆత్మను పొందుతారు, మోక్షసౌభాగ్యాన్ని అనుభవిస్తారు, కైవల్యం=భగవదైక్యం పొందుతారు అని కఠోపనిషత్తు చెప్తున్నది.

**తత్త్వమసి** అనే మహావాక్యంకూడా ఇలాగే బోధిస్తున్నదని వెనుక ప్రవచనగ్రంథాలలో విచారించుకున్నాం. నీ గమ్యం=ధ్యేయవస్తువైన పరమాత్మా-నీనిజస్వరూపమూ రెండూ విషయవాసనావివర్జితమై ఉన్నయ్. కనుక, విషయవాసనాభరితమైన మనస్సుతో గమ్యం చేరుకోలేవు, మోక్షం=ముక్తిని పొందలేవు అని శంకకు తావేలేకుండా చెప్తున్నయ్ సర్వశాస్త్రాలూ.

**ప్రజహాతి యదాకామాన్, సర్వాన్ మనోగతాన్**
**...స్థితప్రజ్ఞస్తదోచ్యతే.** (గీ2-55)

మనస్సులోని కోరికలన్నీ ఎప్పుడు జయిస్తాడో అప్పుడు ప్రజ్ఞగలవాడు=జ్ఞాని=స్థితప్రజ్ఞుడు అని పిలువబడుతాడు.

**యస్సర్వత్రానభిస్నేహః, తత్తత్ప్రాప్య శుభాశుభమ్,**
**నాభినన్దతి న ద్వేష్టి, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.** (గీ2-57)

ఎవడు, శుభాశుభములనబడే విషయములందు స్నేహంలేకుండా, అవి వచ్చినా-రాకున్నా సుఖదుఃఖాదిద్వంద్వాలను అనుభవించకుండా ఉంటాడో వాని ప్రజ్ఞయే ప్రజ్ఞ.

**యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.** (గీ2-58)

ఇంద్రియాలనన్నిటినీ ఇంద్రియార్థములనుండి నిగ్రహించినప్పుడే వానిప్రజ్ఞ ప్రజ్ఞ అనబడుతుంది.

**ఇన్ద్రియాణి ప్రమాథీని, హరన్తి ప్రసభం మనః.** (గీ2-60)

ఇంద్రియాలూ-కోరికలూ చాలా బలీయమైనవి. జ్ఞానుల ప్రజ్ఞను కూడ కూలగొట్టటానికి ప్రయత్నిస్తుంటయ్.

**తాని సర్వాణి సంయమ్య, యుక్త ఆసీత మత్పరః,**
**వశే హి యస్యేన్ద్రియాణి, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.** (గీ2-61)

కనుక, ఇంద్రియాలనన్నిటినీ వశంచేసుకొని, నా తత్త్వంకోసమే ప్రయత్నించేవాని ప్రజ్ఞయే ప్రజ్ఞ.

**ఇన్ద్రియాణాం హి చరతామ్, యన్మనోఽనువిధీయతే,**
**తదస్య హరతి ప్రజ్ఞామ్, వాయుర్నావమివామ్భసి.** (గీ2-67)

ఇంద్రియాలవెంబడి పరుగెత్తేవాడు మూర్ఖుడు. వాడికి ఉన్నప్రజ్ఞకూడా ఊడుతుంది-నాశనమవుతుంది.

**తస్మాద్యస్య మహాబాహో, నిగృహీతాని సర్వశః,**
**ఇంద్రియాణీన్ద్రియార్థేభ్యః, తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.** (గీ2-68)

కనుక, ఎవని ఇంద్రియాలు ఇంద్రియార్థములనుండి నిగ్రహింపబడినవో వాని ప్రజ్ఞయే ప్రజ్ఞ.

తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా = వాని ప్రజ్ఞయే ప్రజ్ఞ
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా = వాని ప్రజ్ఞయే ప్రజ్ఞ.

అని మాటిమాటికి ఇంద్రియాలనూ-కోరికలనూ నిగ్రహించాలనీ, అలా చేసినవానిదే ప్రజ్ఞ అనీ, అలాచెయ్యనివాని ప్రజ్ఞ ప్రజ్ఞయేకాదనీ-మూఢమనీ సందేహానికి తావులేకుండా మరీమరీ చెప్తున్నాడు భగవంతుడు భగవద్గీతలో నిజానికి భగవద్గీతలో మొదటినుండి చివరిదాకా, ప్రతిశ్లోకంలోనూ-ప్రతిపదంలోనూ ఇదేమాట స్ఫుటమవుతున్నది. అభ్యాసంయొక్క మొదలూ-చివరా--- అన్ని కోరికలను నాశనంచేసుకోవటమనీ, ఇంద్రియాలనూ మనస్సునూ నిగ్రహించటమనీ చెప్తున్నాడు భగవంతుడు. విజ్ఞానపూర్వకమైన PRACTICAL బోధను చేశాడు నాయనా! గ్రంథాలన్నీ తిరగవేసి పెద్దపెద్ద మాటలలో తత్త్వవిచారణ చెయ్యటం కంటెనూ, మోక్షంలో సప్తభూమికలలో ఎలాగుంటారు అనే ప్రసక్తులనూకూడా తోసేసి ఎవరికి-ఎప్పుడు- ఎన్ని శంకలు వచ్చినా అన్నిటికీ ఒక్కటే సమాధానం, చేయవలసినదీ-చేయగలిగినదీ. PRACTICAL AND PRACTICABLE REPLY.

త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య (గీ3-41)

నువ్వు ముందు ఇంద్రియాలను నిగ్రహించి, కోరికలను జయించు. ఆతరువాత మాట్లాడు అని అందరి నోళ్ళూ మూశాడు భగవంతుడు నాయనా! నీబొంద! చెయ్యమన్నది చెయ్యకుండా, ఇంతవరకు మొదలే పెట్టకుండా, ఏమేమో మాట్లాడుతావేం మూర్ఖుడా! అని తిట్టున్నాడు. చివరిమాటలుగా

సర్వధర్మాన్పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యః మోక్షయిష్యామి మా శుచః. (గీ18-66)

నీ కోరికలన్నీ నాశనంచేసుకో! జగత్తులో నీకున్న ధర్మాధర్మభావాలన్నీ విడిచిపెట్టు. జగద్భావం సున్నచేసుకో. నా తత్త్వం ఒక్కటే తెలుసుకోటానికి ప్రయత్నించు. ఆతర్వాత ఏంజరుగుతుందో నీకు అనవసరం, అవన్నీ నాకు వదిలిపెట్టు, నీవు చెయ్యవలసిన పని చెయ్యి అని అంటున్నాడు. మోక్షంపొందితే ఎలా ఉంటాననే ఆలోచనలుకూడా విడిచి నీకోరికలు సున్నచేసుకోటానికి ఇంద్రియాలను నిగ్రహించు అని బోధిస్తున్నాడు. నీ కోరికలద్వారా, నీ విషయవాసనలద్వారా నీ శక్తి–జ్ఞానమూ వృథా అయిపోతున్నదని హెచ్చరిస్తున్నాడు భగవంతుడు. ఎందుకంటే

న మోక్షో న భసః పృష్ఠే న పాతాలే న భూతలే,
మోక్షో హి చేతో విమలం సమ్యక్ జ్ఞానవిబోధితమ్. (వా.రామా.)
మోక్షస్య న హి వాసోఽస్తి న గ్రామాన్తరమే వా,
అజ్ఞానహృదయగ్రన్థినాశః మోక్ష ఇతి స్మృతః.

మోక్షమనేది ఎక్కడో ఆకాశంలో–ఊర్ధ్వలోకాలలోగానీ–పాతాళలోకంలో గాని–భూలోకంలోగానీ, ఏగ్రామాలలో–పట్టణాలలో–నగరాలలోగానీ, కాపురం చెయ్యటంలేదు నాయనా! ఆచోట్లలో ఎక్కడా దాక్కోనూ లేదు. విషయవాసనలూ–కోరికలూ లేక నిర్మలమైన మనస్సే మోక్షం. నిర్మలమైన మనస్సుయొక్క మోక్షస్వరూపాన్ని తెలుసుకోకుండా మనస్సంతా విషయవాసనలతోనూ–కోరికలతోను నింపి, వాటిల్లో కూరుకొని పోయి, ఆనందిస్తున్నామనుకొనే అజ్ఞానంవల్ల సంకుచితసంసారంలో సతమతమవుతూ

ఇది మంచిదా, అది మంచిదా –– ఏదీ?
ఇప్పుడు మంచిదా, అప్పుడు మంచిదా –– ఎప్పుడు?
వీరు మంచివారా, వారు మంచివారా –– ఎవరు?
ఇలా మంచిదా, అలా మంచిదా –– ఎలా?
ఇక్కడ మంచిదా, అక్కడ మంచిదా –– ఎక్కడ?
ఇందుకు మంచిదా, అందుకు మంచిదా –– ఎందుకు?
ఇన్నిసార్లా, అన్నిసార్లా –– ఎన్ని సార్లు?

శుభమా-అశుభమా--పుణ్యమా-పాపమా--సుఖమా-దుఃఖమా--లాభమా-నష్టమా--న్యాయమా-అన్యాయమా-- ఏమో-ఏలాగో-ఎన్నెన్నో-- అన్నీ సమస్యలే-పీటముడులే-తీరనిసమస్యలే-హృదయగ్రంథులే అని అజ్ఞానంలో వాపోయే దుస్థితి నాశనమయి, సర్వవిషయవాసనలూ-కామములూ నాశనమవటంవల్ల జగత్తు నాశనమయి, హృదయగ్రంథులు విడిపోవటమే మోక్షం.

**మోక్ష ఇతి చ--- నిత్యానిత్యవస్తువిచారాత్**
**అనిత్య-సంసార-సుఖదుఃఖవిషయ-సమస్తక్షేత్ర-మమతాది-**
**సమస్తబన్ధ-సఙ్క్షల్పక్షయో మోక్షః** (నిరాలమ్బ ఉపనిషత్తు)

(శాశ్వతంగా) నిత్యమైన ఆత్మతత్త్వాన్నీ, కాస్సేపు ఉన్నదానివలె కనిపించి ఏడిపించి మోహంలో పడేసి నాశనమయ్యే అనిత్యమైన జగత్తునూ- జగత్పదార్థాలనూ విచారించి--- వీటియందు నిత్యమైన ఆత్మతత్త్వాన్ని గ్రహించి, అనిత్యములైన సంసారసుఖదుఃఖాలనూ, వాటి విషయాలనూ ఈ దేహమూ (ఇప్పటి దేహమూ), గతించిన దేహములూ, రానున్న దేహములూ, స్థూలసూక్ష్మకారణ శరీరములూ, తనవారూ, పైవారూ, పొరుగువారూ, యక్ష-కిన్నర - కింపురుష-దేవతాదులందరియందు అనాదిగావస్తున్న మమత్వభావమూ, ద్వంద్వములూ-విషయవాసనలూ- కామములూ-మమత్వభావనలూ-మొదలైన వాటివల్ల పుట్టుకొస్తున్న సమస్తబంధములూ- సంకల్పవికల్పములూ-ప్రయాసలూ-ప్రతిఫలాపేక్ష అనుభవాలూ-అన్నీ సంపూర్ణంగా నాశనంకావటమే మోక్షం. కనుక,

**ముక్తిమిచ్ఛసి చేత్ తాత, విషయాన్ విషవత్త్యజ** (అష్టావక్రగీత1-1)
**నిజంగా ముక్తిని కోరేవాడవే అయితే**

# విషయాలను విషం వలె విడిచి పెట్టు నాయనా!

అని సర్వశాస్త్రాలు మరీమరీ చెప్తున్నయ్. ఇన్నిచెప్పినా, ఇంతగాచెప్పినా ఇంకా ఏదోకోరే చిత్తంగలవారు నమ్మరు గనుక, కొంత తత్త్వవిచారణ చేద్దాం. అన్ని తత్త్వవిచారణల ధ్యేయమూ పైన చెప్పిన వాక్యాల తాత్పర్యమేనని మళ్ళీ ఒకసారి ఋజువు చేసుకుందాం నాయనా!

# లక్షణావృత్తి చేత శాస్త్రం ఏం చెప్తున్నదో

అవాగ్గోచరం = వాక్కుకు అందేది కాదు
అవ్యపదేశ్యం = శబ్దం చేత పట్టుబడేది కాదు
అనిర్వాచ్యం = నిర్వచించి చెప్పగలిగినది కాదు
అచిన్త్యం = మనస్సుచేత ఊహింపబడేది కాదు.

ఏదో ఒకభాషలోనూ, కొన్నిమాటలలోనూ చెప్పకోటానికి కావలసిన వాక్ శబ్దాదులతో దేనితోనూ పట్టుబడనిది ఆత్మతత్త్వం=నీధ్యేయం=నీ గమ్యం. అయినా ఏవో మాటలతోనే తెలుసుకోటానికి ప్రయత్నిస్తున్నాం కదూ! మరి, ఎలా తెలుసుకోవాలో, మోక్షం అనే అనుభవాన్ని ఎటువంటిమాటలతో ఏభావాన్ని శాస్త్రం చెప్తున్నదో విచారించుకుందాం పట్టు నాయనా!

ఒక వాక్యార్థాన్ని గ్రహించటానికి 1) ముఖ్యవృత్తి 2) గుణవృత్తి 3) లక్షణావృత్తి అని మూడువృత్తులను శాస్త్రం చెప్తున్నది. వృత్తి అంటే, ఒక వాక్యంలోని శబ్దానికీ-దానిఅర్థానికీ గల సంబంధం చెప్పటం అన్నమాట. అంటే, ఆ వాక్యంలో ఉన్న పదాలకూ, ఆపదంయొక్క అర్థాలకూ మధ్యగల తాత్పర్యాన్ని చెప్పటం-సమన్వయం చేయటం అన్నమాట.

1 **ముఖ్యవృత్తి** అంటే

రాజా గచ్ఛతి --- రాజు పోవుచున్నాడు.

ఈ వాక్యార్థాన్ని గ్రహించేటప్పుడు, కర్త అయిన 'రాజా' పదాన్నిగానీ, పదంయొక్క అర్థాన్నిగానీ బాధించటం లేదు. అలాగే 'గచ్ఛతి' అనే గమనక్రియను గ్రహించేటప్పుడుకూడా పదాన్నీ-పదార్థాన్నీ బాధించటం లేదు--- బాధించటం లేదంటే, ఉన్నపదాలకు వేరేఅర్థం చెప్పటం, పదాలకు మధ్యఉన్న అర్థాన్ని విడిచిపెట్టి వేరేఅర్థంతో తాత్పర్యం గ్రహించటం అన్నమాట. ఇటువంటి బాధ ఈవాక్యంలో కలిగించటం లేదు. కనుక, ఇలా చెప్పటాన్నీ, అర్థతాత్పర్యాలను గ్రహించటాన్నీ **ముఖ్యవృత్తి** అంటారు.

2 **గుణవృత్తి** అంటే

నీలముత్పలం --- నల్లకలువ

అగ్నిర్మాణవకః --- బ్రహ్మచారి అగ్నిహోత్రుడు

ఈరెండు వాక్యాలలో 'కలువ' కు 'నల్ల' అనేది గుణముగా చెప్పబడుతున్నది. 'బ్రహ్మచారి'కి 'అగ్నిహోత్రుడు' అనేది గుణం. ఈ గుణములతోనే పదముల అర్థతాత్పర్యాలను గ్రహించవచ్చు. పదములకూ-పదార్థములకు-వాక్యతాత్పర్యానికీ బాధ కలిగించనవసరం లేదు. కనుక, ఇలా చెప్పటాన్నీ — అర్థతాత్పర్యాలను గ్రహించటాన్నీ **గుణవృత్తి** అంటారు.

3 **లక్షణావృత్తి** అంటే

ఒక వాక్యంలో ప్రతిపదముయొక్క అర్థం విడివిడిగా (ప్రతి పదార్థం)

చెప్పుకున్నప్పుడు అవాక్యంయొక్క తాత్పర్యం సమన్వితం కాకపోతే, ఆ వాక్యంలోని ఒకపదానికిగానీ-కొన్నిపదాలకుగానీ వేరేఅర్థం చెప్పుకుంటారు. అంటే అపదాల నిజమైనఅర్థాన్ని విడిచిగానీ-బాధించిగానీ-విడువకగానీ అపదాలకే సంబంధించిన వేరేఅర్థాలను గ్రహించి, వాక్యతాత్పర్యాన్ని సమన్వయించుకుంటారు.

**దేశం దుఃఖాలపాలయింది** -- అనే వాక్యంలో ప్రతిపదార్థం చెప్తే, దేశం అంటే ఇళ్ళూ-రోడ్లూ-నదులూ- మొదలైనవి దుఃఖాలపాలైనవని తాత్పర్యం. కానీ ఇళ్ళకూ-రోడ్లకూ దుఃఖంఉండదు. కనుక, "దేశం" అనే పదానికి ఈఅర్థం విడిచిపెట్టి, "దేశం" అనే పదానికే సంబంధించిన "ప్రజలు" అనేఅర్థం గ్రహిస్తే, "దేశంలోని ప్రజలు దుఃఖాలపాలయినారనే" తాత్పర్యం సమన్వయమవుతుంది. అంటే, ఒకవాక్యంలోని ఒకపదానికిగానీ, కొన్నిపదాలకుగానీ నిజమైనఅర్థాన్ని బాధించి, అపదాలకు సంబంధించిన వేరేఅర్థం చెప్పుకొని, తాత్పర్యం సమన్వయించుకోవటాన్ని **లక్షణావృత్తి** అంటారు. ఈ లక్షణావృత్తి మూడువిధాలు -- 1) జహల్లక్షణం 2) అజహల్లక్షణం 3) జహదజహల్లక్షణం.

1 **జహల్లక్షణం** జహత్ అంటే విడిచిపెట్టటం అని అర్థం. అంటే, వాక్యార్థాన్ని గానీ, వాక్యంలో ఒకపదంయొక్క ముఖ్యార్థాన్నిగాని **పూర్తిగా** విడిచి దానికి సంబంధించిన వేరేఅర్థం చెప్పుకొని తాత్పర్యం సమన్వయించుకోవటం----**హైదాబాదునుండి విజయవాడమీదుగా** మద్రాసుకు **పోవాలి** -- అంటే విజయవాడ ఊరిపైకెక్కి పైనుండిపోవటం అని నిజతాత్పర్యం కాదు. ఇలా మీదుగాపోవటం వీలుకాదు. కనుక, విజయవాడకు సంబంధించిన **మీదుగా** అనే మాటయొక్క **ముఖ్యార్థాన్ని (అసలు అర్థాన్ని) పూర్తిగా** విడిచి, విజయవాడకు సంబంధించిన **త్రోవ** అనే అర్థాన్ని గ్రహిస్తే, **హైదాబాదు నుండి విజయవాడ త్రోవగా(ద్వారా) మద్రాసుకు పోవాలి** అని తాత్పర్యం సమన్వయమవుతుంది.

2 **అజహల్లక్షణం** అంటే, వాక్యార్థాన్నిగానీ, పదముల ముఖ్యార్థాన్నిగానీ **విడువక** తాత్పర్యసమన్వయంకోసం, ముఖ్యపదానికి సంబంధించిన వేరేఅర్థాన్నికూడా ఊహించటం. **గొడుగులు నడుస్తున్నవి** -- ఈవాక్య తాత్పర్యం విచారిస్తే, గొడుగులు స్వయంగా నడువవు కనుక, తాత్పర్యం సరియైనది కాదు. కనుక, **గొడుగులు** అనే **పదమునూ, పదార్థమునూ విడువక,** గొడుగులకు సంబంధించిన అర్థాన్ని ఊహించి

**గొడుగులు పట్టుకున్న మనుష్యులు నడుస్తున్నారు** అని తాత్పర్యం చెప్పుకోవాలి. అంటే, తాత్పర్యం సమన్వయం చేసుకొనేటప్పుడుకూడా మొదటచెప్పిన వాక్యార్థాన్నిగానీ, పదాలనుగానీ, పదాలఅర్థాన్ని గానీ విడు

వలేదు. దేశం దుఃఖాలపాలయింది అని ఇంతకుముందు చెప్పుకున్న వాక్యాన్నికూడా ఈవిధంగానే తాత్పర్యసమన్వయం చేసుకోవాలి.

3 **జహదజహల్లక్షణం**

వాక్యార్థంలో కొంతభాగాన్ని విడిచి, కొంతభాగాన్ని విడువక గ్రహించి ముఖ్యార్థాన్నికూడా **గ్రహించటం.**

**వాడే వీడు** - ఈవాక్యంలో

అప్పుడు, 1970వ సంవత్సరంలో, మీసాలగూడెంలో, పొట్టిలాగు-గళ్ళ చొక్కా-ముక్కుచీమిడి- చింపిరిజుట్టుతో గోలికాయలాడే **(వాడే)** సుబ్బిగాడే, ఇప్పుడు 1994వ సంవత్సరంలో, చింతలబస్తీలో, బెల్‌బాటమ్‌పాంట్ - పూల చొక్కా-బుర్రమీసాలూ-జూలుజుట్టుతో ఇరానీహోటల్‌లో టీ త్రాగుతున్న **(వీడు)** గుబ్బిట సుబ్బయ్య అని చెప్పినప్పుడు---- అప్పటి దేశ-కాల-నామ-రూప- వ్యవహారాలను విడిచి (కొన్నిఅంశాలను విడిచి), **వాడు** అనేపదంయొక్క కేవలఅర్థాన్ని (కేవలఅంశాన్ని) **గ్రహించి (విడువక)**---- అలాగే ఇప్పటి దేశ-కాల-నామ-రూప-వ్యవహారాలకు సంబంధించి ఉన్న వీడుఅనే పదార్థంనుండి, ఇప్పటి 1994వ సంవత్సరం, చింతలబస్తీ-మొదలైన దేశ-కాల నామ రూప-వ్యవహారాదులను విడిచి (కొన్నిఅంశాలను విడిచి), **వీడు** అనే పదంయొక్క కేవలఅర్థాన్ని (కేవలఅంశాన్ని) **గ్రహించి (విడువక)**---- ఈవిధంగానే **వాడే వీడు** -- కేవలఅంశమైన **వాడూ** కేవలఅంశమైన **వీడూ** ఒక్కరే అని వాక్యంయొక్క ముఖ్యార్థాన్నికూడా గ్రహిస్తూ, తాత్పర్యం చెప్పబడుతున్నది.

ఇలా, జహల్లక్షణమూ-అజహల్లక్షణమూ-జహదజహల్లక్షణమూ అనే లక్షణా వృత్తిత్రయమునూ సోదాహరణంగా విచారిస్తే---- లక్షణావృత్తి అంటే---- ఊహచేత-వివేకంచేత, వాక్యంలోని పదముల అర్థాన్ని అనుసరించి, వాక్యతాత్పర్యం చెప్పటం---- అని అర్థమవుతుంది నాయనా!

ఇదంతా ఎందుకు విచారించుకున్నామో తెలుసా!

లక్షణావృత్తిచేత ఎలాంటివాక్యాలకు ఎలాంటిఅర్థాలను గ్రహించిగానీ-ఊహించిగానీ, శ్రుతి-యుక్తి-అనుభవములచేత విచారించిగానీ---- కైవల్యం-భగవదైక్యం అనేమాటల తాత్పర్యాన్ని శాస్త్రంచెప్తున్నదో, తత్త్వమసి అనే మహావాక్యబోధచేయబడుతున్నదో తెలుసుకోవటానికే ఈపైవిచారణ చేసుకున్నాం.

1 **నీవు** -- జీవాత్మవు అని అనుకుంటున్న నీవు, **పరమాత్మ = భగవంతునితో** ఐక్యం పొందాలనుకున్నా

2 తత్త్వమసి - **తత్** త్వం అసి - పరమాత్మ అని చెప్పబడే

భగవంతుడూ, జీవాత్మ అనిపిలువబడే నీవూ నిజానికి ఒకటే, వాస్తవంలో భేదంలేదు - అని మహావాక్యం బోధచేసినా (ఇప్పుడు) నీదృష్టి లోనూ-నీఅనుభవంలోనూ నీకూ-పరమాత్మకూ భేదంలేకుండా పోవాలి. నీ ప్రస్తుతపు భావాలతోనూ-అనుభవాలతోనూ ఈభేదం లేకుండాపోదు సరికదా, అంతకంతకూ భేదాన్నే పెంచుకుంటావు. కనుక, భగవదైక్యం, **తత్త్వమసి** అని నీకూ- **పరమాత్మకూ** అభేదాన్ని (భేదం లేకపోవటాన్ని) చెప్పేమాటలు ఎటువంటి లక్షణావృత్తిచేత గ్రహించాలో చూద్దాంపట్టు నాయనా!

**జహల్లక్షణావృత్తి** చేత విచారిస్తే **తత్** పదంయొక్క ముఖ్యార్థమైన పరమాత్మను విడిచి, పరమాత్మకు సంబంధించినదనుకొనే వేరేఅర్థం **ఊహించి**-గ్రహించి-- అలాంటి వేరే భగవంతునితోనే నీవు ఐక్యంపొందాలనీ, అదే నీవనీ, తాత్పర్యసమన్వయమవుతుంది. ఈసమన్వయం తప్పు - ఇది అసంభవం. నిర్గుణ-నిర్వికార-నిరంజన-సచ్చిదానంద పరమాత్మయొక్క (ఇటువంటి) కేవలతత్త్వాన్నీ-మోక్షస్వరూపాన్నీ విడిచి, పరమాత్మకు వేరే **అర్థం గ్రహించి**, వేరే స్వరూపంతో ఐక్యమవటం నీకు సరియైనది కాదు.

పరమాత్మను విడిచి, పరమాత్మకు సంబంధించినదనుకునే జగత్తుతో సంబంధంపెట్టుకుంటే భగవదైక్యం కాదు. అంటే, జహల్లక్షణావృత్తిచేత నీకుకావలసిన భావమూ-అనుభవమూ దొరకవు, భగవదైక్యం కాదు.

**అజహల్లక్షణావృత్తి** చేత విచారిస్తే, **తత్** పదంయొక్క ముఖ్యార్థమైన పరమాత్మను గ్రహించి, **అధికంగా**, పరమాత్మకు సంబంధించిన వేరేఅర్థాన్ని **ఊహించి** గ్రహించవలసి వస్తుంది. ఇదీ కూడా అసంభవం. పరమాత్మ తత్త్వానికంటే వేరుగా అన్యపదార్థమే లేదు. కనుక దానినిగురించిన అర్థం **ఊహించటం**- గ్రహించటం అసంభవం. కైవల్యం అంటే కేవలత్వం--- అంటే, కేవలమై తనకంటే అన్యమైనదేదీ లేని పరమాత్మతత్త్వంలో లీనమై, తన పూర్వపుఉనికిని విడిచి, పరమాత్మకంటే వేరుగాని తన నిజస్వరూపానుభవం అన్నమాట. ఇదే భగవదైక్యం.

అంటే, పరమాత్మకు అన్యమైనదేదీ లేదుకనుక, లేనిదానిని ఊహించటం అసంభవం. అథవా ఉన్నదనుకుంటే అటువంటి దానితోటి ఐక్యం(సం బంధం) కైవల్యం(కేవలత్వం) కాదు. భగవదైక్యం, తత్త్వమసి అనేవాక్యాల తాత్పర్యసమన్వయం ఈ వృత్తిచేత జరగదు. వారానికొకరోజు వచ్చే శనివారంనాడు గుడికిపోయి, భగవంతుడంటే ఎక్కడో-ఏమో-ఎలాగో తెలి యక, తనపని అంతటితో తీరిపోయిందనుకొనే అధునాధున సాంస్కృతిక ఆనంద సుందరరావు దగ్గరనుండి, భగవంతుడికి సంసారాన్నీ-కామమదాం ధతనూ అంటగట్టి, పరమాత్మ-జీవాత్మ-జగత్తులు మూడు సత్యమేననే భావాలతో భగవద్గీతకు భాష్యాలు వ్రాస్తూ, తత్త్వప్రబోధలు చేసే

కామకోటి అనంతాచారి వఱకు అందరూ (ఈ) అజిహ్లక్షణావృత్తిచేతనే భగవద్దైక్యాన్ని ఆశిస్తున్నారు. పరమాత్మను గ్రహించి, పరమాత్మను ఆరాధిస్తున్నామనుకుంటూ, పరమాత్మకు సంబంధించినదనుకున్న జగత్తును పరమాత్మకు అంటకట్టి భక్తులమైనామనుకుంటున్నారు, భగవద్దైక్యాన్ని ఆశిస్తున్నారు, సంపూర్ణులమైనామనుకుంటున్నారు.

ఇంక మిగతా కూలీలూ–రిక్షావారి సంగతి వేరే చెప్పాల్నా?

తత్త్వవిచారణ చెయ్యగల జ్ఞానం లేకపోయినా, ఒక సామాన్యమైన జ్ఞానంకూడా వీరందరికి లేదు నాయనా! అదేమిటంటే ఐక్యం పొందదలుచుకున్న గమ్యంలోనే (భగవంతునిలోనే) జగత్తూ–సంసారమూ–కామమూ అనే నీచాతినీచమైన కాలుష్యములున్నవనుకుంటే, అటువంటి గమ్యంనుండి తాము పొందేది అంతకంటే గొప్పదెలా ఉంటుంది? సంపూర్ణంగా గమ్యం చేరుకున్నా, ధ్యేయవస్తువును పొందినా --- చేరినది కాలుష్యసహితమైనది, పొందినది కాలుష్యమైనది.

అందుకే అందరూ సంసారంలో తిరగాడుతున్నారు.

పోనీ! ముందుగా నీకామములను నిగ్రహించమని, అడుగడుగునా భగవద్గీతలో చెప్పిన (ఒకే) మాటనైనా ఆచరిస్తారేమోననుకుంటే, అది వారి నిఘంటువులోనే లేదు. భగవంతునికే కామాన్ని అంటకట్టిన ఈ మూఢులకు తమకామాన్ని నిగ్రహించటం చేతనవుతుందా? చేతకాదు నాయనా! చూడటానికి నిరాడంబరులుగానూ–ప్రశాంతగంభీరస్వరూపులుగానూ కనబడినప్పటికీ, తమకామాన్ని భగవంతునిలో చూచుకుంటూ లోలోపల ఆనందిస్తుంటారు. భగవంతునిలో కామాన్ని ఊహించటంకన్న నీచమైనదేదీ ఎప్పుడూ ఉండబోదనీ,

నీకు కామముంటే నీకామంతో నీచావు నీవే చావుగానీ భగవంతుడికి అంటకట్టి, భగవంతుడికి పెళ్ళిళ్ళు చేసి మురిసిపోకురా మూర్ఖా! FOOL! అని శాస్త్రాలన్నీ తిట్టున్నప్పటికీ---, భగవంతుడినైన నాతత్త్వాన్నే నిజంగా (ఉన్నదున్నట్లుగా) తెలుసుకోరా!! అని భగవంతుడు భగవద్గీతలో పదేపదే చెప్తున్నప్పటికీ, వారి చెవిటిచెవులలోకి ఎక్కదు. పైగా ఇలా చెప్పినందుకు కోపంవస్తుంది వారికి. భగవద్గీతకూ–ఉపనిషత్తులకూ–బ్రహ్మసూత్రాలకూ (ప్రస్థానత్రయానికి) భాష్యంవ్రాసిన వారైనా, సాధారణంగా ఇంతే!!! పశ్యన్నపి చ న పశ్యతి మూఢః చూస్తున్నప్పటికీ కళ్ళులేని వాళ్ళు. "సూర్యుడు చూడు ఎంతవేడిగా వెలుగుతున్నాడో! భరించలేకుండా ఉన్నాను. ఏంచేస్తానో చూడు!!" అంటూ గుప్పెడు ఇసుక తీసి సూర్యునిమీదికి విసిరితే, ఇసుకలో ఒక్క రేణువుకూడా సూర్యుని బాధించదు–చేరదు, విసిరిన వారి కంట్లోనే పడుతుంది కదూ!

అలాగే, కామంలో మునిగి, కామంలో మ్రగ్గిపోతున్న ఈ మూర్ఖులు తమకామాన్ని భగవంతునిమీదికి విసిరితే, ఒక్క కామరేఖకూడా భగవంతుని బాధించలేదు-దగ్గరకుపోలేదు, విసిరిన-ఆరోపణచేసిన ఈ మూర్ఖులమీదికే కోటిగుణంగా తిరుగపడుతుంది. అందుకే వీరికామం క్షణక్షణానికి పెరిగిపోతోంది. ఎన్నికామములు ఎన్నిగుణపాఠాలు నేర్పినా, ఎంతగా చితుకపడినా వీరికి బుద్ధి రావటంలేదు. నాశనంకోసమే బ్రతుకుతున్న వీరికి కైవల్యం=భగవదైక్యం ఎలాంటిది? తత్త్వమసి బోధ వీరి బుర్రలలోకి ఎక్కుతుందా? కనుక, అజహల్లక్షణావృత్తిచేత భగవదైక్యం, తత్త్వమసి వాక్యాల తాత్పర్యసమన్వయం పొసగదు నాయనా!

ఇక మిగిలినది **జహదజహల్లక్షణావృత్తి,** దీనినే భాగత్యాగలక్షణం అని కూడా అంటారు. అంటే, వాక్యార్థంలో కొంతభాగం త్యాగంచేసే లక్షణం అన్నమాట. ఈ వృత్తిచేత విచారించి,

**తత్** పదంయొక్క ముఖ్యార్థమైన పరమాత్మతత్త్వమును గ్రహించి పరమాత్మకు సంబంధించినవనుకుంటున్న నామరూపక్రియాగుణములనూ-సంసారమూ-జగత్తూ--సృష్టిస్థితిలయముల ఉద్యోగమూ--- ఇత్యాదులన్నీ విడిచిపెట్టి, కేవలపరమాత్మను గ్రహించి------ **త్వం** పదంయొక్క ముఖ్యార్థమయిన జీవుని నిజస్వరూపమును (వాస్తవంలో పరమాత్మకంటే వేరుగాని నిజస్వరూపమును) గ్రహించి, అజ్ఞానంలో తను జీవాత్మననుకొని తనకు సంబంధించినవనుకొనే గృహ-ఆరామ-క్షేత్ర-విత్తాదులూ, దేహేంద్రియమనోబుద్ధులూ, వీటితో కల్పించుకున్న బంధంచేత కలుగుతున్న కోరికలూ, ఇత్యాది జగత్తునంతా విడిచి కేవల **త్వం** పదముయొక్క నిజస్వరూపాన్ని గ్రహించి---- ఈ విధంగా, భాగత్యాగలక్షణావృత్తిచేత, **తత్-త్వం** పదముల కేవల అర్థాన్ని గ్రహించి, ఈరెండూ ఒకటే అని వాక్యతాత్పర్య సమన్వయం చేస్తున్నది శాస్త్రం.

తత్త్వమసి - తత్ త్వం అసి - అది నీవే అయి ఉన్నావు.

అజ్ఞానంచేత నీవు కల్పితజగత్తుతో సంబంధంకలవాడవనీ, సంసారంలో తిరుగాడే సంసారివనీ అనుకుంటున్నావుగానీ, ఈ అనుకోవటమనే అజ్ఞానంపోతే, పైన చెప్పినవిధంగా శుద్ధమైనకేవల **తత్**=పరమాత్మకూ, శుద్ధమైన కేవల **త్వం**=నీకూ భేదం లేదు.

**స్వామీ! జహదజహల్లక్షణావృత్తిలో మాత్రం త్వం పదార్థవిచారణ చేశారుగానీ, జహల్లక్షణ-అజహల్లక్షణాలలో చెయ్యలేదేమండీ! ఇది కూడా విచారిస్తే నాకామములు విడవకుండ మోక్షంపొందే ఉపాయం ఉంటుందేమో! ఇదికూడా చెప్పండి!**

చూడునాయనా! ఇలాంటి ప్రశ్నలు వేసేవారికి కొన్నికోట్లజన్మలు

తల్లక్రిందులుగా తపస్సుచేసినా తత్త్వవిచారణ బోధపడదు.

**కామమయ ఏవాయం పురుషః** (బృ.ఉ.4.4.5)

ఈ మనుష్యులందరూ కామమయములు. వారిలో కామం తప్పితే దైవత్వం కించిత్ కూడా లేదు. మరి తత్త్వమో--

**స్వయమేవాఽత్మనా ఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ!** (గీ10-15)

ఆత్మతత్త్వాన్ని=పరమాత్మతత్త్వాన్ని పరమాత్మయే తెలుసుకోవాలి. అంటే, ఆత్మతత్త్వదృష్టితోగానీ ఆత్మతత్త్వం బోధపడదు. కనీసం, ఆత్మతత్త్వమే సత్యం, కావలసినది ఆత్మతత్త్వంకాక మరేదీకాదుఅనే ఏకాగ్రదృష్టితో ప్రయత్నిస్తే కొంతకాలానికైనా అర్థమవుతుంది. అలాకాక, కామదృష్టితోనే ఆలోచిస్తే ఇలాంటి కొఱకురాని శంకలే వస్తుంటయ్ నాయనా! అసలు జరుగుతున్న తీవ్రఅవాంతరం ఏమిటో తెలుసా! కామమయుడైన ఈ మనుష్యుడనబడేవాడు, తన కామమనే మురికిని

1 కొంత భగవంతుడు=పరమాత్మ మీదికి విసురుతున్నాడు, ఆరోపణ చేస్తున్నాడు, అంటే పరమాత్మనూ సంసారిగానే ఊహించుకొంటున్నాడు.

2 మిగతాది, వాస్తవానికి పరమాత్మస్వరూపమైన తనమీద పోసుకుంటున్నాడు, ఆరోపణచేసుకుంటున్నాడు--- అంటే తననూ సంసారిగానే ఊహించుకుంటున్నాడు.

అంటే, పరమాత్మనుగురించీ, తననుగురించీ వీనికున్న భావాలన్నీ పనికిరానివే, అజ్ఞానకలుషమైనవే, కామములతో కూడుకున్నవే. **ఇటువంటి ఈ దుస్థితిలో నీకు శుద్ధమైన ఒక నిజస్వరూపం ఉన్నదంటే, అదంటే ఏమిటో? ఎలా ఉంటుందో? ఊహించుకోలేకుండా ఉన్నాడు. నీ నిజస్వరూపమే పరమాత్మ** అని అంటే--- చెప్పినదంతా విని, సరేనని తలఊపి, తన కామములలో ఒక్కటికూడా తనను విడిచిపోక తనలో శాశ్వతనివాసం చేస్తున్నా తను పరమాత్మనైనానని విఱ్ఱవీగుతుంటాడు. నీ నిజస్వరూపం-నిజస్వరూపం-నిజస్వరూపం అని గొంతుచించుకుని శాస్త్రం పదేపదేచెప్తున్నా ఈ చెవిటిపెద్దమ్మకు వినిపించదు. తన కామస్వరూపమే నిజస్వరూపం (పరమాత్మ) అనుకుంటాడు. కామస్వరూపమైన తనకంటే గొప్ప - భగవంతుడు మరెవరూ ఉండలేరు-ఉండరు-ఉండబోరు అనను కుంటుంటాడు. శాస్త్రంచెప్పే మాటను ఒప్పుకోడు. తన కామాన్నీ, తన మాటనూ శాస్త్రం ఒప్పుకోవాలంటాడు, కుతర్కాలుచేసి కుంటిప్రశ్నలు వేస్తూంటాడు.

**దృష్టిం జ్ఞానమయీం కృత్వా**
**పశ్యేద్బ్రహ్మమయం జగత్** (తేజోబిందు ఉ.1-26)

నీదృష్టిలోని కామాన్ని నాశనంచేసుకొని జ్ఞానమయం చేసుకో. అప్పుడు

ఈజగత్తు జగత్తుగా కనపడదు. జగద్వ్యాపారాలతో సంబంధం లేకుండాపో తుంది. బ్రహ్మభావమే నిలిచిపోతుంది- అని శాస్త్రం చెప్తుంటే---

దృష్టిం జగన్మయీాం కృత్వా పశ్యేజ్జగన్మయం బ్రహ్మ
దృష్టిం కామమయీాం కృత్వా పశ్యేత్ కామమయం బ్రహ్మ

అంటాడు. మంత్రాలను గింత్రాలు చేస్తాడు, తిరగతిప్పి రాస్తాడు, తన భావాలకు అనుగుణంగా మార్చుకుంటాడు. దేవాంతకుడిని అంటాడు. దేవుడే దిగివస్తే, నా సిగరెట్ ఆయనచేతిలో పెట్టి, కార్ స్టీరింగ్ ముందు కూర్చోపెట్టి బార్‌కు తీసుకుపొమ్మంటా, ఏమనుకున్నాడో--- నన్ను చూసి ఆదేవుడే హడలిపోవాలి అంటాడు.

తన ఊహలకు తగినట్లుగా దేవుడి పాత్రధారిని హడలిస్తూ నాటకాలు వేస్తాడు, సినిమాలు తీస్తాడు-నటిస్తాడు-చూస్తాడు, నానాభీభత్సం చేసే స్తుంటాడు. అందుకే ఇలాంటి ప్రశ్నలు వేస్తుంటాడు నాయనా! అందుకే నీ కామములను ముందు సున్నచేసుకొని తత్త్వవిచారణకు రమ్మంటున్నాడు భగవంతుడు (గీ3-41) భగవద్గీతలో.

సరే! ప్రశ్నకు సమాధానమేమో చూద్దాం పట్టు నాయనా! జహల్లక్షణ-అజహల్లక్షణ విచారణలలో తత్ పదాన్ని గ్రహించటంలో నీవు= త్వం పద వాచ్యుడవైన నీవు చేసే దోషాన్ని చెప్పుకున్నాం. కనుక, త్వం పదార్థవిచారణ చేయనట్లు కాదుగా! అయినా, తత్ పదానికి ఎలాంటి విచారణ చేశామో అదే విచారణ చేసుకోవాలి త్వం పదానికికూడా - మళ్ళీ సంగ్రహంగ చెప్పాలంటే విను నాయనా!

1 **జహల్లక్షణావృత్తి** తత్ పదంయొక్క ముఖ్యార్థమైన పరమాత్మను విడిచి, పరమాత్మకు సంబంధించినదనుకున్న జగత్తును గ్రహించి, త్వం పదంయొక్క ముఖ్యార్థమైన నీ నిజస్వరూపంను విడిచి, నీకుసంబంధించినదనుకున్న దేహేంద్రియాదులనూ, కామములనూ గ్రహించి - తత్, త్వం పదములకు కల్పించుకున్న ఇటువంటి అశుద్ధభావాలు కలిపి శుద్ధమైన కైవల్యంపొందు దామనుకోవటమే జహల్లక్షణావృత్తి. ఇది కుదరదు. జగత్తులోగానీ-దేహేం ద్రియాలలోగానీ మోక్షం దొరకదు. ఈ వృత్తిచేత కైవల్యం= భగవదైక్యం అసంభవం, తత్త్వమసి మహావాక్య తాత్పర్యసమన్వయం కాదు.

2 **అజహల్లక్షణావృత్తి** తత్ పదంయొక్క ముఖ్యార్థమైన పరమాత్మను విడువక గ్రహించి, అధికంగా పరమాత్మకు సంబంధించినదనుకున్న జగద్భావం సంసార భావంను (దివ్యజగత్తు-దివ్యసంసారం అని అనుకుంటూ) గ్రహించి-హర్షించి, వీటిని పరమాత్మకు ఆరోపించి--- త్వం పదంయొక్క ముఖ్యార్థమైన నీ నిజస్వరూపాన్ని (నేను అనే నిజభావాన్ని) విడువక గ్రహించి, అధి కంగా నీకు సంబంధించినవనుకుంటున్న దేహేంద్రియాదులనూ-కామములనూ

గ్రహించి---- నేను-దేహం-నాదేహం- నాఇల్లూ-నావాకిలి-నాఆస్తి-వావారు - నాది-నాది-నావి-నావి, నేను పుట్టేవాడిని, నేను చచ్చేవాడిని, అంటూ దుఃఖించి, వీటిని నీ నిజస్వరూపానికి ఆరోపించి, తత్ పదానికి కల్పించుకున్న అశుద్ధభావంలో హర్షించి భక్తుడనైనాననుకొని, త్వం పదానికి కల్పించుకున్న అశుద్ధభావంలో దుఃఖించిగానీ, వెకిలినవ్వులునవ్వి సంతోషిస్తున్నాననుకొనిగానీ- శుద్ధమైన కైవల్యం పొందుదామనుకోవడం అజహల్లక్షణావృత్తి. ఈ రెండు అశుద్ధభావాలూ కలిసి శుద్ధమైన భావంకాదు. ఇది జరగదు. కనుక ఈ వృత్తిచేతకూడా కైవల్యం=భగవదైక్యం కలలోనిమాట, తత్త్వమసి మహావాక్యతాత్పర్యసమన్వయం కాదు.

3 **జహదజహల్లక్షణావృత్తి** తత్ పదంయొక్క ముఖ్యార్థమైన పరమాత్మత త్త్వాన్ని కేవలంగా గ్రహించి, కామమయమై అజ్ఞానంలో ఊహించి పరమాత్మకు సంబంధించినవనుకున్న సంసారజగత్తులనూ-వాటిభావాలనూ-ఆరోపణలనూ విడిచి---- త్వం పదంయొక్క ముఖ్యార్థమైన నీ నిజస్వరూపాన్ని కేవలంగా గ్రహించి, కామమయమై అజ్ఞానంలో ఊహించి నీ నిజస్వరూపానికి సంబం ధించినవనుకున్న దేహేంద్రియాదులనూ-కామములనూ- వాటిభావాలనూ, వాటి సత్యాసత్యాలనూ రెండింటినీ, ఆరోపణలనూ విడిచి, తత్ పదానికి ఈవిధమైన శుద్ధభావమూ, త్వం పదానికి ఈ విధమైన శుద్ధభావమూ కలిపి శుద్ధమైన కైవల్యభావమవుతుంది. ఇలా తెలుసుకొని, తదనుగుణంగా అభ్యసించి ఆచరించటమే జహదజహల్లక్షణావృత్తి.

ఇది సంభవం. ఈ వృత్తిచేతనే కైవల్యం = భగవదైక్యం స్థిరమవుతుంది, తత్త్వమసి మహావాక్యతాత్పర్యసమన్వయం స్వతస్సిద్ధమవుతుంది.

కైవల్యపథంలో-మోక్షపథంలో జీవాత్మ-పరమాత్మలకు **వాస్తవంలో=శుద్ధ భావాలలో** భేదంలేదని చెప్పేవాక్యాలే మహావాక్యాలనబడుతవి. ఈ రెండింటికిగానీ-వీటొక్కరికిగానీ-వాటిమధ్యగానీ జగన్మయములూ-కామమ యములూ అయిన అశుద్ధభావాలను కల్పించి-ఆరోపించి భేదాన్నిచెప్పేవి మహావాక్యములు కావు- అటువంటివి అవాంతరవాక్యాలు=అవాచ్యములు= చెప్పకూడనిమాటలు అని అంటున్నది శాస్త్రం.

**స్వామీ! మరి ముఖ్యవృత్తి-గుణవృత్తి - వీటితో తత్త్వమసి మహావా క్యార్థసమన్వయం విచారణచేయలేదు గదండీ!**

లక్షణావృత్తిలో పదముల అర్థంగానీ, వాక్యార్థంగానీ ఊహించి సమన్వ యించుకున్నట్లు ముఖ్యవృత్తి-గుణవృత్తులలో అవసరం లేదు నాయనా! ఇదివరకు చెప్పిన ఉదాహరణలలో చూచినట్లు ముఖ్యవృత్తి-గుణవృత్తులలో పదముల అర్థాన్నిగానీ, వాక్యార్థాన్నిగానీ బాధించటం లేదు---అంటే వాటి ముఖ్యార్థాన్ని విడిచి వేరేఅర్థం చెప్పటమనే పని జరగటం లేదు.

**ముఖ్యవృత్తి**

తత్ బ్రహ్మ -- అది బ్రహ్మము

త్వం బ్రహ్మ -- నీవూ బ్రహ్మమే

తత్ త్వం అసి -- నీవు అదే అయి ఉన్నావు.

ఈ వాక్యాలలో ఊహప్రసక్తి లేదు, వేరే అర్థములను చెప్పటం లేదు, కనుక సమన్వయంచెయ్యటం అనేది లేదు.

**గుణవృత్తి**

అద్వయం బ్రహ్మ -- (తనకంటె) రెండవదిలేనిది బ్రహ్మ

సత్తామాత్రం బ్రహ్మ -- కేవల ఉనికి గలదే బ్రహ్మ

చిన్మాత్రం బ్రహ్మ -- కేవల చిత్ స్వభావమే బ్రహ్మ

ఆనన్దమూర్తిః బ్రహ్మ -- కేవల ఆనంద స్వభావమే బ్రహ్మ

సచ్చిదానన్దమాత్రః బ్రహ్మ -- కేవల సచ్చిదానందస్వభావమే బ్రహ్మ.

ఈ వాక్యాలలో, అద్వయం-సత్తామాత్రం-చిన్మాత్రం-ఆనన్దమూర్తిః-సచ్చిదానన్దమాత్రః -- ఇవన్నీ బ్రహ్మస్వభావములు (గుణములు కావు -- బ్రహ్మకు గుణములు లేవు కనుక, బ్రహ్మను గురించిన స్వభావములు). ఈ వాక్యాలలోకూడా పదముల అర్థాన్నిగానీ వాక్యార్థాన్నిగానీ బాధించటం లేదు, కనుక ఊహించి సమన్వయించవలసిన అవసరం లేదు. కానీ, జగద్విలక్షణమైన బ్రహ్మకు, తనకంటే రెండవపదార్థమే లేని బ్రహ్మకు జగత్తుతో అనేకంగా సంబంధం కల్పించి, జగత్ప్రరంగానే బ్రహ్మను ఊహించి భావిస్తున్నారు కనుకనూ---- ఇలా ఊహించి ఊహించి, అదే జగత్తుతో అలాగే- అదేవిధంగా తమకుకూడా సంబంధంకల్పించుకొని, జగత్ప్రరంగానే తమను ఊహించి భావిస్తున్నారు కనుకనూ----

ఈ ప్రవృత్తిలోనే అనాదిగా భ్రష్టులౌతున్నారు కనుకనూ ఏమాటలో ఎలా ఊహించి బ్రహ్మకూ(తత్) తమకూ(త్వం) సమన్వయం కుదురుతుందో, ఐక్యభావం స్వతస్సిద్ధమవుతుందో---- లక్షణావృత్తిచేత శాస్త్రం చెప్తున్నది నాయనా! ఇలా ఎంత విచారించుకున్నా, ఎన్నివిధాలుగా- ఎన్నిసార్లు శ్రవణంచేసినా, ఎన్ని తత్త్వవిచారణలు చదివినా, మన విచారణకు మొదలూ-చివరా రెండూ ఒకటే----

1 నీ కామములనూ-విషయవాసనలనూ--జగద్భావాన్నీ నీ నిజస్వరూపంమీదనూ-పరమాత్మమీదనూ కల్పించుకొని ఆరోపించుకోవటమే బంధం.

2 నీ కామములనూ-విషయవాసనలనూ-జగద్భావాన్నీ విడిచి, సంపూర్ణంగావిడిచి-సున్నచేసుకొని ---- నీ నిజస్వరూపాన్ని, పరమాత్మతత్త్వాన్ని నిరంతర అభ్యాసంచేత ఉన్నదున్నట్లుగా తెలుసుకొని రెండింటికి వాస్తవంలో

భేదంలేదని గ్రహించి, గ్రహించినదానిని అనుభవించటమే మోక్షం.

కనుక కారణమైన కామమును జయించు. కామములు తిష్ఠవేసుకున్న ఇంద్రియాలను నిగ్రహించు. ఇంద్రియాలను ఉసికొల్పుతున్న మనస్సును నిగ్రహించి, తత్త్వ అవగాహనలో నియమించు. అర్థమయిందా నాయనా! శంకలు రానీకు!! కుతర్కం చెయ్యకు!!! ఇంకాబాగా నిశ్చయం కావటానికి ఆత్మా–సత్ అనే ప్రవచనములలోని శాస్త్రసమన్వయాన్ని మరొకసారి మననం చెయ్యి. ఇప్పుడు ఆత్మా–చిత్ అని శాస్త్రం ఎలా చెప్తున్నదో చూద్దాం పట్టు.

# ఆత్మా -- చిత్

చిత్ అంటే చైతన్యమా?–ప్రకాశమా?–జ్ఞానమా?–
లేక ఈమూడింటి సమ్మేళనమా?

**అతీతః పన్థానం తవ చ మహిమా వాఙ్మనసయోః,**

**అతద్వ్యావృత్త్యా యం చకితమభిదత్తే శ్రుతిరపి.** (మహిమ్నస్తోత్రం–2)

జగత్తుపరిభాషలోని చైతన్యమూకాదు–ప్రకాశమూకాదు–జ్ఞానమూకాదు.

**దేహాన్యత్వాన్న మే జన్మజరాకార్శ్యలయాదయః,**

**శబ్దాదివిషయైస్సఙ్గో నిరిన్ద్రియతయా న చ.** (ఆత్మబోధ–32)

దేహం పుట్టటం(జన్మ), పెరిగిపెరిగి ముసలికావటం(జరా), ఇంక పెరగలేక చిక్కిక్షీణించటం(కార్శ్య), క్షీణించి క్షీణించి నశించటమూ(లయ), ఇంద్రియాలు ఇంద్రియార్థములను కోరటమూ, ఇంద్రియార్థములననుభవించటమూ, ఇత్యాదులే చైతన్యములనీ, ఈ చైతన్యమే ఆత్మానుభవమనీ అనుకుంటుంటారు.

ఆత్మ దేహంకంటే వేరుకనుక జన్మాదులు లేవు, జన్మాదులు వికారములు, చైతన్యం కాదు. ఆత్మ నిరింద్రియం యింద్రియములు లేనిది, శబ్దాది విషయాసంగం లేదు. విషయాసంగం వికారమేగానీ, చైతన్యం కాదు.

**అమనస్త్వాన్న మే దుఃఖరాగద్వేషభయాదయః,**

**అప్రాణో హ్యమనాశ్శుభ్ర ఇత్యాది శ్రుతిశాసనాత్.** (ఆత్మబోధ–33)

మనస్సుయొక్క చంచలత్వమూ, సుఖదుఃఖాలూ–రాగద్వేషాలూ–భయవిస్మయాలూ–మొదలైన ద్వంద్వాలూ, దేహంలో సంచరించే ప్రాణాది పంచవాయువులూ–ఉపవాయువులూ, వాటి సంచలనంవల్ల నెత్తురుప్రసరణా, నాడులచలనమూ--- విరిసి దేహంలో 98.4° ఫారిన్‌హీట్ ఉష్ణోగ్ర... నిల్పుతూ, బాయిలర్‌లో నీళ్ళు తెర్లుతున్నట్లు, దేహంలో అనం... వ్యవధిలేకుండా జరిగే కదలికలూ ఇత్యాదులే చైతన్యములనీ, ఈ ...

ఆత్మానుభవమనీ అనుకుంటుంటారు. ఆత్మ మనస్సుకంటే వేరు కనుక చంచలత్వం లేనిది. చంచలత్వం చైతన్యం కాదు. చంచలత్వంలేనిది కనుక సుఖదుఃఖాదిద్వంద్వాలు లేవు. సుఖదుఃఖాదిద్వంద్వాలు వికారములే గానీ, చైతన్యం కాదు. నీటికి అగ్నితోడై నీరు తెర్లినట్లు, కామపూరితమైన చంచలమనస్సుకు దేహప్రకృతితోడై జగద్భావంలోకి జారుతూ, అనేకదేహాలలో మళ్ళీమళ్ళీ ఇరుక్కునే అశుద్ధమైన సంసారంగానీ, దేహాదిప్రకృతివికారాలుగానీ చైతన్యం కాదు. దేహేంద్రియమనోబుద్ధులు సవికారములు= ఎప్పుడూ మార్పులుచెందేవి, ఆత్మనిర్వికారం= ఏ మార్పులూ చెందనిది--- దేహేంద్రియమనోబుద్ధులు చంచలమైనవి=నిలకడలేనివి, ఆత్మనిశ్చలమైనది=చంచలత్వం లేనిది--- దేహేంద్రియమనోబుద్ధులు తరంగముల(అలల)వలె ఒడుదుడుకుల మయమైనది, ఆత్మ నిస్తరంగమైనది=ద్వంద్వభావాలూ-ఒడుదుడుకులూ లేనిది--- కనుకనే ఆత్మచిత్ --- చైతన్యమైనది.

**శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచం స ఉప్రాణస్య ప్రాణః చక్షుషః చక్షుః అతిముచ్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి.** (కేనోపనిషత్ 1-2)

శబ్దం గ్రహించటానికి శ్రోత్రేంద్రియం సాధనం కనుక శ్రోత్రేంద్రియం చైతన్యమైనదనుకుంటున్నారు--- విషయాలను విచారించి గ్రహించటానికి మనస్సు సాధనం కనుక మనస్సు చైతన్యవంతమైన దనుకుంటున్నారు--- మనస్సు ఊహించినవన్నీ పలికి, శబ్దతరంగాలను సృష్టిస్తుంది, గానం చేస్తుంది కనుక వాక్కు చైతన్యవంతమైనదనుకుంటున్నారు--- ఊపిరితిత్తులు కొట్టుకుంటూంటే, ప్రాణం అధారంచేసుకొని దేహం పెరుగుతున్నది కనుక ప్రాణం చైతన్యవంతమైన దనుకుంటున్నారు--- కళ్ళు(చక్షువులు) ఎన్నో-ఎన్నెన్నివిధాలుగానో చూస్తున్నది కనుక కళ్ళు చైతన్యవంతమైన వనుకుంటున్నారు--- శ్రోత్రేంద్రియప్రవృత్తి చైతన్యంకాదు, శ్రోత్రమునకు శ్రోత్రమైనదే చైతన్యం--- మనోప్రవృత్తి చైతన్యంకాదు, మనస్సుకు మనస్సైనదే చైతన్యం--- వాగ్ప్రవృత్తి చైతన్యంకాదు, శబ్దతరంగాలూ-గానవిశేషాలూ చైతన్యంకావు, వాక్కుకు వాక్కయినదే చైతన్యం--- దేహాన్నిపోషించే ప్రాణం చైతన్యంకాదు, ప్రాణానికి ప్రాణమైనదే చైతన్యం--- చపలచక్షువులు చైతన్యవంతములుకావు, చక్షువులకు చక్షువైనదే చైతన్యం--- అంటే, ఈ అసలుచైతన్యం--- శ్రోత్రేంద్రియంవలె వింటుందనీకాదు, శ్రోత్రేంద్రియం వినటానికి చైతన్యాన్నిస్తుందనీకాదు--- మనస్సువలె విషయాలను విచారిస్తుందనీకాదు, విషయాలను విచారించటానికి మనస్సుకు చైతన్యాన్నిస్తుందనీ కాదు. వాక్కువలె మాట్లాడుతుందనీ-గానంచేస్తుందనీ కాదు, మాట్లాడటానికీ-గానంచెయ్యడానికీ వాక్కుకు చైతన్యాన్నిస్తుందనీకాదు--- ప్రాణంవలె దేహాన్ని పోషిస్తుందనీకాదు, దేహాన్ని పోషించటానికి ప్రాణానికి చైత

న్యాన్నిస్తుందనీకాదు--- చక్షువులవలె అన్నీ చూస్తుందనీ కాదు, అన్నిటినీ చూడడానికి చక్షువులకు చైతన్యాన్నిస్తుందనీ కాదు--- ఇంద్రియాలవలె ఇంద్రియార్థములను కోరుతుందనీ- అనుభవిస్తుందనీ కాదు, ఇంద్రియార్థ ములను కోరటానికీ-అనుభవించటానికీ ఇంద్రియాలకు చైతన్యాన్నిస్తుందనీ కాదు--- మరేమిటంటే--- ఉన్నది ఒక్క-చైతన్యమే-ఆత్మచైతన్యమే అయినప్పటికీ--- ఆత్మచైతన్యమే సర్వత్ర అనుభవింపబడుతున్నప్పటికీ--- అజ్ఞానంలో, దేహవాసనచేత, ఆత్మచైతన్యమే శ్రోత్రాది చైతన్యములుగా భావింపబడుతున్నయ్. ఇంకా విశేషమేమిటంటే,

**ఆత్మచైతన్యమాశ్రిత్య దేహేన్ద్రియమనోధియః,**
**స్వకీయార్థేషు వర్తన్తే సూర్యాలోకం యథా జనాః.** (ఆత్మబోధ-20)

నిద్రపోతున్న జనులందరూ సూర్యరశ్మిచేత చైతన్యంకలవారై వాళ్ళ వాళ్ళ పనులు చేసుకుంటున్నప్పటికీ, సూర్యరశ్మిని విస్మరించి వారికే స్వయంగా చైతన్యమున్నట్లు ప్రవర్తిస్తుంటారు. అలాగే, ఆత్మచైతన్యంవల్లనే చైతన్యానుభవం కలుగుతున్నప్పటికీ, ఆత్మచైతన్యంవల్లనే దేహేంద్రియాదులు (అభాసచేత) చైతన్యవంతములుగా భానింపబడుతున్నప్పటికీ--- ఈనిజం గ్రహించక దేహేంద్రియాదులు తమకే స్వయంగాచైతన్యంఉన్నట్లు ప్రవర్తి స్తుంటయ్--- అంటే, దేహేంద్రియాదులకే స్వయంగా చైతన్యంఉన్నట్లు భావిస్తుంటారు--- ఇది అజ్ఞానం, దేహవాసన.

కనుక, ఏది శ్రోత్రాదులకూ-దేహేంద్రియాదులకూ---వాటిప్రవృత్తికీ అతీతమై-విలక్షణమై-వేరై ఉండి--- అలాంటి ఉనికివల్లనే చైతన్యమై ఉన్నదో--- ధీరులైనవారు శ్రోత్రాదులను నిగ్రహించి, వీటికి అతీతమైన ఏ చైతన్యమును తెలుసుకొని అమృతత్వాన్ని పొందుతున్నారో అదే ఆత్మచైతన్యం. **కనుకనే ఆత్మ చిత్ - చైతన్యమైనది.**

**యద్వాచా உనభ్యుదితం యేన వాగభ్యుద్యతే,**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే.** (కేనఉ.1-4)

ఏది కల్పితమైన వాగ్ర్పవృత్తిచేత చెప్పబడలేదో, ఏ చైతన్యమాత్రమే వాగ్రూపంగా ఊహించబడుతున్నదో, అదే ఆత్మచైతన్యం. ఉపాసనలలో ఊహించిన కర్మలుగానీ- దేవతాదిఆకారాలుగానీ-వాక్కుగానీ చైతన్యమూ కాదు-ఆత్మాకాదు. **కనుకనే ఆత్మ చిత్.**

**యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్,**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే.** (కేనఉ.1-5)

ఏది కల్పితమైన మనస్సుచేత సంకల్పింపబడి నిశ్చయింపబడలేదో, ఏ చైతన్యమాత్రమే మనోరూపంగా ఊహించబడుతున్నదో అదే ఆత్మచైతన్యం.

మనస్సు చైతన్యమూకాదు–ఆత్మాకాదు. **కనుకనే ఆత్మ చిత్.**

**యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి,**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే.** (కేనఉ.1–6)

ఏది కల్పితమైన కళ్ళచేత చూడబడలేదో, ఏచైతన్యం మాత్రమే కళ్ళ రూపంగా ఊహించబడుతున్నదో అదే ఆత్మచైతన్యం. కళ్ళు చైతన్యములూ కావు, ఆత్మా కావు. **కనుకనే ఆత్మ చిత్.**

**యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతమ్,**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే.** (కేనఉ.1–7)

ఏది కల్పితమైన శ్రోత్రములచేత వినబడలేదో, ఏ చైతన్యమాత్రమే శ్రోత్రరూపంగా ఊహించబడుతున్నదో అదే ఆత్మచైతన్యం. శ్రోత్రములు చైతన్యములూ కావు, ఆత్మా కాదు. **కనుకనే ఆత్మ చిత్.**

**యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే.**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే.** (కేనఉ.1–8)

ఏది కల్పితమైన ప్రాణంచేత పోషింపబడలేదో, ఏ చైతన్యమాత్రమే ప్రాణమని ఊహింపబడుతున్నదో అదే ఆత్మచైతన్యం. ప్రాణం చైతన్యమూ కాదు, ఆత్మా కాదు. **కనుకనే ఆత్మ చిత్.**

**యథా உஉకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్,**
**తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ.** (గీ9–6)

సర్వత్ర సదా సంచరించే వాయువు, తన ఉనికికీ–సంచలనానికీ ఆధారమైన ఆకాశంలో సదా ఉన్నప్పటికీ, ఆకాశం నిరంజనమై వాయువుతో సంబంధపడకుండా ఎలా ఉన్నదో, అలాగే––– సర్వభూతములు (చరాచరములు) వాటివాటి ఉపాధులతోనూ, ఇంద్రియమనోబుద్ధులతోనూ, స్వయంకల్పిత దేహేంద్రియాది ధర్మము(ప్రవృత్తి)లతోనూ సర్వత్ర సదా సంచరిస్తూ, తమ ఉనికికీ– సంచలనానికి ఆధారమైన ఆత్మయందు సదా ఉన్నప్పటికీ, ఆత్మ నిరంజనమై సర్వభూతములతోనూ భూతభావములతోనూ సంబంధంలేకుండా ఉన్నది.

1 సర్వభూతములుగా తమ దేహేంద్రియాది ప్రవృత్తులవల్ల తాము చైతన్యస్వరూపములుగా భావించినట్లు, ఆత్మకు దేహేంద్రియాదులూ లేవు, వాటిప్రవృత్తీ లేదు, ప్రవృత్తివల్ల చైతన్యభావనా లేదు.

2 సర్వభూతములూ తమతమ ప్రవృత్తిప్రేరణవల్లనే తమను చైతన్యస్వరూపములుగా భావించినందువల్ల ఆత్మచైతన్యం కలగటంలేదు.

3 సర్వభూతములతోనూ, వాటిప్రవృత్తితోనూ సంబంధంలేకుండా నిరంజనమైనందువల్లనే ఆత్మ చైతన్యమయమై ఉన్నది.

4 నిరంజమైన ఆత్మచైతన్యాన్నే సదా అనుభవిస్తున్నప్పటికీ (ఆత్మ చైతన్యాన్ని ఆధారంచేసుకొని) అనాత్మపదార్థాలలోనూ-దేహేంద్రియాదుల లోనూ-బాహ్యపదార్థాలలోనూ ఆత్మభావనచేసి చైతన్యాన్ని ఆరోపణ చేసుకుంటున్నారు. అయినా, తన నిరంజనత్వానికి అడ్డులేకుండా ఉన్నది ఆత్మ.

కనుకనే ఆత్మ చిత్ - చైతన్యమైనది.

**త్రిభిర్గుణమయైర్భావైః, ఏభిస్సర్వమిదం జగత్,**
**మోహితం నాభిజానాతి మామ్, ఏభ్యః పరమవ్యయమ్.** (గీ7-13)

దేహేంద్రియాదులప్రవృత్తి = త్రిగుణమయములైనభావాలచేతనే అందరూ మోహంలో పడుతున్నారు. త్రిగుణములూ-మోహమే ఆత్మచైతన్యమనుకుం టున్నారు. మోహంలో కొట్టుకుంటున్నప్పటికీ వారు చైతన్యవంతులైనట్లు భావిస్తున్నారు. ఇదే అజ్ఞానం, విపరీతమోహం. అందుకే, దేహేంద్రియా దిప్రవృత్తికీ=త్రిగుణములకూ అవతలగా-వేరుగా- వీటితోసంబంధంలేకుండగా ఉన్న నాతత్త్వం=ఆత్మచైతన్యం వీరు తెలుసుకోలేకపోతున్నారు- తెలుసుకో వటంలేదు.

అందుకే ఆత్మ చిత్ - చైతన్యమైనది.

**దైవీహ్యేషా గుణమయీ, మమ మాయా దురత్యయా,**
**మామేవ యే ప్రపద్యన్తే, మాయామేతాం తరన్తి తే.** (గీ7-14)

హి=నిశ్చయంగా, ఏషా గుణమయీ (మాయా) =ఈ గుణమయమే = ఈ గుణమయమైన భావమే =ఈ గుణమయీ మాయయే, దైవీమాయా = దైవీ సంబంధమైన మాయ అనీ, మమ మయా = నామాయ అనీ = ఆత్మమాయ అనీ వీరందరూ అంటున్నారు.

1 నిజానికి వీరందరూ అనుభవించేది ఆత్మచైతన్యమే.

2 ఆత్మచైతన్యాన్ని ఆత్మతత్త్వంలోనే చూచి - అనుభవించి ఆత్మతత్త్వం యొక్క నిరంజనమైన చైతన్యాన్ని గ్రహించక

3 తాము అనుభవించే చైతన్యాన్ని అనాత్మములైన దేహేంద్రియాదులలో = త్రిగుణములలో చూస్తున్నారు, మోహంలో పడుతున్నారు.

4 మోహంలో పడుతున్నప్పటికీ, మోహకారణమైన తమ తప్పును తెలుసుకోక, తమ మోహమును నామీద=ఆత్మచైతన్యంమీద ఆరోపణచేసి దైవీమాయ=నామాయ=నాప్రకృతి =ఆత్మచైతన్యం అని అంటూంటారు. అందుకే ఈ(వీరి) మాయ (వీరికి) దాటశక్యం కావటంలేదు. కనుక, ఈ మాయను దాటాలంటే, మాయకుఅతీతమైన నన్నే=నాతత్త్వమే=ఆత్మచై తన్యమే గ్రహించాలి అని బోధిస్తున్నాడు భగవంతుడు=ఆత్మమూర్తి.

అందుకే ఆత్మ చిత్ -- చైతన్యమైనది.

వారి గుణమయిామాయలోనే వారున్నప్పటికీ వారిమాయను నాకంట కట్టి, నామాయా-నాప్రకృతి అనీ, వీటితో నేను వీళ్ళందరినీ=సర్వభూతాలను పుట్టిస్తున్నానంటారు. ఈ పుట్టించటమూ, జగత్తును సృష్టించటమూ - వీటితో నాకు ఏవిధమైన సంబంధంలేదని ఎన్నిసార్లు చెప్పినా వినరు-అర్థంచేసుకోరు. అర్థంచేసుకోకపోగా ఏమంటారో తెలుసా!

**ఏమిటండి! దేహవాసన-కోరికలూ-అజ్ఞానం-సంసారం అంటూ, కోరికలు నిగ్రహించకపోతే పిల్లి-బల్లి-దోమ-రాక్షసాది జన్మలెత్తుతారని బెదిరిస్తారుగానీ--- ఇంకెంతండీ, కలియుగం సగమైపోయింది, యుగం కాగానే సృష్టినాశనం అయి అందరూ చచ్చిపోతే, మళ్ళీ సృష్టిప్రారంభంలో మంచిజన్మ వస్తుందిగదా! ఇంతమాత్రానికి ఇంత కష్టపడి కోరికలు నిగ్రహించటం ఎందుకండీ!--- అనంటారు నాయనా!!**

చూచావా! చస్తామనీ, మళ్ళీ జన్మవస్తుందనీ, కోరికలకు తగినట్లు జన్మలెత్తక తప్పదనీ నమ్ముతూనే, తమ కోరికలబుద్ధితో విచారిస్తూ ఇలా మాట్లాడుతారు నాయనా! భయపడుతూనే తోక ఝాడిస్తుంటారు — ఇది రాక్షసచిహ్నం. అయినా దేవగణంలో పుట్టామనుకుంటుంటారు. వీరికి నా సమాధానమేమిటో విను.

**సర్వభూతాని కౌన్తేయ, ప్రకృతిం యాన్తి మామికామ్,**
**కల్పక్షయే పునస్తాని, కల్పాదౌ విసృజామ్యహమ్.** (గీ9-7)
**ప్రకృతిం స్వామవష్టభ్య, విసృజామి పునఃపునః,**
**భూతగ్రామమిమం కృత్స్నమ్, అవశం ప్రకృతేర్వశాత్.** (గీ9-8)

మీ ఊళ్ళో కొన్ని పెద్దపెద్ద కంపెనీలున్నయ్ చూచావా!

అక్కడ, మీ ఇంటినుండి తీసుకుపోయిన సామాన్లుగానీ-టిఫిన్‌డబ్బాలుగానీ కంపెనీలోపలికి తీసుకుపోనీయరు కదూ! మరేం చేస్తారు? ముఖద్వారం వద్ద, చిన్నచిన్న గూళ్ళున్న బీరువాలు తయారుచేస్తారు. ఒక్కొక్కరు ఒక్కొక్కగూటిలో వారికిసంబంధించినవి ఉదయంవచ్చినప్పుడు పెట్టుకొని తాళంవేసుకోవాలి. సాయంత్రం తిరిగివెళ్ళేటప్పుడు ఎవరివి వారు తీసుకుపోవాలి. ఈసదుపాయం కంపెనీవారే కల్పించినప్పటికీ ఎవరిగూటిలో ఉన్న సామాన్లతోనూ కంపెనీవారికి సంబంధం లేదు. ఎవరి గూటిలోనూ సామాన్లను అధికంగా చేర్చటంగానీ, ఉన్నసామాన్లను గ్రహించటంగానీ కంపెనీవారు చెయ్యరు. ఎవరైనా ఇంకొకరి గూటినుండి సామాన్లను పరిగ్రహించినా ఊరుకోరు కదూ! అలాగే నేనొక ఉపాయం చేశాను. (నిజంగా చెయ్యలేదు సుమా! చెప్తున్నవిషయం అర్థంచేసుకో!)

సృష్టిచివర, అందరూ వారివారిప్రకృతిని నేను తయారుచేయించిన గూళ్ళలో దాచుకుంటారు. తాళంవేసుకొని తాళపుచెవులుకూడా వారివద్దనే ఉంచుకుంటారు--- కొందరనుకుంటున్నట్లు సృష్టిచివర నాలో చేరరు--- వారి ప్రకృతిలోనే ఉంటారు. వారిప్రకృతి ఎలాంటిదో నాకు అనవసరం. వారి ప్రకృతికి మెరుగులుదిద్దటంగానీ-తగ్గించటంగానీ నేను చెయ్యను. ఎవరి ప్రకృతి, మంచిగానీ-చెడుగానీ, వారికే ఉండి, ఇంకొకరు పరిగ్రహించకుండా చూస్తుంటాను. మళ్ళీ సృష్టిఆరంభంలో నాదగ్గరఉన్న గూళ్ళనుండి వాళ్ళవాళ్ళప్రకృతితో వారిని విడిచేస్తాను(పొమ్మంటాను) అంతే! దోమలు ఎగిరినట్లు ఎగిరిపోతారు. వారి ప్రకృతికి తగ్గట్టు అవశంగా ఏఏ జన్మలు ఎలా ఎత్తాలో వెతుక్కుంటూ పోతారు. నానాయోనులలోపడి సంసారంలో తిరుగాడుతారు. కల్పకల్పాలకు ఇంతే, ఈనిజాన్ని వెనుక (గీ8-18,19శ్లోకాలలో) కూడా చెప్పాను.

ఈ నేనుచెప్పిన ఉపాయానికి ప్రకృతిఅని పేరుపెట్టి, నా ప్రకృతి అన్నారు, నా ప్రకృతిచేత నేను సృష్టిచేస్తున్నానంటున్నారు. ఇంతకుముందే(గీ9-6)లో చెప్పినట్లు సర్వభూతములతో సంబంధంలేక నిరంజనమైఉన్న నేను ఈ సృష్టిఅనే పనికిమాలిన వ్యాపారం ఎందుకు చేస్తాను? చెయ్యను. పుట్టినా-చచ్చినా-కల్పకల్పాలకూ వారిప్రకృతిలోనే వారుంటున్నారు. వారి ప్రకృతిప్రభావంవల్లనే పుట్టటం-చావటం అనే సంసారంలో తిరుగాడుతుంటారు.

**న చ మాం తాని కర్మాణి, నిబధ్నన్తి ధనఞ్జయ!**
**ఉదాసీనవదాసీనమ్, అసక్తం తేషు కర్మసు.** (గీ9-9)

అయినా, నాప్రకృతితో-నామాయతో నేనే సృష్టిచేశానంటారు. ఇలా వారు అనుకున్నప్పటికీ నేను సృష్టిచెయ్యటం అంటే ఏమిటో ఇప్పుడు విన్నావు కదూ! కల్పకల్పాలకూ వారి ప్రకృతికీ, వారి కోరికలకూ వశమై తప్పని సరిగా వాళ్ళే పుట్టుంటారు. ఈ దౌర్భాగ్యానికి నేను రావలసిన పనిలేదు. గోలంతా వాళ్ళేపడుతుంటారు, నేనే చేశానంటుంటారు. వాళ్ళు నాగురించి చెప్పే ఈ సృష్టికర్మలు నన్ను బంధించవు. పిల్లలు ఆడుకుంటుంటే వాళ్ళ ఆటలో తల్లికి జోక్యం-సంబంధంలేదు. ఒకవేళ ఎప్పుడైనా కలుగచేసుకుంటే ఆటను సత్యంగభావించే వారిఆటను ఆటగ-హాస్యంగా గ్రహిస్తుంది. ఇంకా, ఆటల్లో వారు కొట్టుకుని ఏడుస్తుంటే కలుగచేసుకుంటుంది, వారు అలసిపోయినా-అన్నానికి వేళఅయినా కలుగచేసుకుంటుంది. నేను కలుగచేసుకోవటం కూడా అంతే. వాటితో నాకేవిధమైన సంబంధమూలేదు. ఎలాంటి జోక్యమూ లేక ఉదాసీనంగా ఉన్నాను.

అందుకే నాతత్త్వం ఆత్మ చిత్ --చైతన్యమైనది.

తన నిజస్వరూప ఆత్మచైతన్యాన్ని తెలుసుకొని అనుభవిస్తున్నవాడై నివాసయోగ్యములను ఎంచక చెట్టుక్రింద కాలంగడిపేస్తాడు. ఎవరిసహాయమూ కోరడు. శరీరసహాయమూ కోరడు. ఏకాకిగానే ఉంటాడు. ఆత్మకాముడై-సదా ఆత్మానుభవమే కోరినవాడై, ఆప్తకాముడై-- అన్యకామములను కోరనివాడై, జీర్ణకాముడై--అన్యకామములనన్నిటిని నిగ్రహించి నాశనంచేసినవాడై, ఏనుగు-సింహం-అడవిఈగ- దోమ-ముంగిస-పాము-యక్షులు-రాక్షసులూ-గంధర్వులూ-యముడూ-మొదలైన బాధించేవారనబడే వారికి భయపడకఉంటాడు.

**సురమన్దిరతరుమూల-నివాసః, శయ్యా భూతలమజినం వాసః,**
**సర్వపరిగ్రహ-భోగత్యాగః, కస్యసుఖం న కరోతి విరాగః?** (భజగోవిందం)
**మూలంతరోః కేవలమాశ్రయన్తః, పాణిద్వయం భోక్తుమమన్త్రయన్తః,**
**కన్థామివ శ్రీమపి కుత్సయన్తః, కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః.** (కౌపీనపంచకం)

ఆశ్రయానికీ-నివాసానికీ చెట్టూ, భోజనానికి పాణిద్వయం భాజనమూ, పడుకోటానికి భూమీ, కట్టుకోటానికి మృగచర్మమూ---- దేహయాత్రకు సరిపోతున్నయ్. కప్పుకోవటానికి పనికివచ్చేదే అయినా, బొంత మోయటానికి బరువై ... సర్వభోగములూ తలంచినంతమాత్రంచేతనే బంధంకలిగి, బంధంవల్ల కోరికా, కోరికవల్ల కోపమూ, కోపంవల్ల మోహమూ, మోహంవల్ల అవివేకం=భ్రమ, భ్రమవల్ల బుద్ధినాశమూ, బుద్ధినాశంవల్ల సర్వనాశం=సంసారమూ కలుగుతున్నదని గ్రహించి సర్వభోగములను త్యజించిన విరాగికి=జ్ఞానికి=సర్వవిత్‌కు శాశ్వతసుఖంకాక దుఃఖమెక్కడిది? సంసారమెక్కడిది?

**స్వానన్దభావే పరితుష్టిమన్తః, సంశాన్త సర్వేన్ద్రియవృత్తిమన్తః,**
**అహర్నిశం బ్రహ్మణి యే రమన్తః, కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః.**
(కౌపీనపంచకం)

శాశ్వతసుఖంలో-స్వానందంలో మునిగి పరవశించి, తన ఆనందానికి అడ్డువస్తూ, ప్రతిబంధకాలైన సర్వఇంద్రియాలనూ అణగద్రొక్కి-మాడ్చి-మసిచేసి, పగలు-రాత్రీ అనే భేదంలేక, దేశకాలములతో ప్రమేయంలేక బ్రహ్మానందామృతమత్తుడై, సదాచిదానందస్వరూపుడై

**వృక్షమివ తిష్ఠాऽసేత్, ఛిద్యమానోऽపి న కుప్యేత న కమ్పేత**
**ఉపలమివ తిష్ఠాऽసేత్, ఛిద్యమానోऽపి న కుప్యేత న కమ్పేత**
**ఆకాశమివ తిష్ఠాऽసేత్, ఛిద్యమానోऽపి న కుప్యేత న కమ్పేత**
(సుబాలోపనిషత్ 13-40)

చెట్టుమొద్దులాగా ఉంటాడు, గొడ్డలితో చెట్టుమొద్దును తెగనరికినప్పటికీ, జాగ్రత్! విరిగి నీమీద పడతాననీ చెప్పదు, నిన్నేంచేస్తానో చూడమని

తిరుగబడదు, నీ కాళ్ళుమొక్కుతా నన్నుకొట్టకు నీకు పుణ్యంఉంటుంది అని ఏడుస్తూ ప్రాధేయపడదు. అలా చెట్టుమొద్దులాగా ఉదాసీనంగా ఉంటాడు--- పెద్దబాయిలాగా ఉంటాడు, సమ్మెటతో పగులగొట్టినా, కొట్టేవిధానాన్ననుసరించి పగిలినబాయి ఎటుపడాలో అటే పడుతుందిగానీ, పగులగొట్టేవాడిమీద కోపంవచ్చి పగిలి వాడిమీదేపడటంగానీ, వద్దునన్ను పగలగొట్టవద్దని ప్రార్థించడంగానీ చెయ్యదు కదూ బాయి. అలాగే ఉదాసీనంగా ఉంటాడు--- విశాలమైన ఆకాశంలా ఉంటాడు. ఆకాశంలో కత్తి తిప్పినా, మంటలు వెలిగించినా, వాయువేగప్రయోగంచేసినా కుప్పించి ఎగరకుండా, దుఃఖించి మొరపెట్టకుండా ఉదాసీనంగా ఉంటుంది, నిరంజనమై ఉంటుంది ఆకాశం. అలాగే ఉదాసీనుడై ఉంటాడు జ్ఞాని--- ఆత్మస్వరూపుడై ఉంటాడు, చైతన్యస్వరూపుడై ఉంటాడు.

**అందుకే ఆత్మ చిత్-చైతన్యమయం.**

కాయస్థోఽపి న కాయస్థః, కాయస్థోఽపి న జాయతే (ఉ.గీ1-28)
కాయస్థోఽపి న భుఞ్జానః, కాయస్థోఽపి న బధ్యతే,
కాయస్థోఽపి న లిప్తస్యాత్, కాయస్థోఽపి న వధ్యతే. (ఉ.గీ1-29)
శరీరస్థోఽపి కౌన్తేయ, న కరోతి న లిప్యతే. (గీ13-31)

దేహంలో ఉన్నప్పటికీ దేహంలో ఉన్నవాడు కాడు--- దేహంతోవచ్చి దేహంలోఉన్నట్లు అందరూ అనుకున్నప్పటికీ, దేహంతో పుట్టినవాడూ కాడు, దేహంలో ఉన్నవాడూ కాదు -- దేహంలోఉండి దేహంతో తిరుగుతున్నట్లు కనబడినప్పటికీ దేహాన్ని అనుభవించేవాడూ కాడు, దేహం ద్రియమనోబుద్ధులననుభవించే వాడూకాడు--- దేహంలోఉండి దేహంద్రియమనోబుద్ధులననుభవించినట్లు అజ్ఞులకు వ్యక్తమవుతున్నప్పటికీ దేహాదులచేత బంధింపబడేవాడూకాడు--- దేహంలో ఉన్నప్పటికీ దేహంతోగానీ, దేహానికి సంబంధించిన ఇంద్రియమనోబుద్ధులతో గానీ, దేహాదుల కర్మలూ-అనుభవాలూ- బంధాలతోగానీ సంబంధపడటంలేదు కనుక, దేహంలో ఉన్నప్పటికీ దేహంతో క్షీణించటం లేదు, దేహంచేత బాధింపబడటం లేదు, దేహంతో నాశనం కావటంలేదు. అంటే, దేహంలో ఉన్నప్పటికీ దేహంమీద ఆరోపణచెయ్యబడ్డ చైతన్యంకంటె వేరుగా చైతన్యమయమై ఉన్నది ఆత్మచైతన్యం. ఉండి దేహం పుట్టటం-పెరగటం-కదలికలూ-రక్తప్రసరణలూ---దేహానికి సంబంధించిన చైతన్యములనన్నిటినీ జడములుగా చేసేస్తున్నది. ఈ జడత్వమే ఆత్మచైతన్యమనుకోవటం జిజ్ఞాసువు అభ్యాసానికి అవరోధం-కళంకం. కళంకరహితమైనదే ఆత్మ.

**అందుకే ఆత్మ చిత్ - చైతన్యమయం - చిన్మాత్రం.**

దేహే జాతే న జాతో ఒసి, దేహే నష్టే న నశ్యసి,
త్వమాత్మన్యకలఙ్కాత్మా, దేహస్తవ న కశ్చన. (వా.రామా.)
దేహంపుట్టటంతో నీవు కొత్తగాపుట్టిరావటంలేదు.
దేహంబ్రతకటంచేత నీవు బ్రతకటం లేదు.
దేహంచావటంతో నీవు నాశనంకావటం లేదు.
దేహంతోకూడుకున్న ఈ కళంకాలేవీ నీకు లేవు.
దేహం ఎప్పుడూ నీది కాదు.

అందుకే నీవు ఆత్మస్వరూపుడవు--చైతన్యస్వరూపుడవు.

చేష్టమానం శరీరం స్వం పశ్యత్యన్య శరీరవత్,
సంస్తవే చాపి నిన్దాయాం కథం క్షుభ్యేన్మహాశయః. (అష్టావక్రగీత 3-10)

నీకంటె వేరైన శరీరాలు---- నీవారనుకోబడేవారుగానీ-పరులనుకోబడేవారుగానీ ఎవరైనా, పుణ్యకర్మలూ-పాపకర్మలూ చేసినా, సుఖదుఃఖాలు పొందినా, ఐశ్వర్యభోగాలనుభవించినా, తిండీ-బట్టలూ లేక అలమటించినా, వ్యాధిగ్రస్తమై చిక్కి-చచ్చినా, ఇవేవీ నీకు సంబంధించినవి ఎలా కావో---- అలాగే ఇలాంటి కర్మలుచేస్తూ, అనుభవిస్తున్నట్లు నీ శరీరం కన్పిస్తున్నప్పటికీ వాటితో నీకు సంబంధంలేదని ఎప్పుడు గ్రహిస్తావో అప్పుడు ఆత్మస్వరూపుడవవుతావు, చైతన్యస్వరూపుడవుతావు.

మనస్థ్సం మన మధ్యస్థమ్, మధ్యస్థం మనవర్జితమ్,
మనసా మన ఆలోక్య, స్వయంసిద్ధ్యన్తి యోగినః. (ఉ.గీ.1-32)

చంచలమైన మనస్సు డోలాయమానంగా ఊగుతుంటేనూ, చపలమైన మనస్సు కోతిలాగా విషయాలమీదికి గంతులుపెట్టుంటేనూ, వ్యభిచారియైన మనస్సు మోహమనే మార్గాలన్నిటిలో(అడవులలో) సదా సంచరిస్తుంటేనూ, వ్యసనకారిణియైన మనస్సు వ్యవధిలేకుండా ఆశాలోకంలో అలమటిస్తూంటేనూ, కామస్వరూపమైన మనస్సు కళ్ళకు గంతలుకట్టి అజ్ఞానంలోకి అణచివేస్తుంటేనూ, కామములను కల్పించి ఉగ్రతాండవం చేస్తుంటేనూ, క్రూరమైన మనస్సు కామక్రోధలోభమోహమదమత్సరములనే కోఱలతో గుచ్చిగుచ్చి-కొఱికి-పొడిచేస్తుంటేనూ, ఇంద్రియాలనే గుఱ్ఱాలను ఇంద్రియార్థములమీదికి ఉసికొల్పి పరుగులెత్తిస్తుంటేనూ, ముక్కుకి త్రాడుకట్టి తనుతిరిగే పెంటకుప్పలన్నిటిలోకి ఈడ్చుకొనిపోతుంటేనూ, క్షణకాలంలో లోకాలనన్నిటిని త్రిప్పిచూపి కూర్చున్నకుర్చీలో కుదేసి, అంతలోనే అవుగో! ఇంకా చాలఉన్నయ్, కూర్చుంటే ఏమైనట్టూ! పద! తొందరగా రా!!! అంటూ విసిగిస్తుంటేనూ, ఏమిటే? ఎక్కడికే?? చెప్పవే??? ఆలోచించుకోనీవే---- అని ప్రాధేయపడితే కళ్ళురిమి, అదలిస్తే అంతకుమిన్నగా అరచి, ఆగమంటే ఆగంచేసి, నిగ్రహిస్తే నిప్పులుచల్లుతున్న---- మనస్సును చైతన్యమైనదంటారు

చవటలు. మనోచాంచల్యాన్ని చుఱుకుదనమంటారు మొద్దులు, వీధులన్నీ చెడతిరిగి హుషారుగా ఉందంటారు దద్దమ్మలు. సినిమాజగత్తులో చివికి రిక్రియేషన్ అంటారు ఏడుపుమొగాలు. ఆటవిడుపులలో--పిక్నిక్‌లో ఆనందమంటారు మోహజాలసమావృతులు. ప్రకృతిలో అందంచూస్తారు ఏబ్రాసిమొగాలు. తోలుబొమ్మలను తొంగితొంగి చూస్తారు తోలుబస్తాలు. కవిత్వంలో మాంసపుముద్దలను వర్ణిస్తారు కపులు. ఆత్మకు=పరమాత్మకు= భగవంతునికి కామం ఉందని వర్ణించి-పరవశించి-మైమరచి పండితులమంటారు శుంఠలు. ఇదంతా జ్ఞానం అని అంటారు(వీరంతా) జడులు. ఇలా అనిఅని ఇదే ఆత్మచైతన్యమంటారు అసురసంజాతులు. ఇలాంటి వీరి--- మనస్సులోనే మనస్సుకు తెలియకుండా ఉండి, మనస్సుకు సాక్షిమాత్రంగా ఉండి, మనస్సులోనే మనస్సులేకుండా ఉండి, మనస్సులోనే మనస్సుతో సంబంధపడకుండా ఉండి, మనస్సులోనే మనస్సుకంటే వేరుగా ఉన్నదే---చైతన్యం-ఆత్మచైతన్యం. మనస్సూ చైతన్యంకాదు, మనోచాంచల్యమూ చైతన్యంకాదు, మనోవ్యభిచారమూ చైతన్యంకాదు.

**అందుకే ఆత్మ చిత్ -- చిన్మాత్రం.**

చిన్మాత్ర ఆత్మచైతన్యాన్ని, వశంచేసుకొని నిగ్రహించిన మనస్సుచేత మనస్సులోనే చూచి, మనస్సువ్యాపారాన్ని విచారించి, కామపూరితమై జగత్తులో వ్యభిచరిస్తున్న అశుద్ధభావాలనూ-స్వభావాలనూ శుద్ధంచేసి (శుద్ధంచేసుకొని), శుద్ధమైనమనస్సులో నిశ్చలమైఉన్న ఆత్మచైతన్యాన్ని గ్రహించి-అనుభవించి ఆత్మస్వరూపులౌతున్నారు, చైతన్యస్వరూపులౌతున్నారు.

**అందుకే ఆత్మ చిత్-చైతన్యమయం--చిన్మాత్రం.**

ఆత్మ తన నిజచైతన్య స్వభావంచేత సర్వచైతన్యములనూ జడములుగానూ-చపలములుగానూ-చంచలములుగానూ- వ్యభిచారములుగానూ చేసేస్తున్నది.

**అందుకే ఆత్మ చిత్--చైతన్యమయం--చిన్మాత్రం.**

స్వయమన్తర్బహిర్వ్యాప్య భాసయన్నఖిలం జగత్,
బ్రహ్మప్రకాశతే వహ్ని ప్రతప్తాయసపిండవత్. (ఆత్మబోధ-62)

అగ్నిచేత ప్రకాశింపబడిన ఇనుముయొక్క అణువణువునా అగ్ని వ్యాపించి ఉన్నట్లు, ఈ కనిపిస్తున్నదనుకోబడే జగత్తుయొక్క లోపలాబైటా బ్రహ్మ= ఆత్మ వ్యాపించిఉండి, తను స్వయంగాప్రకాశిస్తూ, అన్యపదార్థమును ఆశ్రయించక స్వయంగాప్రకాశిస్తూ, జగత్తును ప్రకాశింపచేస్తున్నది.

**అందుకే ఆత్మ చిత్--ప్రకాశవంతమైనది.**

యద్భాసా భాస్యతేఽర్కాది, భాస్యైర్యత్తు న భాస్యతే,
యేన సర్వమిదం భాతి, తద్బ్రహ్మేత్యవధారయేత్. (ఆత్మబోధ-61)

న దీపస్యాన్యదీ పేచ్ఛా, యథా స్వాత్మప్రకాశనే. (ఆత్మోబోధ-29)

ఆత్మ జగత్తును ప్రకాశింపచెయ్యటమంటే ఎలాంటిదో చూడునాయనా! వెలుగుతున్న దీపంయొక్క ప్రకాశం తెలుసుకోటానికి ఇంకొక చిన్నదీపంతో పనిలేదు. ట్యూబ్ లైట్ వెలుతురు చూడడానికీ-చూపటానికీ టార్చ్‌లైట్ వెయ్యనక్కరలేదు. సూర్యునిప్రకాశం చూపటానికి క్రొవ్వొత్తి వెలిగించ నక్కరలేదు. అలాగే, ఆత్మప్రకాశంచేతనే, గొప్పప్రకాశములుగా తెలియబడే సూర్యుడు- చంద్రుడు-అగ్ని-మొదలైనవి ప్రకాశిస్తున్నయ్. ఇక ఇతరపదార్థాల గురించి వేరే చెప్పాల్నా? ఆత్మప్రకాశంచేతనే జగత్తంతా ప్రకాశింపబడుతున్నది. ప్రకాశింపబడే సూర్యచంద్రాదులచేత ఆత్మ ప్రకాశింపబడదు. ప్రకాశింపబడే పళ్ళెంచేత ట్యూబ్ లైట్ ప్రకాశింపబడదు కదూ! అలాగే, ఆత్మచేత ప్రకాశింపబడే సూర్యచంద్రాదులచేతగానీ, ఇతరజగత్పదార్థాలచేత వేటివల్లగానీ ఆత్మ ప్రకాశింపబడదు.

అందుకే ఆత్మ చిత్.

మరి, ఆత్మకు జగత్తును ప్రకాశింపజేసే కర్తవ్యం ఒకటున్నదన్న మాట. కాదు. అలాకాదు నాయనా! ఆత్మ తనప్రకాశంలో తానుండటంచేతనే సర్వజగత్తూ ప్రకాశింపబడుతున్నది. ట్యూబ్ లైట్ తనప్రకాశంలో తానుండటంచేతనే పదార్థాలన్నీ ప్రకాశిస్తున్నయ్=తెలియబడుతున్నయ్. ట్యూబ్ లైట్ ఎప్పుడుగానీ-ఎవరివద్దకుగాని వచ్చి, వీపుతట్టి ఇదుగో పళ్ళెం-గరిటె-కట్టిఅని పదార్థాలను చూపటంలేదు. సూర్యుడు గగనవీధిలో పరుగెత్తుతూ "చూడండోహో! నేను పోతున్నాను. నాప్రకాశం చూడండి. ఇదిగో కొండ! అల్లదుగో సెలయేరు! ఇది మురికి, అది సుగంధం అని అరుచుకుంటూ పోతున్నాడా? లేదు కదూ! చూచినవారు చూచినదానిని తాము చూచినట్లు చూస్తున్నారు. ప్రకాశింపచెయ్యటమనే కర్తృత్వం సూర్యునికి లేదు. ఎవరు దేనిని ఎలాచూచినా అవి సూర్యుని బంధించవు, సూర్యునికి వాటితో సంబంధంలేదు, ఎన్నిపదార్థాలు ప్రకాశింపబడినా సూర్యుని ప్రకాశానికి క్లేశమూలేదు-ప్రత్యవాయమూలేదు. అలాగే,

1 ఆత్మ స్వయంగా ప్రకాశిస్తూనే ఉన్నది.

2 నేను ప్రకాశిస్తున్నాను చూడండొహో! అని అరవటం లేదు.

3 ఎవరినిగానీ-ఎప్పుడుగానీ ఎందుకు-ఎక్కడ--ఎలాగుగానీ వీపుతట్టి పిలిచి, ఇదిచెంబు - ఇదిగ్లాసు-అదికాఫీ-ఇప్పుడుతాగు, ఇలా జగత్పదార్థాలననుభవించు, ఏడు-నవ్వు అని చెప్పటంలేదు.

4 ఆత్మ చిన్మాత్రం-కేవలంచిత్=ప్రకాశమే. తన ప్రకాశంచేతనే సర్వమూ తెలియబడుతున్నయ్.

5 తెలుసుకొనేవారు తెలుసుకొనేదానిని తాము తెలుసుకున్నట్లు తెలుసుకుం

టున్నారు.
6 ఎవరు-ఎక్కడ-ఎప్పుడు-ఎలా-దేనిని తెలుసుకున్నా ఆత్మప్రకాశానికి క్లేశమూలేదు- ప్రత్యవాయమూలేదు.

## అందుకే ఆత్మ చిత్

అయితే మరి, ఆత్మ చిన్మాత్రమై జగత్తునుగురించి ఎవరికీ-ఎప్పుడూ చెప్పక తన ప్రకాశంలో ఉన్నప్పటికీ, జగత్తు సత్యమని ప్రకాశింపచేస్తున్నదా?

యద్భాసా హృదయాక్షదేహ విషయాభాన్తి స్వతో చేతనాః,
తాం భాస్యైః పిహితార్కమణ్డలనిభాం స్ఫూర్తిం సదాఽభావయన్.
(మనీషాపంచకమ్)

మధ్యాహ్నం సూర్యుడు వచ్చేఉన్నాడు. ప్రకాశిస్తూనే ఉన్నాడు. కాని వర్షాకాలం అవటంచేత మేఘం అడ్డువచ్చింది. అంతమాత్రంచేత ఆకాశంలో చూచి సూర్యుడు లేడంటారు. సూర్యునిచేత ప్రకాశింపబడిన మేఘాలు సూర్యునికే అడ్డువచ్చి సూర్యుడు లేడనేటట్లు చేస్తున్నయ్. సూర్యుడే లేకపోతే అడ్డువచ్చినవి మేఘాలని ఎలా తెలుస్తున్నది? అసలువిషయం ఏమిటంటే, మేఘాలు తనకు అడ్డువస్తున్నయ్‌గానీ సూర్యునికి అడ్డురావటం లేదు. సూర్యునికే అడ్డువస్తే ఇతరప్రదేశాలలో ఉన్నవారు అదేసమయంలో సూర్యుని ఎలా చూస్తుంటారు? అంటే,

1 తనకు కావలసినది సూర్యుడు. సూర్యుడు ప్రకాశిస్తూనే ఉన్నాడు.

2 సూర్యుని చూడనీయకుండా తనకు అడ్డువచ్చినయ్ మేఘాలు. అడ్డువచ్చిన మేఘాలు (వాటి స్వరూపం) సూర్యునివల్లనే తెలుస్తున్నది.

3 సూర్యుడు కనపడాలంటే మేఘాలుపోయే ఉపాయం చూడాలి. లేదా మేఘావరణ ప్రదేశంనుండి తప్పించుకుపోవాలి.

4 అలాచెయ్యకుండా, సూర్యుడేలేడంటారు చిన్నపెద్దా అందరూ. అలాగే,

అత్మసర్వవ్యాపియై, సర్వులలో ఉన్నప్పటికీ

ఆత్మప్రకాశాన్ని విడిచి, తైతక్కలాడుతూ కనిపిస్తున్న (కనిపిస్తున్నవనుకునే) దేహేంద్రియాదులు జగద్విషయాలలో స్వయంప్రకాశమానమైనట్లు భ్రాంతి పడుతుంటే (మేఘావరణ) దేహేంద్రియాదులే తామనుకుంటారు. దేహేంద్రియాదులభ్రాంతియే ప్రకాశమనుకుంటారు, ఆత్మప్రకాశాన్ని గుర్తించరు, ఆత్మప్రకాశం లేదంటారు. అథవా ఆత్మప్రకాశం ఉన్నదనేవారు కూడా, ఆత్మ దేహేంద్రియాదులనూ-భ్రాంతినీ ప్రకాశింపచేస్తుంటే గ్రహించి ఆనందిస్తున్నాం అంటారు. వీరికి శాస్త్రం ఏంసమాధానం చెప్తున్నదంటే

1 అందరికీ ఆత్మప్రకాశమే కావాలి. అందరూ సర్వకాలాలలో సర్వత్ర

ఆత్మప్రకాశాన్నే పొందుతున్నారు–అనుభవిస్తున్నారు.

2 సూర్యప్రకాశంలో, సూర్యప్రకాశానికి వేరుగా చూచినవారు చూచినదానిని తాముచూచినట్లు చూచిన విధంగానే-- ఆత్మప్రకాశంలో ఆత్మప్రకాశానికి వేరుగా చూచినవారు చూచినదానిని తాముచూచినట్లు చూస్తున్నారు. అనాత్మములైన దేహేంద్రియాదులను ఎన్నోరీతులుగా చూస్తున్నారు. అవే సత్యమనుకొని భ్రాంతిలో పడుతున్నారు. ఈభ్రాంతియే--ఈ విధంగా వీరుకల్పించుకున్న భ్రాంతియే వీరికి (ఆత్మప్రకాశం కనపడకుండ) అడ్డువస్తున్నది.

3 ట్యూబ్ లైట్ తనుప్రకాశిస్తూ తనప్రకాశం అందనిచోటఉన్న చీకటిని ప్రకాశింపచేసినట్లు (అంటే చీకటివెలుగులు వెలుగుతో పోల్చిచెప్పబడుతున్న వేగాని చీకటితోపోల్చి చెప్పబడటంలేదు)- చీకటి ఉన్నదని (చెప్పక)చెప్పినట్లు, సూర్యుడు తను ప్రకాశిస్తూ, తన ప్రకాశం చూడలేకుండా ఎవరికి ఏ మేఘం అడ్డువచ్చినా, తన ప్రకాశం అందకపోవటాన్ని ప్రకాశింపచేస్తూ (కార్యాన్ని చెప్పక చెప్తూ), అందుకు కారణమైన మేఘాన్ని కూడా ప్రకాశింపచేస్తున్నాడు (కారణాన్నికూడా చెప్పకచెప్తున్నాడు). అలాగే ఆత్మ స్వయంప్రకాశమానమై, తన కేవలప్రకాశంచేతనే తన ప్రకాశం అందని తమస్సును=చీకటిని=సంసారాన్ని ప్రకాశింపచేస్తూ–తెలియచేస్తూ, కార్యాన్ని చెప్పకచెప్తూ, తమస్సుకు కారణమైన భ్రాంతి=అవరణ=విక్షేపంనుకూడా ప్రకాశింపచేస్తున్నది–తెలియచేస్తున్నది, కారణాన్ని చెప్పకచెప్తున్నది. చెప్పక చెప్పటమంటే, వారివారి అనుభవంచేతనే వారికి తెలిసేటట్లు చేస్తున్నది.

(అ) కాఫీ త్రాగనప్పుడూ (నీ)(నిజ)ఉనికిని ప్రకాశింపచేస్తున్నది=అనుభవింపచేస్తున్నది. కాఫీ త్రాగేటప్పుడు (నీ)ఉనికిని కోల్పోయి పరాధీనమైన (కాఫీ అధీనమైన) తమస్సు అనుభవాన్నీ--- (ఈ అనుభవంవల్లనే) కాఫీకోసం పరితపించటం–ప్రయత్నించటం, కాఫీతో దినసరిగావచ్చే అనుభవాలలో భ్రాంతిఅనుభవాన్నీ **పూర్వపు (నీ) (నిజ) ఉనికితో = (నీ)నిజఅనుభవంతో పోల్చి చూపిస్తున్నది.**

(ఆ) సుఖదుఃఖాలు లేనప్పుడు (నీ)(నిజ)ఉనికిని ప్రకాశింపచేస్తున్నది= అనుభవింపచేస్తున్నది. సుఖదుఃఖాలు అనుభవించేటప్పుడు (నీ)(నిజ) ఉనికిని కోల్పోయి పరాధీనమైన (సుఖదుఃఖాలవలలో చిక్కుకొన్న) తమస్సు అనుభవాన్నీ, సుఖదుఃఖాలలో దినసరిగావచ్చే అనుభవాలతో భ్రాంతిఅనుభవాన్నీ, **పూర్వపు(నీ)(నిజ)ఉనికితో=(నీ)నిజఅనుభవంతో పోల్చి చూపిస్తున్నది.** నీ అనుభవాలను పోల్చుకొని నీవే తెలుసుకొనేటట్లు చేస్తున్నది.

4 ఆత్మప్రకాశమే కావాలంటేనూ, వాస్తవంలో అనుభవిస్తున్న ఆత్మప్రకాశమే నిలిచి ఉండాలంటేనూ, ఈ తమస్సూ–ఆవరణలూ తమంతట అవే

తొలగాలి. లేదా వాటిప్రాంతాలలో లేకుండా వెళ్ళిపోవాలి, వాటిని తత్త్వవిచారణచేత పటాపంచలు చెయ్యాలి.

5 అలా చెయ్యకుండా, ఆత్మ లేదంటారు. ఆత్మప్రకాశం దొరకటం లేదంటారు అందరూ

అని శాస్త్రం చెప్తున్నది నాయనా! కనుక, ఆత్మ జగత్తును ప్రకాశింపచేస్తున్నదనే పైనచెప్పిన శాస్త్రవాక్యాల అర్థం---

ఆత్మ చెట్టు-పుట్ట-కొండలనూ---సుఖదుఃఖాదులనూ నిజంగా చూపిస్తున్నదనిగానీ, అవి సత్యమైనవిగా ప్రకాశింపచేస్తున్నదనిగానీ కాదు. ఈ చెట్టు-పుట్టలతో-నామరూపాలతో - ద్వంద్వాలతో ఆత్మకు సంబంధమేలేదు. నీవనుకున్నట్లు ఈ చెట్టుపుట్టలనే ప్రకాశింపచెయ్యాలంటే సూర్యచంద్రులూ-దీపాలూ-మొదలైన జ్యోతులు చాలా ఉన్నయ్--- ఉన్నవని అందరికీ తెలుసు, వారివారి పరిస్థితులలోనే వారికి అర్థమౌతున్నది. అందరికీ అర్థమయ్యేది శాస్త్రం చెప్పనవసరం లేదు, చెప్పదు నాయనా!

**జ్యోతిషామపి తజ్జ్యోతిః, తమసః పరముచ్యతే. (గీ 13-31)**

1 జ్యోతులనుకున్న వాటికన్నిటికీ అతీతమైన జ్యోతి ఆత్మ-ఆత్మప్రకాశం. ఈ జగత్తూ-నామరూపాలు- దేహేంద్రియాదులూ-ద్వంద్వాలూ-మొదలైన వాటిచేత అందరూ భ్రాంతిలో పడుతున్నారనీ, ఈభ్రాంతి పోవాలనీ --- రహస్యమైనదీ, అందరికీ కనపడనిదీ-తెలియనిదీ అయిన నిజాన్ని--- ప్రకాశింపజేస్తున్నది ఆత్మ.

2 ఈ నిజాన్ని ప్రకాశింపచెయ్యటం=చెప్పటం కోసం, ఆత్మ ఈ జగత్తు--నామరూపాలతోనూ- ద్వంద్వాలతోనూ సంబంధపడనక్కరలేదనీ, కేవలం తనప్రకాశంచేతనే చెప్పదలచిన-చెప్పవలసిన నిజాన్ని సర్వులకూ చెప్తున్నదనీ విచారించుకున్నాం కదూ!

**అందుకే ఆత్మ చిత్--చిన్మాత్రం--కేవలప్రకాశం.**

చిన్మాత్రం=కేవలప్రకాశం ఎలా ఉంటుందంటే చెప్పటానికి మాటలేదు-భాషలేదు- పోల్చటానికి పదార్థాలూలేవు, ఎన్ని చెప్పినా అనాత్మములూ-జగత్పరములే. వాటితో ఆత్మప్రకాశం చెప్పబడలేదు.

**న తత్ భాసయతే సూర్యః, న శశాఙ్కో న పావకః. (గీ15-6)**

ఆత్మను సూర్యుడు ప్రకాశింపచేయలేదు-చెప్పలేదు
ఆత్మను చంద్రుడు ప్రకాశింపచేయలేదు-చెప్పలేదు
ఆత్మను అగ్ని ప్రకాశింపచేయలేదు-చెప్పలేదు.

అంటే, సూర్యచంద్రులూ-అగ్నీ-మొదలైనవాటి ప్రకాశాన్ని చూచి-తెలుసుకొని, ఆత్మప్రకాశం ఇలా ఉంటుందనటానికిగానీ-ఊహించటానికిగానీ వీలుకాదు.

స్వామీ! పైన సూర్యునితోనూ, ట్యూబ్ లైట్ తోనూ పోల్చుతూ శాస్త్రవాక్యాలు చెప్పారు గదండీ!

పై మాటలలో సూర్యునితోనూ-ట్యూబ్ లైట్ తోనూ పోల్చి ఆత్మప్రకాశాన్ని చెప్పలేదు నాయనా! ప్రకాశములూ-ప్రకాశ్యములూ(ప్రకాశింపబడినవి)--వీటిమధ్యఉన్న సంబంధం ఎలాంటిదో చెప్పటానికి అందరికీ తెలిసిన జగత్పదార్థములైన సూర్యుడు-ట్యూబ్ లైట్ ను గురించి చెప్పుకున్నాం.

అంటే, ప్రకాశములూ-ప్రకాశ్యముల సంబంధం అర్థంకావటానికి ఉదాహరణలు చెప్పుకున్నామేగానీ, ఆత్మప్రకాశం సూర్యుని ప్రకాశంవలెగానీ, చంద్రుడూ-అగ్నీ-ట్యూబ్ లైట్-మొదలైననాటి ప్రకాశంవలెగానీ ఉంటుందని శాస్త్రం చెప్పటంలేదు నాయనా! ఆత్మప్రకాశం అంటే జ్ఞానజ్యోతి. (ఆత్మయొక్క జ్ఞానస్వరూపమంటే ఏమిటో తర్వాత చూద్దాం).

అందుకే ఆత్మ చిత్

న తత్ర చక్షుర్గచ్ఛతి, న వాగ్గచ్ఛతి, నో మనః,
న విద్మః, న విజానీమః, యథైతదనుశిష్యాత్,
అన్యదేవ తద్విదితాత్ అథో ఽవిదితాదధి. (కేనఉ.1-3)

1 సూర్యుడు-చంద్రుడు-అగ్ని-ట్యూబ్ లైట్-మొదలైన జ్యోతులను చూడగలిగే జ్యోతియైన కన్నుకూడా ఆత్మప్రకాశాన్ని చూడలేదు.

2 కన్నుచూడలేని ప్రకాశాన్ని (చైతన్య-జ్ఞాన-ఆనందాలనుకోబడే వాటిని) వాక్కుతో పలికి, ప్రాసలతో కవితలు పలికించి, రాగాలతో శబ్దతరంగాలను మృదు-మధుర-గార్దభస్వరాదులతో సృష్టించి, ప్రకాశవీక్షణలో చేతులుఊపి-తలలుపంకించినప్పటికీ, వాక్కు తనప్రకాశంతో ఆత్మను ప్రకాశింపచేయలేదు. ఆత్మప్రకాశాన్ని చెప్పలేదు-చూపలేదు.

3 వాక్కుచెప్పలేనివి మనస్సుతో ఊహించి భావకవిత్వంలో, ఎవరికీ అర్థంగానివీ, తనకు అసలేఅర్థంగానివీ అయిన భావాలలో తేలిపోయి, తన ఊహాలోకంలో ఊరంతా ముంచెత్తి, శాస్త్రాలకు తప్పుడర్థాలు, భగవంతునికి కామబుద్ధులూ, తత్త్వానికీ-జగత్తుకూ సంబంధించిన సమన్వయాలూ, పరమాత్మ-జీవాత్మ-జగత్తులలో సర్వత్రా కామములే కోరి-ఏరి-ఆరోపించి, సమభావంకోసం పాటుపడే మనస్సు (తన ఈప్రకాశంచేత) ఆత్మప్రకాశాన్ని ఊహించలేదు.

4 పనికిరాని ఈ(కన్ను-వాక్కు-మనస్సు)పనిముట్లను పట్టుకొని, వాటికి కామమనే తుప్పునుపట్టించి ఆత్మప్రకాశంకోసం ప్రయత్నిస్తే తెలుసుకోలేము.

5 ఇలా తెలుసుకోలేమని తెలుసుకోలేక తుప్పును ఇంకాగట్టిగాపట్టిస్తుంటే అసలుకే ముప్పువస్తుంది. పొగరు పెరిగిపోతుంది, మకురుతనం మరింతగా పెరిగి, కుతర్కవాదాలు ప్రారంభమై-విజృంభించి-అలవాటుగామారి-

అసలుగానే నిలిచిపోతయ్. అప్పుడు, శిష్యుడంటే ఎవరో-ఎలాప్రవర్తించాలో, శిష్యుడు ముముక్షువు ఎప్పుడౌతాడో, తత్త్వాన్ని శాస్త్రం ఎలాచెప్తున్నదో, ఎంతఖచ్చితంగా చెప్తున్నదో, కత్తితో కోసినట్లూ, గొడ్డలితో పగులగొట్టినట్లూ చెప్తున్నదో, జగద్భావాన్ని చీల్చిచెండాడుతున్నదో,

కామపిశాచాన్ని కాల్చి-మాడ్చిపారేస్తున్నదో,

అలాంటి తత్త్వాన్ని ఎలా శ్రవణంచెయ్యాలో,

ఎలాంటి శ్రద్ధాభక్తులతో శ్రవణంచెయ్యాలో,

ఎంతటి అకుంఠిత విశ్వాసంతో శ్రవణంచెయ్యాలో,

ఎంతవరదాకా శ్రవణమననాదులను విసుగుచెందక చెయ్యాలో ఈ నియమావళిలో ఒక్క రేఖనుకూడా పట్టలేని నీచస్థితి స్థిరమౌతుంది.

6 అందుకే, తెలియబడే జ్యోతులన్నిటికంటే అన్యమైనది ఆత్మజ్యోతి. తెలియబడే(తెలియబడుతున్న వనుకొనే) దేహేంద్రియాదుల ప్రకాశం=చైతన్యంకంటే అన్యమైనది ఆత్మప్రకాశం=ఆత్మచైతన్యం. తెలియబడే ప్రకాశ్యములు=ప్రకాశింపబడుతున్న జగత్తుకూ జగత్పదార్థాలకూ అన్యమైనది ఆత్మప్రకాశం. తెలియబడనప్పటికీ మోసం చేస్తున్నదనుకోబడే మాయకూ-మాయచేష్టలకూ అన్యమైనది ఆత్మప్రకాశం=ఆత్మచైతన్యం. తెలియబడని అవ్యాకృతమూ-అవ్యక్తమూ-మహత్తూ-ప్రకృతీ మొదలైన శబ్దములకూ-శబ్దవాచ్యములకూ అన్యమైనది ఆత్మప్రకాశం=ఆత్మచైతన్యం. తెలియబడని సృష్టిస్థితిలయక్రీడలకూ, ఈక్రీడలలో వేడుకలు చూస్తున్నారనీ, ప్రారబ్ధానికి వశులై అఘోరిస్తున్నారనీ అనుకోబడే బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులకూ అన్యమైనది ఆత్మచైతన్యం. తెలియబడని ఈశ్వరునికీ, (జగత్తుకు సంబంధించిన) ఈశ్వరుని ఆజ్ఞలకూ-శాసనాలకూ ఈశ్వరుని విలాసాలకూ-లీలలకూ అన్యమైనది ఆత్మచైతన్యం. తెలియబడుతున్నప్పటికీ తెలియబడటం లేదనుకొనే అజ్ఞానమదాంధతకూ, సంసారసాగర సుఖదుఃఖాలకూ అన్యమైనది ఆత్మచైతన్యం. తెలియబడనప్పటికీ తెలియబడుతున్నవనుకొనే షట్చక్రభేదనలూ-కామపూరితభక్తిగీతాలకూ, పండితంమన్య వివిధమతాలకూ---- అసలుకే అన్యమైనది ఆత్మచైతన్యం=ఆత్మప్రకాశం.

అందుకే ఆత్మ చిత్ - ప్రకాశమైనది - చిన్మాత్రం.

దీవ్యత ఇతి దేవః స్వయంప్రకాశమైన దేవుడే. ఆత్మప్రకాశం.

**జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే** (గీ13-31)

**జడైస్తైర్నావభాస్యతే** (ఆత్మబోధ-28)

ప్రకాశములకన్నిటికీ ప్రకాశమై, తన స్వయంప్రకాశంచేత సర్వప్రకాశప్రకాశ్యములనూ తమస్సుగా=చీకటిగా=అంధకారబంధురాలుగా చేసేస్తున్నది. అన్నిటినీ చీకటిగాచేసి తను ఒక్కటిగా-అద్వితీయమై స్వప్రకాశమై ఉన్నది.

జడములూ-చీకటిస్వరూపాలూ అయిన ఇతరపదార్థముల వేటిచేతనూ ప్రకాశింపబడటం లేదు.

అందుకే ఆత్మ చిత్ -- ప్రకాశమైనది -- చిన్మాత్రం.

అజ్ఞానాన్మానసోపాధేః కర్తృత్వాదీని చాత్మని,
కల్ప్యన్తే ఽమ్బుగతే చన్ద్రే చలనాది యథా ఽమ్భసః. (ఆత్మబోధ-22)

గగనంలో చంద్రుడు నిశ్చలంగా ఉన్నాడు. క్రిందనీటిలో చంద్రుని ప్రతిబింబం కనిపిస్తున్నది. కనిపించేది ప్రతిబింబమేగానీ నీటిలో చంద్రుడులేడు నీటికి అనంతదూరంలో ఉన్నాడు. గాలి వీచేసరికి చంచలమైన నీరు కదలటం ప్రారంభమయింది. నిశ్చలమైన చంద్రునికి కదలిక లేనేలేదు. అయినా, నిశ్చలమైన నిజచంద్రుని చూడక, గాలికి చంచలమైన నీటిలోని చంద్రునిప్రతిబింబం చూచి, ప్రతిబింబం కదుల్తుంటే చంద్రుడు కదుల్తున్నట్లుగానూ, అలలతో అట్టిట్టాడినట్లుగానూ కనిపించినట్లు--- ఆత్మ(చంద్రుడు) జ్ఞానస్వరూపమై ఉన్నది. ఆత్మకు (ఆత్మతత్త్వానికి) అతిదూరంగా ఉన్నవి దేహేంద్రియాదులు(నీరు), దేహేంద్రియాదుల ప్రవృత్తి(నీటి చంచలత్వం) దేహం పుట్టటం-పెరగటం-క్షీణించటం-చావటం, ఇంద్రియాలు ఇంద్రియార్థాలనుకోరటం, మనస్సు సంకల్పించి కోరికలనుకోరటం, మంచీ చెడూ-సుఖదుఃఖం-మొదలైన ద్వంద్వాలను పొంది అనుభవించటం-- ఇటువంటి దేహేంద్రియాదుల ప్రవృత్తిలో ఆత్మతత్త్వం ఉండదు. ఆత్మ సర్వవ్యాపి. ఆత్మతత్త్వజ్ఞానాన్ని సర్వులూ సర్వకాలాలలో పొందుతున్నారు- అనుభవిస్తున్నారు. ఇది అసలైన నిజం. (చంద్రునిప్రకాశాన్ని అందరూ అనుభవిస్తున్నప్పటికీ అంతటితో తృప్తిచెందక, నీటిలో బింబంకదుల్తుంటే సంతోషించి, ఆటలాడి తృప్తిచెందే చందాన)-- దేహాంగల దేహి -- తనుదేహం కలవాడేగానీ దేహమేతానుకాదు. ఈదేహి(సర్వులూ) సర్వకాలాలలో వాస్తవమైన ఆత్మతత్త్వజ్ఞానాన్నే తాను పొందుతూ-అనుభవిస్తూ, నిజానికి ఆత్మస్వరూపుడే అయినప్పటికీ -- తన నిజస్వరూపం ఆత్మయే అయినప్పటికీ, తన నిజజ్ఞానం ఆత్మజ్ఞానమే అయినప్పటికీ, ఇంతటితో తృప్తిచెందక, తన స్వరూపం దేహేంద్రియాదులేననీ, తన జ్ఞానం దేహేంద్రియాదుల ప్రవృత్తియేననీ, భావిస్తూ, దేహేంద్రియాదులలో తన ప్రతిబింబంను చూస్తున్నాడు -- తనను విడిచేస్తున్నాడు.

ప్రతిబింబం అసలు స్వరూపం ఎప్పటికీ కాదు

అలాగే, దేహేంద్రియాదులకు సంబంధించిన తనస్వరూపం= ప్రతిబింబస్వరూపం, ఉన్నదనుకున్నప్పటికీ ఆత్మయొక్క సత్ స్వభావం ఉండటంవలె ఉన్నది కాదు. పెరిగి పెద్దదయి కదుల్తున్నప్పటికీ--- ఆత్మయొక్క చిత్ స్వభావం-చైతన్యం వలె చైతన్యమైనది కాదు.

ఇంద్రియాది ప్రవృత్తులచేత ప్రకాశించినట్లు కనపడినప్పటికీ -- ఆత్మయొక్క చిత్ స్వభావం-ప్రకాశం వలె ప్రకాశమానమైనది కాదు.

కామభోగాలను తెలుసుకొని కామభోగములలో పరిపూర్ణత పొందినప్పటికీ - ఆత్మయొక్క చిత్ స్వభావం-జ్ఞానంవలె జ్ఞానస్వరూపమైనది కాదు.

ఇలా దేహేంద్రియాదులనే సృష్టించుకుంటూ, వాటిలోనే నివసిస్తూ, వాటినే అనుభవిస్తూ, అవే తనసర్వంగా భావిస్తూ (గౌణ-నీచమైన) ఆనందాలను అనుభవిస్తున్నాననుకున్నప్పటికీ---- ఆత్మయొక్క ఆనందస్వభావం--ఆనందం వలె ఆనంద స్వరూపమైనది కాదు. అయినా, తన నిజస్వరూప సచ్చిదానంద ఆత్మను విడిచి దేహేంద్రియాదులతో తన సత్ చిత్-ఆనంద స్వభావాలను కల్పించుకుంటూ= ప్రతిబింబాన్ని చూస్తూ

**తను చూచి గ్రహించేది తన ప్రతిబింబమేగానీ, తన నిజస్వరూపం కాదు అనే జ్ఞానం లేక, అజ్ఞానంలో**

1 దేహేంద్రియాదుల కర్మలను తనకర్మలుగానూ
2 వాటికర్మల కర్తృత్వం తన కర్తృత్వంగానూ
3 వాటి కర్తృత్వఫలంగా కల్గిన భోక్తృత్వం తనభోక్తృత్వంగానూ
4 వాటి భోక్తృత్వానికి పర్యవసానమైన సంసారమే తన సంసారంగానూ

తప్పుగా భావనలు చేస్తుంటాడు. అంటే, గాలిచేత చలితమైన నీటిలో చంద్రుని ప్రతిబింబం కదుల్తుంటే నిశ్చలమైన చంద్రుడే కదుల్తున్నాడన్నట్లుగా, దేహేంద్రియాదులు తమ కర్మ-కర్తృత్వ-భోక్తృత్వాదులనే గాలిచేత చలింపబడుతుంటే, దేహేంద్రియాదులతో సంబంధం ఉన్నదనుకున్న తన ప్రతిబింబంకూడా చలింపబడుతూ, అజ్ఞానానికి గురియై సంసారంలో కూరుకుపోతున్నదనీ, ఈ ప్రతిబింబస్వరూపమే తాననీ=జీవాత్మయనీ అనుకుంటుంటాడు. ఇలా దేహేంద్రియాదులతో సంబంధం ఉన్నదనుకున్నంతమాత్రంచేత ఆత్మకు=తననిజస్వరూపానికి ఏచలనమూ కలుగలేదనీ, సంసారగతం కాలేదనీ---- (ఈ)నిజం=తత్త్వం గుర్తించి-- గ్రహించక, గ్రహించే జ్ఞానంలేక, అజ్ఞానంలో తన తప్పుడు భావాలలోనే జీర్ణమయిపోయి, తనను తనస్వరూపంగానే=తననిజస్వరూపంగానే=పరమాత్మస్వరూపంగానే చూడక, ప్రతిబింబస్వరూపంగా=జీవాత్మగా=సంసారిగా చూస్తాడు-అనుకుంటాడు. తనకు కూడనిభ్రమను తానే కల్పించుకుంటాడు. స్వయంకృతాపరాధంచేతనే సంసారియైనట్లు భావించి ఏడుస్తున్నప్పటికీ, ఈ భావనలూ-అనుకోవటాలూ విడువక---- ప్రతిబింబవాదంచేత తనభావనలన్నీ సరియైనవి అంటాడు. ఇలాంటివేవో క్రొత్తవాదాలు తెచ్చి జ్ఞానినైనాననుకుంటాడే గానీ

**ప్రతిబింబం ఎప్పుడూ నిజస్వరూపం కాదనీ--- తనకు కావలసినది**

నిజస్వరూపమే కానీ, ప్రతిబింబమూ-ప్రతిబింబవాదమూ-సంసారమూ కాదనీ గ్రహించడు నాయనా! ఈ కల్పితభ్రమకు-ప్రతిబింబానికీ-ప్రతి బింబవాదజ్ఞానానికీ అతీతమైనది ఆత్మ.

**అందుకే ఆత్మ చిత్ -- జ్ఞానమయం.**

అద్దంలో కనబడే ప్రతిబింబం తన స్వరూపంకాదు. అది ప్రతిబింబం మాత్రమే. మురికీ-జిడ్డూ పేరుకున్న అద్దంలో ప్రతిబింబం చూచుకొని, ప్రతిబింబం మురికిగా కనిపిస్తుంటే **ప్రతిబింబమే తన స్వరూపమనుకొనే మూర్ఖత్వంలో** తన స్వరూపానికి మురికిసోకిందని అనుకుంటూ, అద్దం పైన మురికిని తన స్వరూపానికి ఆరోపించుకొని, మురికి సోకిందనుకున్న ముఖాన్ని ముప్పదిమార్లు కడిగి, ఇంకా మరకలు కనిపిస్తునవని ముఖాన్ని కత్తితో గీకి, అద్దంలో చూచుకున్నప్పటికీ, ఎప్పటివలె మురికిగానే కనిపిస్తుంది ముఖం. అలా కాకుండా, మురికి పేరుకున్న అద్దంను శుభ్రంగా తుడిచి, శుభ్రమైన అద్దంలో చూచుకుంటే తన అసలుస్వరూపం ఉన్నది ఉన్నట్లుగా కనిపిస్తుంది.

అలాగే, సదా కామములనే మురికీ-జిడ్డూ పేరుకున్న దేహేంద్రియాదు లలో తన ప్రతిబింబం చూచుకుంటూ (అంటే దేహేంద్రియాదులే నేను అని తాదాత్మ్యత చెందుతూ) దేహేంద్రియాదులతో కలుషమైనదే (ప్రతి బింబమే) నేను అనిభావిస్తూ, సంసారంలోదొర్లుతూ, సంసారంలో సుఖాన్ని ఆశించి, దేహానికి అందాలూ-సుగంధాలూ, ఇంద్రియాలకు నవరుచులూ, మనస్సుకు ఇంపుగా నవరసాలూ, పుణ్యంకోసం గంగా-గోదావరీ స్నానాలూ, వ్రతాలూ-నోములూ-యజ్ఞాలూ-ఇత్యాదిగా వ్యావహారిక-దైహిక-దైవీకర్మల న్నిటిలో కామములలోనే మునుగుతూ శుచినవుతున్నాననుకుంటే సుఖం దుస్సాధ్యమే. ప్రతిబింబం మురికిసోకి ఎప్పటిలాగానే కనిపిస్తుంది, సుఖం రాదు-దుఃఖంపోదు, పంసారం సుస్థిరమై కూర్చుంటుంది. అలాకాకుండా, దేహేంద్రియాదులలో వసించుకుని కూర్చున్న కామములను నిగ్రహించి శుభ్రంచేసుకుంటే (అద్దం శుభ్రంచేసుకుంటే), తన ప్రతిబింబం శుభ్రంగా కనిపిస్తుంది. శుభ్రమై-శుచియైన మనస్సుతో తాదాత్మ్యతచెందితే తన నిజస్వరూపానుభవం కలుగుతుంది.

ఇలా తత్త్వవిచారణ చెయ్యకుండా, ప్రతిబింబవాదం అని చెప్తూ--- పుట్టి చచ్చే నేను జీవాత్మను, పరమాత్మయొక్క ప్రతిబింబాన్ని అని, ఇంతమాత్రం తెలుసుకున్నందువల్ల జ్ఞానినయ్యానంటూ సంసారంలో తిరగాడటం శుద్ధశుంఠత్వం నాయనా!

**దేహాదుల జ్ఞానమే అజ్ఞానం**

**దేహాదులకు సంపూర్ణంగా విలక్షణమైనదే ఆత్మ.**

అందుకే ఆత్మ చిత్ -- జ్ఞానమయం.

దేహేంద్రియగుణాన్ కర్మాణి, అమలే సచ్చిదాత్మని,
అధ్యస్యన్త్యవివేకేన, గగనే నీలతాదివత్. (ఆత్మోబోధ-21)

THE SKY IS BLUE అని తప్పుడు చదువులు చదివి తలపైకెత్తి, పైచూపులు చూచి, పైన-ఎక్కడో మూతబోర్లించినట్లు నీలంగా కనబడుతుంటే, ఆ కనబడేది ఆకాశం, ఆకాశం నీలంగా ఉంటుంది అని చదువుతుంటారు నాయనా! ఆకాశం అనంతం, పైన-ఎక్కడో లేదు, సర్వవ్యాపి, నీ చుట్టూకూడా ఉన్నది. నీవు(నీదేహం) ఉండటానికి అవకాశాన్నిచ్చేది ఆకాశం. ఆకాశానికి స్పర్శరూపరసగంధములు లేవు. రూపమే లేనప్పుడు రంగు ప్రసక్తేలేదు. మరి అందరూ అలా అంటారెందుకని అడిగితే, అలా అనడమే అధ్యాస అనంటున్నది శాస్త్రం. ఊహించికల్పించి ఆకాశానికి నీలిరంగును ఆరోపణ చేస్తున్నారంటున్నది.

అలాగే కామప్రవృత్తిలో ఉన్న దేహేంద్రియాదులు, కామానికి అనుగుణంగా ఒక్కొక్కకామానికి ఒక్కొక్కసారి ఒక్కొక్కపరిస్థితిలో ఒకవిధమైన గుణాన్ని సృష్టించుకొని, గుణబద్ధమైన కర్మలు చేసుకుంటూ, గుణ-కర్మ గణబద్ధమైన --- ఈగుణంవల్ల ఇలాంటికర్మ, ఈకర్మకు ఇలాంటిఫలం, ఈఫలంవల్ల ఇలాంటిభోగం, ఈభోగంవల్ల ఇలాంటిగుణం, ఈగుణంవల్ల ఇలాంటికర్మ, ఇలా గుణములూ -కర్మలూ గణబద్ధంగా CALCULATEDగ సంసారానికి కారణమవుతున్నయ్. అయినా అవివేకంలో (వివేకం పూర్తిగాకోల్పోయి), మాలిన్యంతో కూడుకొని, దుర్గంధాన్ని టన్నులకొద్దీ కక్కుతున్న దేహేంద్రియాదుల గుణకర్మల సంసారకారణాన్ని చిన్మయమనీ--జ్ఞానమనీ-- దేహేంద్రియాదులతో తాదాత్మ్యత చెందుతూ ఈ సంసారకారణ అజ్ఞానమే ఆత్మజ్ఞానమనీ అంటూంటారు.

మాలిన్యమైన అజ్ఞానాన్ని శుద్ధమైన ఆత్మయందు ఆరోపణచేస్తారు. ఇదే అవివేకం-అజ్ఞానం. దేహేంద్రియాదుల కామములూ-గుణకర్మలూ-మాలిన్యమూ ఆత్మయొక్క శుద్ధతత్త్వమూ -- వీటి వివేకం ఆత్మజ్ఞానంవల్లనే కలుగుతుంది. ఆత్మజ్ఞానంవల్లనే సంసారం నాశనమవుతుంది.

అందుకే ఆత్మ చిత్ -- జ్ఞానమయం.

రాగేచ్ఛాసుఖదుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే,
సుషుప్తౌ నాస్తి తన్నాశే తస్మాద్బుద్ధేస్తు నాత్మనః. (ఆత్మబోధ-23)

స్వామీ! దేహేంద్రియాదులూ-నామములూ-గుణకర్మలూ మాలిన్యంఅనీ-మురికిఅనీ ఎందుకనాలి? కామములననుభవిస్తూ ఆనందిస్తున్నామనే అందరూ అనుకుంటున్నారు కదా! ఇదే తప్పు నాయనా! ఇలా అనుకొనే అందరూ సూపేన పాదమప్రావిశత్ పప్పులో కాలువేస్తున్నారు.

చూస్తూచూస్తూ బోర్లపడుతున్నారు--- సుడిగుండంలోకి దూకుతున్నారు.

ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ (గీ3–34)

కామపూరితమైన ఇంద్రియాలు (ఇంద్రియాదులు), గుణకర్మలను స్పృష్టించుకొని (పరమార్థానికి పోవటంలేదు నాయనా!) ఇంద్రియార్థముల గురించే పోతున్నయ్. ఇలా ఇంద్రియాలు ఇంద్రియార్థములవెంబడి పోవటం అనే స్పర్శవల్ల -- ఒకటిమంచిది–ఇంకొకటిచెడ్డది, మంచిదైనది ఒకప్పుడు మంచిదేగాని ఇంకొకప్పుడు చెడ్డది, చెడ్డది ఒకప్పుడు చెడ్డదేగాని ఇంకొకప్పుడు మంచిది, ఒకప్పుడు ఒకరికి మంచిదైనది అప్పుడు ఇంకొకరికి చెడ్డది, ఒకప్పుడు ఒకరికి చెడ్డదైనది అప్పుడు ఇంకొకరికి మంచిది, ఒకప్పుడు ఒకరికి మంచిదైనది ఇంకొకప్పుడు వారికే చెడ్డది, ఒకప్పుడు ఒకరికి చెడ్డదైనది ఇంకొకప్పుడు వారికే మంచిది, ఒకప్పుడు మరొకరికి--- ఈవిధంగా, దేశకాలవస్తుభేదములతో దేహేంద్రియాదుల నామరూపభేదములు, భిన్నభిన్నమనుష్యుల ప్రవృత్తులతో స్పర్శకొని--- రాగద్వేషాలూ–మంచీచెడులూ–సుఖదుఃఖాలూ–న్యాయాన్యాయాలూ–జయాపజయములూ–ఇష్టానిష్టములూ అనే ద్వంద్వాలు పుట్టుకొస్తున్నయ్. ద్వంద్వానుభవమే సుఖం–జ్ఞానం అంటారు మూఢులు, వీరికెలా చెప్పాలి? పోనీ ఇవైనా ఏదోఒకటి స్థిరంగా–శాశ్వతమై ఉంటవా అంటే, ఆగమాపాయినః అనిత్యాః (గీ2–14) అలా కాదు, వస్తుంటయ్–పోతుంటయ్, ఏవీ కాపురంకట్టుకొని నిలవటంలేదు. వస్తూ–పోతుండేవే అయినా ద్వంద్వాలు రెండూ **ఒకటిగా** చేరి, **ఒకవీలుగా** వచ్చి, **ఒకతీరుగా** సంభాషించి, **ఒకపద్ధతిగా** తృప్తినిస్తుంటయ్యని అందామా అంటే,

**సుఖస్యానన్తరం దుఃఖమ్, దుఃఖస్యానన్తరం సుఖమ్,**
**చక్రవత్పరివర్తన్తే, దుఃఖాని చ సుఖాని చ.**

అలాకూడా కాదుట. సుఖం అనుకొనేది వస్తూవస్తూనే ఎగిరి గంతులు పెట్టించి పైకి ఎగురవేస్తే, సుఖంవెంటనే దుఃఖంవచ్చి గట్టిగా నెత్తిమీద ఒక మొట్టికాయ ఇస్తుంది, దాంతో క్రిందపడతాడు. ఇలా ఎప్పుడో ఒకసారి జరుగుతుందేమోననుకుందామంటే, అలా జరుగదుట. చక్రం తిరిగినట్లు సుఖదుఃఖాలు వరుసగా వస్తూనే ఉంటవిట. చేతిలోఉన్న బంతిని క్రిందికికొడితే భూమి పైకిఎగురవేస్తుంది. మళ్ళీ క్రిందికికొడితే మళ్ళీ భూమి పైకిఎగురవేస్తుంది, ఇదీ వరుస. ఈఆట మానేస్తే బంతికైనా విశ్రాంతి దొరుకుతుందిగానీ, సుఖదుఃఖాల చక్రానికి విశ్రాంతిలేదుట. శాస్త్రం ఇలా ఒకచోట చెప్పి, ఈ ద్వంద్వాలతాకిడి ఇంత సులభంకాదు సుమా!---

**సుఖమధ్యేస్థితం దుఃఖమ్, దుఃఖమధ్యే స్థితం సుఖమ్,**
**ద్వయమన్యోన్యసంయుక్తమ్, ప్రోచ్యతే జలపఙ్కవత్.**

(అధ్యాత్మ రామాయణం)

సుఖమనేది వస్తూంటే, సుఖంలోనే దూరుకుని మూలుగుతూ దుఃఖం వస్తుందిట. దుఃఖమనేది వస్తూంటే, "పోనీలే! ఇదే సుఖమనుకో, ఇదే ప్రమోషన్ అనుకో, ఇదే లాటరీలో విజయం అనుకో, స్వర్గలోకభోగం అనుకో..." అంటూ వెక్కిరిస్తూ వస్తుంటుందిట సుఖం. సుఖంవస్తూంటే దుఃఖం కూడా వస్తానంటుంది. దుఃఖంవస్తూంటే సుఖంకూడా వస్తానంటుంది. రెండూకలిసి వచ్చి ఎడాపెడా చెంపలు వాయిస్తయ్. ఒక్కఊపు ఊపి క్రిందపడేసి-పకపకనవ్వుకుంటూ పోతయ్, నీ అసమర్థతను చూచి. రెండూ కలిసిరావటమంటే వచ్చి రెండుకుర్చీలలో వేరువేరుగా కూర్చోవటం కాదు. నీరు-బురదా కలిసిపోయినట్లుగా కలిసిపోయి వచ్చి, విచారణ చేసుకోనీకుండా మంటపెడ్తుంటయ్. ఇలా చెప్పటం చూచి, నీ మొగంలా ఉన్నది చెప్పటం... అనంటున్నాడు భగవంతుడు భగవద్గీతలో. సుఖదుఃఖాల కథ (ద్వంద్వాల కథ) ఇంకా తీవ్రమైనదంటున్నాడు చూడు నాయనా !

యే హి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవ (గీ5-22)

సుఖం-సుఖం-సుఖం అంటూ ఇంకా సుఖంవచ్చేప్రసక్తి చేస్తారేమిటి? ఇదేం చెప్పటం? చెప్పేదేదో పరిగ్గా నిశ్చయంగా సందేహానికి తావులేకుండా చెప్పాలి. కామమయులైన ఈమనుష్యులందరూ సుఖం అనేమాట వింటూనే ఏదో ఐహికసుఖం భారీఎత్తున వచ్చేస్తుందనుకుంటారు. వ్యంగ్యంగానూ-చమత్కారపుమాటలతోనూ- హాస్యంగానూ చెప్తే అంతావిని-నవ్వి--మళ్ళీ తమపాతబాటకే వస్తారు. చెప్పినదంతా తమనుగురించి కాదనీ, ఇతరులందరిగురించేననీ, తమకు దుఃఖంరాదనీ, సుఖమే సదా వస్తూంటుందనీ అనుకుంటుంటారు. కనుక, ఈ ద్వంద్వముల గురించి అందరూ తెలుసుకోవలసినది చెప్తా విను---

జగత్పదార్థముతోటి (ఆత్మేతరములతోటి) సంబంధం= స్పర్శవల్ల ఏవో భోగములు వస్తున్నవనుకుంటున్నారే--- మంచి-సుఖం--లాభం-ఇష్టం-- ఇవన్నీ వాస్తవానికి దుఃఖయోని--దుఃఖం ఉండే చోటు -- దుఃఖ స్థానం -- దుఃఖ స్థిరనివాస స్థానం, అంతే కాదు, ఒక నివాస స్థానమే గాదు. దుఃఖయోనయః -- ఒక్కొక్కసుఖం అనేకదుఃఖముల సుస్థిరనివాసం. ఇంతేనా! కాదు, ఇంకా దుఃఖయోనయః ఏవ - అనేకదుఃఖముల సుస్థిరనివాసములు మాత్రమే.

దుఃఖాలయములు మాత్రమే సుఖం యొక్క ప్రసక్తి లేదు

ఈ భోగములనుకోబడేవి వస్తుంటే సుఖాదులననుభవిస్తూన్నామనుకుంటారే గానీ, వాస్తవంలో వారు దుఃఖాలయాలలో దూరి దుఃఖాన్ని ఆరాధిస్తున్నారు (దేవాలయాలలో దేవుడిని ఆరాధించినట్లు). ఎలాగో చూడు. అసలు, భోగం అనే శబ్దానికి నిజమైన అర్థం-అనుభవం---- అది

సుఖమేగానీ, దుఃఖమే గానీ. సుఖం అనే శబ్దానికి నిజమైన అర్థం--- మోక్షం-మోక్షసుఖం. అయినా, భోగం అంటే సుఖం అనేఅర్థమే చెప్పుకొని, సుఖం అనేది జగత్తులోనూ-దేహంలోనూ ఉన్నదనుకొని--- భోగమంటే భోజనమనీ-ధనమనీ, ఇంకా అష్టభోగాలనీ (గృహము-శయ్య-వస్త్రము-ఆభరణము-స్త్రీ-పుష్పము-గంధము- తాంబూలములు) అనీ, తమ కిష్టమైన అర్థాలను ఊహించుకున్నారు. వీరూహించుకున్న ఈ భోగం, సుఖం అనే పదార్థాలలోకూడా అనుభవించలేనిదే దుఃఖం అన్నారు. (దుఃఖంకూడా ఒక అనుభవమే = భోగమే అని గుర్తించరు.) ఈ విధంగా సుఖదుఃఖాలను వారివారి కిష్టమైన రీతిగా నిర్వచించుకొని -- వారనుకున్న దుఃఖాదులొస్తే అవి ఉండాలని ఎవ్వరూ-ఎప్పుడూ అనుకోరు, అవిపోవాలనే ప్రయత్నం చేస్తారు. వాటిబంధంలో వుండకూడదంటారు. కానీ, వారనుకున్న సుఖాదులలో ఏ కాస్తంతైనా-ఎప్పుడైనా- ఏపొరపాటున గానీ - ఏగ్రహపాటునగాని వచ్చిందని వారనుకుంటే, దేబిరికొట్టుమొహాలల్లే సుఖమంటే ఇంతేననుకొని అది శాశ్వతంగా ఉండాలని ప్రాకులాడుతారు. వారి కాలం-బలం-ధనం-సర్వం ఈ ప్రాకులాటల్లోనే దుర్వ్యయం చేస్తారు. శాశ్వతసుఖం=మోక్షంను గురించిన విచారణను దూరవిడిచేస్తారు. అంతులేని బంధంలో చిక్కుకుంటారు. విజ్ఞానశాస్త్రవేత్తలైనా పిడికెడు కారపుబూంది (చుడువ)కోసం కాకుల్లాగా కొట్లాడుకుంటారు, ఎప్పుడూ తినని దేబిరికొట్టు మొహాలల్లే ప్రవర్తిస్తారు. వీరనుకొనే ఈ భోగం-సుఖం ఎవరైనా తప్పిస్తే అందరూ కలిసి నిరసిస్తారు -- అసోసియేషన్ పేర్లతో స్ట్రైక్ (STRIKE) చేస్తారు. ఈ వెట్టివెంగళప్పలు ముక్తికిపోవ నేర్తురే! --- నేర్వరు నాయనా !

స్వామీ ! తెలిసి బంధంలో పడుతున్నారా? తెలియకనా?

తెలిసే బంధంలో పడుతున్నారంటున్నవీ శాస్త్రాలన్నీ నాయనా! ద్వంద్వములని చెప్పబడిన వాటిలో, అందరూ కావాలనే సుఖం-మంచి-ధర్మం-లాభం-న్యాయం-ఇష్టం---- అందరూ వద్దని తోసేస్తున్న దుఃఖం-చెడు-అధర్మం-నష్టం-అన్యాయం-అనిష్టం--- వీటిని, ఈ ద్వంద్వాలను ఇలావేరుచేసి చెప్తున్నది వీరే కదూ! భగవంతుడు వీటినన్నిటినీ దుఃఖములనే చెప్పాడు కదూ ! మరి ఇలా వేరుచేసి చెప్తున్న వీరందరూ దేనితోపోల్చి వేరుచేస్తున్నారు?

దేనితో పోల్చి కావాలనేవి చెప్తున్నారు?
దేనితో పోల్చి వద్దనేవి చెప్తున్నారు?

ఈ రెండూలేని సమభావంతోనే పోల్చి చెప్తున్నారు. ఇంకొకటి లేనేలేదు. వీరు పోల్చిచెప్పటానికి సమభావంకంటె వేరే పదార్థమూ-భావమూ

లేనేలేదు. ఇంకొకటి ఏదైనా ఉన్నదంటే, వీరిదృష్టిలో ఉన్న ప్రతిదానినీ ద్వంద్వాలలో ‹ ఏఒక్కజాతికో › చేర్చేవీరు, అలవాటు ప్రకారంగా ఇదే చేస్తారు. కనుక, వేరే పదార్థంలేదు. సమభావంతోనే పోల్చి, సమ్మతమైన విశేషాలను సుఖం-మంచి-ధర్మం- లాభం-న్యాయం-ఇష్టం-ఇవి కావాలంటున్నారు. సమభావంతోనే పోల్చి అసమ్మతమైన విశేషాలను దుఃఖం-చెడు-అధర్మం-నష్టం-అన్యాయం-అనిష్టం--అవి అక్కరలేదు-వద్దు అంటున్నారు, సమభావంతోనే పోల్చిచెప్తూ, సమభావం తెలిసి-అనుభవిస్తున్నప్పటికీ, సమభావాన్ని కోరరు, సమత్వంలో ఉండటానికి ప్రయత్నించరు, ద్వంద్వాలనే కోరుతారు.

కాఫీ త్రాగటం సుఖం, బాగాఉంటుంది అని అంటారు. ఇది విపరీత భావం. కాఫీ (అనేఅన్యపదార్థ) అధీనమై, కాఫీకి బానిసఅయి, కాఫీత్రాగటం అనే విపరీతమే సుఖమనీ, త్రాగకపోతే దుఃఖమనీ చెప్తుంటారు. కానీ మొట్టమొదటగ కాఫీత్రాగటం ప్రారంభంచెయ్యక ముందు సమభావంలోనే ఉన్నారు. కాఫీత్రాగటం మొదలుపెట్టి, సమభావంతోనే పోల్చి కాఫీత్రాగటమనే విపరీతఅనుభవాన్ని సుఖం అన్నారు. త్రాగకపోవటమనే విపరీత అనుభవాన్ని దుఃఖం అన్నారు.

ప్రొద్దున లేచినప్పుడు సమభావంలోనే ఉన్నారు. దంతధావనం అవగానే, సమభావంలో నిలువలేక, **క్రిందికి జారి,** కాఫీలేదు, కనుక ఈవిపరీతఅనుభవం దుఃఖం అన్నారు. కాఫీకి ఆర్డరు ఇచ్చారు. కాఫీ తయారవుతున్నది. కనుక దుఃఖం అనే విపరీత అనుభవం దాటి, కాఫీకప్పు నోటికిఅంది జుర్రుపుర్రుమంటూ పీలుస్తుంటే, **పైకి పోయి,** కాఫీ ఉన్నది కనుక ఈవిపరీత అనుభవం సుఖం అన్నారు. ఈ విపరీతంకూడా తగ్గి, మళ్ళీ కొంతకాలం సమభావమే ఉంటుంది. మళ్ళీ కాఫీకోరే కోరికతో ఈఆవృత్తి CYCLE మొదలవుతుంది. కాఫీకోరిక=అలవాటు తీవ్రంగా ఉంటే ఆవృత్తి CYCLE తొందరగా మొదలవుతుంది. కాలవ్యవధిలో తేడా ఉంటుంది. కానీ, కాఫీకోరిక ఉన్నంతవరకు కాఫీఅనుభవ ఆవృత్తి CYCLE ఇలా జరుగుతూనే ఉంటుంది. ఈఆవృత్తి బొమ్మరూపంలో చూడాలంటే 56వ పేజీలో మొదటిబొమ్మ చూడు నాయనా!

కాఫీలాంటి కోరికలు లక్షలసంఖ్యల్లో ఉన్నయ్. అన్నీ ప్రొద్దున నిద్రలేచినప్పటినుండి రాత్రినిద్రపోయేవరకు జాగ్రత్ కాలంలోనే ఒక్కసారి చెలరేగుతూ వ్యవహారానికి వస్తయ్.

రోజుకు పదిసార్లు కాఫీ--- రెండుసార్లు భోజనం--- నాలుగుసార్లు టిఫిన్--- ఇరవైసార్లు సిగిరెట్--- ఆరుసార్లు కిళ్ళీలు--- మధ్యమధ్యలో న్యూస్ పేపరు--- మూడుప్రసారాలలో రేడియో--- పిల్లల ఏడుపు--

వాళ్ళ చదువులూ-- పక్కింటివాళ్ళ కుక్క అరుపు- వెనకఇంటివాళ్ళ గ్రామఫోను--- పైనఇంటివాళ్ళ టేప్‌రికార్డరు-- ఎదురింటి వారి టెలివిజన్-- పాలవానితో పోట్లాట-- కూరలవానితో బేరం-- ఆఫీసు హడావిడీ-- బస్సుల రద్దీ-- స్కూటర్ బ్రేక్‌డౌన్-- ఆఫీసు పని-- ఎడాపెడా దంపుడు-- అన్నీ అర్జంటు-- మార్కెటింగ్-సినిమా-విలాసం-విహారం ఇంటిబాధ్యతలు-రోగాలు-డాక్టర్లూ-మందులూ-చుట్టాలు-స్నేహితులు-రాకపోకలు ఆదాయం-ఖర్చు-అప్పు. ఇలా లక్షలసంఖ్యలో ఉన్నా--- వాటిలో అనంతమైన వైవిధ్యం. కూరలో కరకరలాడే పప్పులవరకు అన్నీ రుచులే-అన్నీ ఆనందాన్నిచ్చేవే. వీటికన్నిటికి కూడా, పైన చెప్పుకున్న కాఫీలాగా, ఆవృత్తి కలుగుతుంటుంది. రోజుకు ఏవేవి-ఎన్నెన్నిసార్లు-ఎంత తరచుగా కలుగుతుంటవో, ఎన్నెన్ని-ఒక్కసారిగా-ఎప్పుడెప్పుడు - కలిసి అష్టావధాన-శతావధాన ప్రజ్ఞలతో సంభవమవుతుంటవో, వాటి ఆవృత్తి ఇంతకంటె విశేషంగా సర్వకాలాలలో ప్రత్యక్షంగా తాండవించే చపలచిత్తమూ ఇదంతా బొమ్మరూపంలో చూడాలంటే 57వ పేజీలో మొదటిబొమ్మ చూడు నాయనా! నీ ప్రవృత్తి ఎంతగజిబిజిగా ఉన్నదో కనిపిస్తున్నది కదూ! అయితే ఈ బొమ్మకూడా నీగజిబిజిని కొంతవరకే చూపగలుగుతున్నది. లక్షలసంఖ్యలో ఉన్న కొన్నిటి ఆవృత్తి చూపిస్తేనే మధ్యలో ఉన్న సమత్వపు రేఖ కనిపించటం లేదు. ఇక, నీ ప్రవృత్తి యథాతథంగా చూపిస్తే ఏం కనిపిస్తుంది? ఏంకనిపిస్తుందో చూస్తావా? 57వ పేజీలో రెండవబొమ్మ చూడు నాయనా! అంతా చీకటి-చిమ్మచీకటి, కాంతిరేఖకూడా లేదు. సమత్వం పూర్తిగా అడుగంటుకు పోయింది.

**యథా దీపో నివాతస్థః, నేఙ్గతే సోపమాస్మృతా,**

**యోగినో యతచిత్తస్య, యుఞ్జతో యోగమాత్మనః.** (గీ6-19)

మరి నీ నిజస్వరూపమో--- గాలిలేనిచోట దీపం ఎలా నిటారుగా ఉంటుందో అలా నిశ్చలంగా ఉంటుంది. ఇప్పుడు లేకపోతే ఇకనైనా ఉండటానికి ప్రయత్నించాలి. దీనిని కూడా బొమ్మరూపంలో చూడాలంటే 57వ పేజీలో మూడవబొమ్మ చూడునాయనా! ఎలా ఉన్నది? ఎగుడుదిగుడులు లేవు, హెచ్చుతగ్గులు లేవు, గజిబిజి లేదు సమత్వపు రేఖ ఉన్నదిఉన్నట్లు చక్కగా కనిపిస్తున్నది కదూ! పైన బొమ్మలలో, ఈ సమత్వపు రేఖకు పైకీ-క్రిందికీ ప్రాకినయ్ నీ కోరికలరేఖలు. పైకిప్రాకిన విపరీతాన్ని సుఖం-మంచి-ధర్మం-లాభం-న్యాయం-ఇష్టం అని అన్నావు, అన్నారు. క్రిందికిప్రాకిన విపరీతాన్ని దుఃఖం-చెడు-అధర్మం-నష్టం-అన్యాయం-అనిష్టం అని అన్నావు, అన్నారు. కానీ, ఇలా సమభావంతోనే పోల్చి ద్వంద్వాలను చెప్తున్నారనీ సమభావమంటే తమకు తెలుసుననీ,


కాఫీ
టిఫిన్
భోజనం
కక్ష్య
సిగరెట్
రేడియో/ట్రాన్సిస్టర్
సినిమా/విలాసం
ఎప్పుడూ ఉండే చపలత్వం
జాగ్రత్కాలం
6 7 8 9 10 11 12 1 2 3 4 5 6 7 8 9 10

సమభావాన్ని అనుభవిస్తున్నారనీ, అనుసరిస్తున్నారనీ గుర్తించటం లేదు. కనుక, సమభావం తెలుస్తున్నప్పటికీ బంధంలో పడుతున్నారు. తత్త్వం అనుభవిస్తున్నప్పటికీ బంధంలో చిక్కుకుంటున్నారు. ద్వంద్వాలన్నీ గుణపాఠం నేర్పుతున్నప్పటికీ బంధమే కోరుతున్నారు. ద్వంద్వాలలో శాశ్వతసుఖం గోచరించనప్పటికీ బంధమే బాగుందంటున్నారు.

**బుద్ధ్వా ఉప్యాద్యన్తవైరస్యం యః పదార్థేషు దుర్మతిః,**
**బధ్నాతి భావనాం భూయః నరో నాసౌ స గర్దభః.** (వా.రా.)

జగత్పదార్థాలలో కల్పించుకున్న ద్వంద్వభావాలు మొదటినుండి చివరివరకు దుఃఖగర్భితాలేననీ, శాశ్వతసుఖాన్నివ్వలేవనీ అర్థమవుతున్నప్పటికీ, అనుభవపూర్వకంగా అవగాహన అవుతున్నప్పటికీ, మళ్ళీమళ్ళీ వాటివెంబడి పోయేవాడు మనుష్యుడు కాడు, నాలుగుకాళ్ళ గాడిద–పశువు అనంటున్నది వాసిష్ఠరామాయణం. అసలు, ఈ ద్వంద్వాల ఉనికి విచారిస్తే జాగ్రత్ స్వప్నావస్థలలో మాత్రం ఉన్నట్లుగా–సత్యమైనట్లుగా కనిపిస్తుంటయ్. జాగ్రత్ స్వప్నావస్థలలో జగత్ పదార్థాలనూ, వాటి నామరూపాలనూ చూస్తూ, చూచినవారు చూచినదానిని చూచినట్లు చూస్తుంటేనూ, ఊహించినవారు ఊహించినదానిని ఊహించినట్లు ఊహించుకుంటుంటేనూ, కల్పించుకునేవారు కల్పించుకున్నదానిని కల్పించుకున్నట్లు కల్పించుకుంటుంటేనూ

అనుకునేవారు అనుకున్నదానిని అనుకున్నట్లు అనుకుంటుంటేనూ

ద్వంద్వాలు ప్రవర్తిస్తున్నయ్. వీరి చూపులూ–ఊహించుకోవటమూ–కల్పించుకోవటమూ– అనుకోవటమూ అనే బుద్ధి జాగ్రత్స్వప్నావస్థలలో తాండవంచేస్తుంటే ద్వంద్వాలు ప్రవర్తిస్తున్నయ్. సుషుప్తి (గాఢనిద్ర) అవస్థలో ఈపాడుబుద్ధి తాత్కాలికంగా లేకుండా పోతున్నది (తీసి గూట్లోపెట్టి నిద్రపోతూంటారు). కల్పించే ఈపాడుబుద్ధి లేదుకనుక ద్వంద్వాలు లేవు. సుషుప్తిలో ద్వంద్వాలు లేకపోయినా నేను ఉన్నాను అననే అందరూ అంటున్నారు. సుషుప్తిలో తన ఉనికిని తెలుసుకుంటున్నాడు. అంటే, ద్వంద్వాలులేకనే తను(ఆత్మ) ఉండటాన్ని తెలుసుకుంటున్నాడు(రు)–అనుభవిస్తున్నాడు(రు) – సుఖంగా ఉన్నానని అంటున్నాడు(రు). ఇలా ప్రతిరోజూ తమ అనుభవంద్వారా అర్థమవుతున్నప్పటికీ మళ్ళీవచ్చే జాగ్రత్స్వప్నావస్థలలో సర్వాన్ని కల్పిస్తున్న ఈపాడు బుద్ధిధర్మమే ఆత్మధర్మమనుకుంటారు. ద్వంద్వాలలోనే తమ ఉనికిని చూచుకుంటుంటారు. ద్వంద్వాలనే అనుభవిస్తుంటారు ద్వంద్వాలే తామైపోతారు, జన్మజరామరణ సంసారంలో తిరుగాడుతుంటారు. ఇదేవీరుచేసే తప్పు. ఇలా సంసారంలోతిరుగాడేటట్లు చేసే పాడుబుద్ధి ఆత్మ కాదు. ద్వంద్వాలలో జ్ఞానం ఆత్మజ్ఞానం కాదు. ద్వంద్వాలు కల్పించి ఊహించుకుంటున్న బుద్ధియొక్క జ్ఞానం ఆత్మజ్ఞానం

కాదు.

బుద్ధేస్సాక్షీ సర్వస్య సాక్షీ (నృ.తా.ఉ.2ఖం)

బుద్ధికికూడా ఏది సాక్షియో అదే సర్వత్ర సాక్షి, బుద్ధినికూడా ఏది తెలుసుకోగలుగుతున్నదో అదే అన్నిటిని చూడగలదు. బుద్ధినికూడా ఏది తెలుసుకోగలుగుతున్నదో అదే అన్నిటిని తెలుసుకోగలుగుతుంది.

యో బుద్ధేః పరతస్తు సః (గీ3-41)

**ఏది బుద్ధికంటె పరమైనదో అదే ఆత్మ. ఏది బుద్ధిజ్ఞానంకంటె పరమైనదో, ఏది బుద్ధికికూడ జ్ఞానాన్నిస్తున్నదో అదే జ్ఞానం= ఆత్మజ్ఞానం. అందుకే ఆత్మ చిత్ - జ్ఞానమయం.**

**అజ్ఞానకలుషం జీవమ్, జ్ఞానాభ్యాసాద్వినిర్మలమ్,**
**కృత్వా జ్ఞానం స్వయం నశ్యేత్, జలం కతకరేణువత్.**(ఆత్మబోధ-5)

దేహవాసనకూ, దేహేంద్రియమనోబుద్ధుల ప్రవృత్తికీ వశమై నానా యోనులలో పుట్టిపుట్టి చచ్చిచచ్చి పొరలుతున్న జీవుడనబడే వాడిని, దేహానికి అతీతమై, దేహేంద్రియమనోబుద్ధుల ప్రవృత్తికీ-మాలిన్యానికీ, సంసారమునకూ కారణమౌతున్న ఐహికజ్ఞానానికి అతీతమైన ఆత్మజ్ఞానం శుద్ధం చేస్తుంది, అజ్ఞానాన్ని పటాపంచలు చేస్తుంది, ఆత్మాజ్ఞానాన్ని పొందింపచేస్తుంది--- జ్ఞానాభ్యాసం చేయిస్తుంది, మననం చేయిస్తుంది. నేను ఆత్మను, దేహేంద్రియాదులు కాను అనే నిశ్చయం కలిగిస్తుంది. చెప్పగా వినితెలుసుకున్న ఆత్మజ్ఞానాన్ని(పరోక్షజ్ఞానాన్ని) జ్ఞానాభ్యాసంచేత, క్రమంగా అనుభవజ్ఞానంగా (అపరోక్షజ్ఞానంగా) మార్చి, పరిపూర్ణునిగా ఆత్మస్వరూపునిగా చేసి, జ్ఞానాభ్యాసంలో, నేను జ్ఞానం సంపాదిస్తున్నాను, జ్ఞానినవుతున్నాను అనే సాత్వికాహంకారాన్నికూడా నాశనంచేస్తుంది. అంటే, నిరంతరఅభ్యాసంచేత జ్ఞానం అంటె ఏమిటో తెలుసుకొని-నమ్మి, అజ్ఞానాన్ని నాశనం చేసుకుంటాడు. తెలుసుకున్న ఆత్మజ్ఞానాన్ని అవగాహన చేసుకుంటుంటాడు. దీనినే రసాస్వాదనం అంటారు. ఆత్మజ్ఞానాన్ని మననంచేసి ఆనందిస్తాడు.

అయినా, ఈ ఆనందం=రసాస్వాదనంకూడా తన గమ్యానికి ఆటంకం అంటున్నది ఆత్మబోధ. ఎందుకంటే, ఇలాంటి ఆనందంతోబాటుగా, తెలియకుండగనే నేను జ్ఞానినయినాననే సాత్వికాహంకారం వస్తూంటుంది. అలంభావన=ఇంకచాలు, చాలా తెలుసుకున్నాను అనే దుష్టపు సాత్వికభావన కలుగుతుంది. జ్ఞానం-జ్ఞేయం-పరిజ్ఞాతా అనే త్రిపుటి యింకా మిగిలిఉంటుంది. జ్ఞానం, జ్ఞానంవల్లపొందబడే గమ్యం=జ్ఞేయం, జ్ఞానాభ్యాసంచేసేవాడు=పరిజ్ఞాతా అనేభేదంకూడా లేని కేవలఅనుభవమే ఆత్మ, కేవల జ్ఞానమే=జ్ఞానస్వరూపమే ఆత్మజ్ఞానం. కనుక, క్రమంగా, త్రిపుటిని నాశనంచేసి ఆత్మస్వరూపానుభవాన్ని కలిగిస్తుంది.

అందుకే, ఆత్మ చిత్-చిన్మయం
=జ్ఞానమయం - చిన్మాత్రం=కేవలజ్ఞానం.

**పురాణం భారతం వేదశ్శాస్త్రాణి వివిధాని చ,**
**పుత్రదారాది సంసారో యోగాభ్యాసస్య విఘ్నకృత్.** (ఉ.గీ.3-2)

తనకున్నవనుకొనే దేహేంద్రియమనోబుద్ధులు జ్ఞానాభ్యాసానికీ-ఆత్మజ్ఞానానుభవానికీ ప్రతిబంధకాలు. తన వారనుకొనే భార్య-భర్త-కొడుకు-కూతురు-బంధువులూ, వారి దేహేంద్రియమనోబుద్ధులూ, వారినిగురించిన వారిజ్ఞానం, వారినిగురించిన నీజ్ఞానం, వారితో నీబాంధవ్యమూ-- ఇవన్నీ సదా సర్వత్ర ప్రతిబంధకాలే. ప్రతిబంధకాలైన వాటినిగురించే ముచ్చటిస్తూ, కథలతో సన్నివేశాలతో, కామ్యకర్మలను ప్రస్తావించి-విధించి-ఆశలు పెంచుతూ సంసారంనుండి తప్పించలేని శతకోటిపురాణాలూ, భారత-రామాయణాది ఇతిహాసాలు-వేదాలూ-హరికథలూ-బుర్రకథలూ-సంగీతకచ్చేరీలూ--శాస్త్రాలుకాని నేతిబీరకాయ శాస్త్రాలూ-- విజ్ఞానశాస్త్రాలూ-ఇవన్నీ ఆత్మజ్ఞానాభ్యాసానికి విఘ్నాలు-దుశ్శకునాలు, జ్ఞానాభ్యాసానికి అడ్డువస్తయ్, విఘ్నాలు కలిగిస్తయ్. నీవు, అభ్యాసంలో ఒక్కఅడుగు ముందుకు (పొరపాటున)వేస్తే ఇవి పది అడుగులు వెనక్కుతోస్తయ్.

ముఖ్యమైనపనిమీద పోతుంటే మార్జాలరావు ఎదురువచ్చి శకునం సరిగ్గాలేకపోతే, పోతున్నపని కాదని విసుక్కుంటావు కదూ! నీ శకునం మాట అటుంచి, అసలు నీశకునశాస్త్రమే మొదటి దుశ్శకునం నీకు. అనిత్యమూ-అసుఖమూ అయినా ఈలోకంలో నీకొక చెయ్యవలసినపని, విశేషించి ముఖ్యమైనపని, పాడుకాకూడని పని, పాడయ్యేదే అయినా పాడుకాకూడదని ఆశ, ఆశకు రూపకల్పనలు, రూపకల్పనకు చిహ్నాలు, చిహ్నాలకు ఆరోపణలు.

మ్యావ్ ....... అని అరిచే మార్జాలరావు దుశ్శకునం

ఒక బ్రాహ్మణుడు ఎదురువస్తే దుశ్శకునం, ఇద్దరు బ్రాహ్మణులైతే సుశకునం---అదేమిటో! ఇద్దరు బ్రాహ్మణులైతే రెండింతలు దుశ్శకునం కావాలి. లెక్కప్రకారం --ఏమిటో!!

వితంతుస్త్రీ దుశ్శకునం, సౌభాగ్యవతి సుశకునం. వితంతువుకు లేని సౌభాగ్యమేమో, సౌభాగ్యవతికున్న సౌభాగ్యమేమో! ఇద్దరికీ పిల్లలూ-సంసారం-కోరికలూ అన్నీ ఉన్నయ్. భర్తకాలంతీరిపోతే భర్తతో పసుపూ-కుంకుమా విడిచినస్త్రీ సౌభాగ్యంలేనిది. కామం తీర్చుకుంటూ, అన్నివేళలా పోట్లాడి-కొట్లాడుకుంటూ భర్త బ్రతికుంటే బ్రతికినట్లు లెక్కించి, పసుపూ-కుంకుమా ధరిస్తే సౌభాగ్యవతి. సౌభాగ్యానికి అవాంతరచిహ్నాలూ-ఐహికచిహ్నాలూ కల్పించుకొని వాటిని శకునాలకు ఆరోపణ చేసుకోవటం ఏమిటో!

వెళ్ళేది ఒక బ్రాహ్మణుడైనా ఒక బ్రాహ్మణుడు ఎదురు రాకూడదు. వెళ్ళేది వితంతువే అయినా వితంతువు ఎదురు రాకూడదు.

వెళ్ళేటప్పుడు ఎవరూ తుమ్మకూడదు. వెళ్ళేటప్పుడు ఎక్కడికెళ్తున్నావ్ అని అడగకూడదు--- ఎంత దూరం వెళ్తున్నావని అడగవచ్చుట. వెళ్ళేటప్పుడు భోజనంచేసిపొమ్మని అడ్డగించకూడదట--- దీనివల్ల విశేషదోషంట. ఇలాంటి మూఢనమ్మకాలకూ మూఢాచారాలకు ఒకశాస్త్రం--- శకునశాస్త్రం. ఇటువంటి శాస్త్రంకాని శాస్త్రాలు మొదటి దుశ్శకునాలు. వీటిని ఆచరించి ప్రచారంచేసేవారి గాలిశోకితేనే పెద్దప్రతిబంధకం.

నీవ్యవహారంలో దుశ్శకునంవస్తే పని కలిసిరాదనుకోవటం సర్వత్ర సత్యంకాదు, అది పాపక్షం. పనికావటానికీ కాకపోవటానికీ నీశకునంతో పనిలేదు. కానీ, నీ జ్ఞానాభ్యాసంలో ఈపైనచెప్పిన చెత్తశాస్త్రాలన్నీ నీఅభ్యాసం కొనసాగనీయకుండా సదా అడ్డువస్తూనే ఉంటయ్. అడుగడుగుకూ అడ్డువచ్చి గండుపిల్లిలాగా మ్యావ్ అని అరుస్తుంటయ్. నీ పాతబాటనే జ్ఞాపకంతెచ్చి, నిన్ను వివేకహీనుడిని చేస్తయ్ ఇదిసత్యం. వ్యవహారంలో దుశ్శకునమనుకొనేది వచ్చినా తర్వాత ప్రయత్నంచేస్తే పని జరుగవచ్చునేమోగానీ, ఈ పనికిరాని శాస్త్రాలు కొన్నివేల జన్మలెత్తి సంసారంలో తిరగాడటానికి కారణమవటమే గాక వాటినుండి మళ్ళించుకోవటానికి ప్రయత్నించినా సహించలేక దుశ్శకునాలు గానే నిల్చిపోతయ్, నిల్చిపోతున్నయ్.

**ఇదం జ్ఞానమిదం జ్ఞేయం యస్సర్వం జ్ఞాతుమిచ్ఛతి,**
**అపి వర్షసహస్రాణి శాస్త్రార్థం నాధిగచ్ఛతి.** (ఉ.గీ.3–3)

ఈ చెత్తశాస్త్రాలను పట్టుకొని "ఇదుగో ఈగ్రంథం చూశారూ? జ్ఞానం చెప్తున్నదండీ! దీనివల్ల ఈఫలం వస్తుంది. వినదగునెవ్వరు చెప్పిన, చదువదగునెవ్వరు వ్రాసిన–" అంటూ అన్నీవిని–అన్నీపఠించి కాలం వ్యర్థంచేసుకుంటే, కొన్నివేల సంవత్సరాలు (బ్రతికి)గడిచినా శాస్త్రం చూపించి–చెప్తున్న ఆత్మజ్ఞానం కలుగదు. కనుక ఈ చెత్తశాస్త్రాలను కాలదన్నిపారెయ్.

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,**
**జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే.** (గీ.6–44)

జిజ్ఞాసువు తన పూర్వాభ్యాసపాటవంవల్ల అవశంగా ఆత్మజ్ఞానాభ్యాసంచేత ఆకర్షింపబడతాడు. ఈ చెత్తశాస్త్రాలనుగురించి విన్నా–కన్నా రోతపుట్టుంది. ఇవన్నీ కాలదన్నిపారేసి నిజమైన జిజ్ఞాసువుఅవుతాడు. ఆత్మజ్ఞానమే కావాలంటాడు.

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః** (గీ6–45)

**యత్సారభూతం తదుపాసితవ్యం** (ఉ.గీ.3-1)

**విహాయశాస్త్రజాలాని యత్సత్యం తదుపాస్యతామ్.** (ఉ.గీ.3-4)

తప్పుడుశాస్త్రాలనే వలనువిడిచి, స్వప్రయత్నంచేత సారభూతమైన శాస్త్రాన్ని చేపట్టాడు. సత్యమైన ఆత్మజ్ఞానాన్ని అభ్యాసం చేస్తాడు.

**ఆత్మానమాత్మనా సాక్షాద్బ్రహ్మబుద్ధ్వా సునిశ్చలం,**
**దేహజాత్యాది సంబన్ధాన్ వర్ణాశ్రమసమన్వితాన్.**
**వేదశాస్త్రాణి చాన్యాని పదపాంశుమివ త్యజేత్.**

(బ్రహ్మవిద్యోపనిషత్ 30,31)

శాస్త్రతాత్పర్యం గ్రహిస్తాడు. తన కామమే తనకు బంధమని అనుభవపూర్వకంగా అవగాహన చేసుకుంటాడు. కామములు సుస్థిరనివాసంగావించుకున్న ఇంద్రియాలనూ-మనస్సునూ నిగ్రహించటమనే తపస్సును చేస్తాడు.

శాస్త్రంచెప్పే జ్ఞానవిజ్ఞానాలలోని సూక్ష్మవిషయాలను గ్రహించలేక అందరూ తప్పుడుత్రోవ తొక్కటం చూచి, తన అభ్యాసాన్ని ఎప్పటికప్పుడు సవరించుకుంటాడు. శాస్త్రప్రమాణంతో జ్ఞానవిజ్ఞానాలను గ్రహించి, పురుషప్రయత్నంచేత బ్రహ్మతత్త్వంను పొందుతాడు, ఆత్మస్వరూపుడౌతాడు. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా అనే త్రిపుటిలేని ఆత్మజ్ఞానస్వరూపుడై, శాస్త్రముల ధ్యేయం పొంది, శాస్త్రాలనన్నిటినీ పాదధూళి దులిపినట్లు విడిచిపెట్టాడు.

**ప్రాప్తే జ్ఞానేన విజ్ఞానే జ్ఞేయం చ హృది సంస్థితే,**
**లబ్ధశాన్తిపదే దేహే న యోగో నైవ ధారణా.** (ఉ.గీ.1-17)

సదభ్యాసంచేత జ్ఞానాన్ని అనుభవజ్ఞానం(విజ్ఞానం) గా మార్చుకొని, తనలో ఇదివరకే సుస్థిరంగా ఉన్న ఆత్మజ్ఞానాన్ని పొంది అనుభవిస్తూ పరమశాంతిని పొందినవానికి ఇక మిగిలిన అభ్యాసమేలేదు-ధ్యానంలేదు-యోగంలేదు-ధారణలేదు. **తనను తాను తెలుసుకొని-గ్రహించి తానై నిలిచి, తనకంటె వేరైన సర్వాన్ని వదిలిపెట్టాడు. అన్నిటికీ అతీతుడైనాడు,** అన్నీ పొందబడినవైనవి, ఆత్మస్వరూపుడైనాడు, జ్ఞానస్వరూపుడైనాడు.

**అందుకే ఆత్మ చిత్-జ్ఞానమయం-చిన్మాత్రం.**

అంటే, ఈఆత్మ ఎక్కడోఉండి --- ఏదోచైతన్యంలోనూ - ఏదో ప్రకాశంలోనూ - ఏదోజ్ఞానస్వరూపంగానూ ఉన్నదని కాదు నాయనా! నీలోనే ఉండి, నీ దేహేంద్రియాదులకూ-కామములకూ నీ జగత్తుకూ-జగద్భావానికీ వేరుగాఉండి, శాస్త్రప్రమాణమైన సదభ్యాసంచేత జ్ఞానవిజ్ఞానాలను విచారించి నీచేత పొందబడేది, నీవు పొందవలసినది. ఇలా పొందబడినదే ఆత్మ=నేను=నీనిజస్వరూపం=ఆత్మచైతన్యం=నీనిజచైతన్యం=నీ నిజస్వరూపచైతన్యం=ఆత్మప్రకాశం=నీనిజప్రకాశం=నీనిజస్వరూ

పప్రకాశం=ఆత్మజ్ఞానం=నీనిజజ్ఞానం=నీనిజస్వరూపజ్ఞానం.

**అందుకే ఆత్మ చిత్.**

**స్వామీ! ఆత్మజ్ఞానం పొందాలంటేనూ, ఆత్మజ్ఞానిని కావాలంటేనూ చివరికి శాస్త్రాలన్నీ విడిచి పెట్టాలంటున్నారు గదా! మరి ఇంత ప్రయాసపడి అవి చదవటం దేనికి? చివరికి విడిచిపెట్టడం దేనికి? చదవకుండా ఉంటేనే సరిపోతుంది గదండీ!**

ఇది కేవలం అజ్ఞానం, అంతే కాదు, పొగరు అని తెలుసుకో నాయనా! ఎప్పుడైనా, రెండవతరగతిచదివే కొడుకు తండ్రిదగ్గరకు వచ్చి, "నాన్నా! నీవు M.A. చదివావు గదా! ఇప్పుడేం చదవటం లేదు, పుస్తకాలన్నీ విడిచిపెట్టేశావు గదా! ఒకవేళ నేనుకూడ నీలాగ M.A.దాకా చదివినా పుస్తకాలన్నీ విడిచిపెట్టాల్సిందే గదా! ఆపని ఇప్పుడే చెయ్యటం ఉత్తమం గదా!" అనంటే సరియైన తండ్రి ఏమంటాడు? డొక్కపగలతీసి చితుకపొడిచి చదవమంటాడు కదూ! అలాగే, తత్త్వం ఏమిటో తెలుసుకోకనే తత్త్వజ్ఞులమనుకుంటుంటారు. శాస్త్రప్రమాణం తెలియకనే సర్వం తెలుసుకున్నామనుకుంటారు. అభ్యాసమనేది చెయ్యకనే సర్వంచేశామనుకుంటారు. జగత్తే బ్రహ్మ, బ్రహ్మ జగత్స్వరూపుడంటారు. దేహేంద్రియాదులే ఆత్మ అంటారు, కామప్రవృత్తియే ఆత్మేచ్ఛ అంటారు, కామప్రేరణయే ఆత్మచైతన్యమంటారు, విషయగ్రాహ్యమే ఆత్మప్రకాశమంటారు, విషయజ్ఞానమే ఆత్మజ్ఞానమంటారు, కోరికలకేరింతలే ఆత్మానందమంటారు, విసుగువేసటలు వైరాగ్యమంటారు, జుర్రుపుర్రుమంటూ అన్నీ ఆనందంతో అనుభవిస్తూ సమత్వమంటారు. కానీ,

**యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే.** (గీ7-2)

ఇవన్నీ, వీరి ఈచేష్టలన్నీ ఆత్మకు సంబంధించినవి కావు, ముమ్మాటికీ కావు. ఏఒక్కటితెలుసుకుంటే ఇంకొకటి తెలుసుకోవలసినది మిగిలిఉండదో, ఏఒక్కటి తెలుసుకోవటమే అభ్యాసమనీ జ్ఞానమనీ-జ్ఞేయమనీ శాస్త్రాలన్నీ చెప్తున్నవో అదే ఆత్మ--- వీరి ఈ చేష్టలకు వేరైనది.

**జ్ఞేయం యత్తత్ ప్రవక్ష్యామి, యత్జ్ఞాత్వా ఽమృతమశ్నుతే.** (గీ13-13)

ఏది తెలుసుకుంటే అమృతత్వం పొందుతారో అదే జ్ఞేయం=ఆత్మ, సంసారంలో పడేసేది జ్ఞేయంకాదనీ=ఆత్మకాదనీ, తెలుసుకోవలసినది ఒక్కటంటే ఒక్కటే అయిన ఆత్మతత్త్వమేననీ, దానిని శాస్త్రప్రమాణంతో తెలుసుకొని, నిరంతర అభ్యాసంచేత పొందాలనీ చెప్తున్న భగవద్గీత వాక్యాలనూ-శాస్త్రవాక్యాలనూ, ఈ కామమదాంధులు-అజ్ఞానమదాంధులు వినటానికి శ్రద్ధలేక తప్పించుకొని మోహజాలంలో చిక్కుకోటానికీ, కోరికలనే కొరివిని నెత్తిన ఎక్కించుకోటానికీ ఇలాంటి పాడుకూతలు కూస్తుంటారు.

శాస్త్రప్రమాణం-అభ్యాసక్రమం-నియమాదులు-గమ్యం పరోక్ష అపరోక్షఅనుభవాల వివేకమూ గ్రహించలేక ఇలా అంటుంటారు.

**అభ్యాసయోగ-యుక్తేన, చేతసా నాన్యగామినా,**
**పరమం పురుషం దివ్యం యాతి, పార్థానుచిన్తయన్.** (గీ8-8)

**అభ్యాసయోగేన తతః, మామిచ్ఛాప్తుం ధనఞ్జయ.** (గీ12-9)

**అభ్యాసేన తు కౌన్తేయ, వైరాగ్యేణ చ గృహ్యతే.** (గీ6-35)

నీ అభ్యాసం, పురుషప్రయత్నంకంటె మోక్షానికి వేరేమార్గం లేదంటున్న భగవంతుని మాటలు వీరిచెవులకెక్కవు. అందుకే,

**మనుష్యాణాం సహస్రేషు, కశ్చిద్యతతి సిద్ధయే,**
**యతతామపి సిద్ధానామ్, కశ్చిన్మాం వేత్తి తత్త్వతః.** (గీ7-3)

కొన్ని కోట్లమనుష్యులలో ఏఒక్కడో అభ్యాసంచేస్తాడు. అలా అభ్యాసం చేసేవారిలో ఎక్కడోఒకడు నిజంగా అభ్యాసంచేసి, మధ్యలో జారిపోకుండా నాతత్త్వం తెలుసుకుంటాడు. అడుగడుగునా వారికామం-జగద్భావం అడ్డు వస్తూంటే, వాటిని సంపూర్ణంగా జయించి నాతత్త్వం తెలుసుకోవటం అంత అరుదు అనంటున్నాడు భగవంతుడు.

అయితే ఎవరు ఎలా చెప్పాలి వీరికి? తత్త్వజ్ఞులు, జ్ఞానులు తమ అనుభవాలతోనూ, అభ్యాసంలోని సాధకబాధకాలతోనూ, జ్ఞానవిజ్ఞానాలను అనాదికాలంనుండి చెప్తూనే ఉన్నారు, వినేవారు తమ కామబుద్ధితోనే వింటున్నారు. దొంగసాకులు చెప్తూనే ఉన్నారు. కుతర్కాలు చేస్తూనే ఉన్నారు, అయినా జ్ఞానులు చెప్పిచెప్పి, బాగుపడలేని వీరిని వీరిగోలకు విడిచి, తమ అనుభవాలకు వెళ్ళిపోతున్నారు. అయినా తమలోనే ప్రతిష్ఠ అయిఉన్న ఆత్మ ఎడతెగకుండా, సర్వకాలాలలో చెప్తూనే ఉన్నది.

నా అంతరాత్మ ఒప్పుకోవటం లేదండీ! నా లోపల నాకు ఎందుకో వద్దనిపిస్తున్నది.

ఎందుకో నాకిష్టం లేదు. MY SIXTH SENSE

అని అంటూ, ఆత్మబోధను అనుభవిస్తూ జ్ఞాపకంచేసుకుంటున్నప్పటికీ గుర్తించలేక తమకామములలోకే దూకుతుంటారు. దేహేంద్రియమనోబుద్ధులే ఆత్మ=నేను అనుకొని వాటిభాషయే వింటుంటారు. వాటికామప్రవృత్తినే గుర్తిస్తారుగానీ, **వాటికి లోపలఉన్న ఆత్మ-అంతరాత్మ** INNER I = నిజమైనఆత్మయొక్క బోధను గుర్తించరు. దేహేంద్రియమనోబుద్ధుల **అశుద్ధపుఅనుభూతినే** IMPURE CONSCIENCEనే గుర్తిస్తారు. అంతరాత్మ యొక్క శుద్ధిఅనుభూతినిPURE CONSCIENCEను గుర్తించరు. ఆత్మబోధను తప్పించుకొని తిరుగుతారు. ఎవరు ఎంత తప్పించుకున్నా ఆత్మ, తన కేవలఉనికిమాత్రంచేతనూ, కేవల తన చిన్మయస్వభావంచేతనూ,

తనఉనికినీ-తనజ్ఞానాన్నీ సదా అనుభవింపచేస్తున్నది. జగత్తుయొక్క సుఖదుఃఖాదిద్వంద్వాలలో చిక్కుకుంటే వాటి నిష్ఫలతనూ అనుభవింపచేసి, వాటిని నిగ్రహించమని, చెప్పక చెప్తున్నది. చెప్పటంలో ఆత్మ (తనకు) కర్తృత్వభోక్తృత్వాలు లేకుండానే చెప్తున్నది. జగత్తుయొక్క నికృష్టతనూ, ఆత్మభావంయొక్క ఉత్కృష్టతనూ అనుభవపూర్వకంగా తెలియచేస్తున్నది. ఎంతగాచెప్పినా, ఎన్నివిధాల-ఎన్నిఅనుభవాలతో తెలియచేసినా, కుక్కతోక వంకరలాగా, కామముల సందుల్లోకే దూరుతున్నారు. సందుల్లోదూరినా-గొందుల్లోగోకినా సదా సర్వత్ర తనఉనికినీ-తనజ్ఞానాన్నీ-జగద్భావపునీఛత్వాన్నీ కేవలచిన్మాత్రస్వభావంచేతనే, వారివారి అనుభవాలద్వారా తెలియచేస్తున్నది.

**అందుకే ఆత్మ చిత్ - చిన్మాత్రం - జ్ఞానమయం**

**బ్రహ్మైవాహం, ఇదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం, సర్వం చ ఏతత్, అవిద్యయా త్రిగుణయా అశేషం మయా కల్పితమ్.**

(మనీషాపంచకం)

నేను బ్రహ్మమునే -- చిన్మాత్ర ఆత్మనే. ఈ జగత్తంతా వాస్తవానికి చిన్మాత్ర ఆత్మయే, జగత్తూ-నామరూపాలూ-ద్వంద్వాలూ-మొదలైనవన్నీ అబద్ధం-కల్పితం-వాస్తవమైనది చిన్మాత్ర ఆత్మయే--- ఇది ఇప్పుడు గ్రహించిన నిజం, పొందిన నిజమైన అనుభవం. ఇంతవరకుచూచిన ఈసర్వం= జగత్తూ-నామరూపాలూ-ద్వంద్వాలూ- అన్నీ వాస్తవంలో లేనివే---- లేనివే అయినా అజ్ఞానంలో, అవిద్యచేత వివేకంకోల్పోయి, త్రిగుణభావంచేత--- ఇంకా ఏదోకావాలి, ఉన్న ఆత్మానుభవం చాలక ఇంకా ఏదోకావాలి, దేనినో ఊహించుకొని, ఊహించుకొన్న దానిని కల్పించుకొని, కల్పించుకున్న దానికోసం ప్రయత్నించి, ప్రయత్నించిన దానిలో ప్రతిఫలాన్నపేక్షించి, అపేక్షించిన ఫలాన్ని అనుభవించి, ఈవిధంగా, ఇంకా కావలసినదేదో సరిగ్గా తెలియక, తెలిసినది కూడా సరిగ్గా ఊహించుకోలేక, ఊహించుకొన్నదికూడ సరిగ్గా కల్పించుకోలేక, కల్పించుకున్నదానికోసంకూడా సరిగ్గా ప్రయత్నించలేక, ప్రయత్నించేదానిలో ప్రతిఫలాలను పొందటం-పొందలేకపోవటం వీటి నిజానిజాలు గ్రహించలేక, ప్రతిఫలాన్ని అపేక్షించి, అపేక్షించిన ఫలాన్ని సరిగ్గా పొందలేక, పొందినఫలాన్ని కూడా సరిగ్గా అనుభవించలేక, అయినా-అనుభవించలేకపోయినా మళ్ళీమళ్ళీ ---- ఇంకా ఏదోకావాలి అనే గుణభావం-త్రిగుణభావంచేత, అన్నీ నేను కల్పించుకున్నవే- వీటినికల్పించిన వారెవరూ వేరుగాలేరు. కల్పించిన నేనుకూడ ఇప్పుడు లేను. నేను బ్రహ్మమునే - చిన్మాత్ర ఆత్మనే ---- అని అనుభవం కలిగేవరకూ ఆత్మబోధ జరుగుతూనే ఉంటుంది. ఆత్మ యొక్క కేవలఉనికిమాత్రంచేతనూ, చిన్మాత్రస్వభావంచేతనూ ఆత్మబోధ జరుగుతూనే ఉంటుంది.

**అందుకే ఆత్మ చిత్--చిన్మాత్రం--జ్ఞానమయం.**

# శ్రుతులు ఎలా చెప్తున్నవో శాస్త్రాల ధోరణి ఏమిటో

**అతీతః పన్థానం తవ చ మహిమా వాఙ్మనసయోః,**
**అతద్వ్యావృత్త్యా యం చకితమభిదత్తే శ్రుతిరపి.** (మహిమ్నస్తోత్రం-2)

ఎంతగా విచారించినా, ఇలా, దేహేంద్రియాది జగత్తుకూ, నామరూపాదులతో కనబడేజగత్తుకూ, నామరూపాదులతో కనబడని సుఖదుఃఖాది జగత్తుకూ, విలక్షణం=వేరు అని విచారించగలుగుతున్నామేగానీ ఆత్మయొక్క చిత్ స్వరూపం=చిత్ స్వభావం ఇదమిత్థమని చెప్పలేకపోతున్నాం. మనోవాక్కాయములచేత పట్టలేరంటున్నయ్ శ్రుతులు. మనోవాక్కాయములచేత పట్టలేని ఆత్మతత్త్వాన్ని ఎలాచెప్పాలోనని చాల భయపడినయ్ శ్రుతులు.

**అయితే! మనకున్నవి మనస్సు-వాక్కు-కాయం అనే త్రికరణములే గదా! వాటితో పట్టలేకపోతే, ఇంతప్రయాస ఎందుకు? అందనిదానికి అఱ్ఱులుచాచేకంటే అందిన ఐశ్వర్యభోగాలను అనుభవించవచ్చు గదా!!**

ఇలాఅనుకోవటం ఇంకొక అవాంతరం నాయనా! ఐశ్వర్యభోగాలనే కోరుతున్నవారికి త్రికరణములకందని ఆత్మతత్త్వాన్ని ఎలా చెప్పాలోనని చాల భయపడినయ్ శ్రుతులూ-శాస్త్రాలూ. నాయనా!

మనకున్నవి త్రికరణములు=మూడుపనిముట్లు--- కాయం(శరీరం)-వాక్కు(ఇంద్రియాలు)-మనస్సు (అంతఃకరణం). వీటిచేత పట్టుకోలేకపోయినప్పటికీ, వీటిచేతనే పట్టుకోవాలి వేరేమార్గం లేదు. ఎట్లాగంటే విను నాయనా!

1 శరీరాన్ని సత్సాంగత్యంలో కూర్చోపెట్టు. కుదురుగా గోలచెయ్యకుండ కూర్చోపెట్టు. సత్సాంగత్యం ఆరోజుకు అయినదనేవరకు నిన్ను బాధించకుండ కూర్చోపెట్టు. సదభ్యాసానికి ఉపకరించేటట్లు శరీరాన్ని వశంచేసుకో. శరీరాన్ని వీధిఅరుగులమీద-రోడ్డువంతెనలమీద- సినిమాహాళ్ళలోనూ-క్లబ్ ల లోనూ-ఇటువంటి పనికిరానిచోట్ల అపవిత్రం చెయ్యకు.

2 వాక్కుతో సత్సాంగత్యంలో భగవన్నామం ఉచ్చరించు. భగవతత్త్వం=ఆత్మతత్త్వం చెప్పే భగవద్గీతాశ్లోకాలను ఉచ్చరించు, కంఠస్థం చెయ్యి. శ్రవణేంద్రియంతో తత్త్వవిచారణా ప్రవచనములను శ్రవణంచెయ్యి. ఇంద్రియములపాటవాన్ని ఇంద్రియార్థములమీద వెచ్చించి వృథాచెయ్యక వాటిని నిగ్రహించు, నిగ్రహశక్తిని సంపాదించు.

3 మనస్సుతో భోగైశ్వర్యాలనుపొందే ఉపాయాలను ఆలోచిస్తూ మనస్సుకు

మాలిన్యం అంటించకు. జగత్తుమీదకు పోనీయకు.

ఈ మనస్సు ఒక్కసారి ఒకవిషయం గురించి ఆలోచించిందంటే, ఆవిషయానికి తనలో ఒకశాశ్వతమైన చోటునిస్తుంది. ఆవిషయంగురించి ఒక ద్వంద్వభావాన్ని (సుఖమనిగానీ-దుఃఖమనిగానీ--మంచిదనిగానీ-చెడ్డదనిగాని--బాగాఉన్నదనిగానీ-బాగాలేదనిగానీ) కల్పించి-నిశ్చయించి మరీ చోటునిస్తుంది. ఇలా ఎన్ని ఊహించినా అన్నిటికీ చోటునిస్తుంది. కోట్లసంఖ్యలో-అనంతమైనసంఖ్యలో గూళ్ళున్నయ్ మనస్సులో. వీటినన్నిటినీ దాచిఉంచటానికి ఫలానా 94,96,90,109వ గూటిలో దాచిఉంచబడిన విషయం, దానికి సంబంధించినవేవైనా (ఏ PARAMETERఅయినా) భౌతికంగాగానీ-పరులవాక్కులచేతగానీ-తనఊహచేతగానీ ఎలా తటస్థపడినా, ఆవిషయం యథాతథంగా జ్ఞాపకంవస్తుంది, వెంటనే జ్ఞాపకంవస్తుంది. ఒకటి-రెండు-మూడు ఇలా గూళ్ళు లెక్కపెట్టుకుంటూ వెనుకఉన్న 94,96,90,108 గూళ్ళు అన్నీ వెతికిన తర్వాత 94,96,90,109వ గూటినుండి ఆవిషయం బయటపడదు. కొన్నివేల పదాలున్న నిఘంటువు DICTIONARY నుండి కావలసినపదాన్ని చూచినదానికంటె త్వరగా-తక్షణమే బయటపడుతుంది.

ఇంతటి అవకాశంఉండి చురుకైన మనస్సును జగత్తులో ముంచి, మనస్సులోని అవకాశాన్నంతా జగత్తుయొక్క మాలిన్యంతోనూ-విషయవాసనలతోనూ ముంచితే అవే జ్ఞాపకంతెచ్చుకొని చంచలమై వ్యభిచరిస్తూంటుంది. ఈ గూళ్ళన్నిటినుండి విషయవాసనలను ఖాళీచేసి తత్త్వవిచారణను నింపి, వైరాగ్యం అలవాటుచేస్తే, విషయవాసనలను విడిచిపెట్తుంది, శుద్ధమవుతుంది.

త్రికరణశుద్ధిగా అన్న మాటను విన్నావు గదూ! జగన్మయములైన ఈ త్రికరణములు ఇలా అశుద్ధమై కామపూరితములై పోయినయ్. ఇప్పుడు నీప్రయత్నంచేత వీటిని శుద్ధంచేసుకోవాలి నాయనా! విషయవాసనలనూ-కోరికలనూ విడిచి శుద్ధమైతే ఈ త్రికరణములు ఆత్మతత్త్వాన్ని అనుభవించటానికి ఉపకరిస్తయ్. కనుక, త్రికరణములశక్తిని జగత్తునుండి మళ్ళించి, శాస్త్రసమ్మతమైన విచారణచేత జగద్భావంను తుడిచేసుకొని నిగ్రహశక్తిని పెంపొందించుకోవాలి. అంటే, ఆత్మతత్త్వానుభవానికి అడ్డువచ్చే జగత్తునూ-విషయాలనూ-కోరికలనూ త్రికరణములచేత నాశనంచెయ్యాలి. ఇలాచేస్తే ఆత్మతత్త్వమూ-ఆత్మయొక్క చిత్స్వభావమూ అవగతమవుతుంది. ఈవిధంగా త్రికరణములచేతనే ఆత్మతత్త్వ అనుభవం కలుగుతుంది. అశుద్ధమైన కామపూరితమైన త్రికరణములచేత శుద్ధమైన ఆత్మతత్త్వం అనుభవం కలుగదు. కనుక, మనోవాక్కాయములచేత పట్టరానిదంటే--- ఇంక వేరే ఉపాయం కానరాదు కనుక, వేరే పరికరం లేదుకనుక ఐశ్వర్యభోగాలు భోగించమని శాస్త్రతాత్పర్యంకాదు--- కామపూరితమైన

మనోవాక్కాయములచేత పట్టుబడేది కాదని అర్థంసాయనా! అందుకే శ్రుతులన్నీ ఆత్మతత్త్వాన్ని అతద్వ్యావృత్తిచేతనే చెప్తున్నయ్--- ఆత్మకాని పదార్థములన్నిటినీ తప్పించి చెప్తున్నయ్. ఆత్మకాని పదార్థాలను తప్పిస్తే ఫరవాలేదు కానీ, అన్నీ తప్పిస్తే అసలు ఆత్మ అయిన పదార్థాలు ఉన్నవా? ఏవి ఎలా ఉన్నయ్? ఇదుగో ఇందుకే, ఇలాంటి ప్రశ్నలు వేస్తారనే శ్రుతులన్నీ చకితమభిదత్తే చాలభయపడుతూ చెప్తున్నయ్.

అదేమి స్వామీ! ఎందుకు భయపడాలి?

అదే నాయనా! ఎన్నిచెప్పినా-ఎంతగాచెప్పినా-ఎన్నివిధాల వివరించినా, కామమయులైన ఈ మనుష్యులు చెప్పినమాటలనన్నిటినీ విని తమకామ బుద్ధితోనే చూస్తున్నారు-చూస్తుంటారు-ఆలోచిస్తుంటారు. ఒక్కమాటలో చెప్పినా, వెయ్యిమాటలలో చెప్పినా, లక్ష-కోటి- అనంతమైనమాటలలో ఎలాచెప్పినా వారిబుద్ధి మారదు. వారి కామం పోదు.

చెప్పినది సరిగ్గా వినరు
విన్నది తప్పుగా అర్థం చేసుకుంటారు
శ్రుతులే ఇలా చెప్పినయ్ అంటారు
తాము అర్థంచేసుకున్నట్లు చెప్పినయ్ అంటారు

ఎలాగో-ఎందుకో? వీరి రెటమతమేమో? శాస్త్రధోరణి ఏమో?

శాస్త్రం భయపడుతూ ఎలా చెప్తున్నదో చూడు నాయనా!

I 1. ఏకం, ఏకమేవ, అద్వయం బ్రహ్మ, నేహ నానాఽస్తి కిఞ్చన

బ్రహ్మ=ఆత్మ ఏకం ఒకటిగా ఉన్నది.

సరే స్వామీ! బ్రహ్మ ఒకటిగా ఉండవచ్చు.
ఇతరములైన జగత్పదార్థాలు కూడా ఉండవచ్చు గదా!

2 కాదు నాయనా! ఏకమేవ బ్రహ్మ ఒక్కటేఉన్నది, ఒంటరిగాఉన్నది.

అదేస్వామీ! బ్రహ్మ ఒక్కటే ఒంటరిగా ఉండి, రెండవ బ్రహ్మ లేకపోవచ్చుగానీ మా జగత్తు ఉండవచ్చుగదా!

3 అలాకాదు నాయనా! అద్వయం రెండవదిలేదు. బ్రహ్మ=ఆత్మకంటె రెండవపదార్థం (వేరేది) లేకుండా ఆత్మమాత్రమే ఉన్నది.

చూడండీ! మాఊర్లో గ్రామపెద్ద ఉన్నాడు. అయనకంటే పెద్ద ఇంకెవరూ లేకపోవచ్చు గానీండి, అంతమాత్రంచేత అయనకంటె చిన్న వారుకూడాలేకుండా ఎలాపోతారు? చిన్నవారు ఉంటారు. ఉన్నారుకదా!

4 అందుకే, అలా అనుకుంటావ(ర)నే మరీమరీ చెప్పేది. నేహ నానా ఒస్తి కించన ఎక్కువతక్కువలూ- మంచీచెడులూ - మొదలైన ద్వంద్వాలూ-భిన్నత్వమూ ఇక్కడ లేనేలేవు--- ఇక్కడ నానాత్వం కొంచెం కూడా లేదు. ఆత్మకంటే వేరుగా జగత్తనే పదార్థమూ లేదు, జగత్తులో నానాత్వమూ లేదు (మీ ఊరిపెద్దలాగా కాదు ఆత్మ) ఇలా చెప్తున్నయ్ శ్రుతులు. ప్రతిపదానికి మధ్యలో కామమయులైన వీరిశంకలను చాలగ్రహించి సమాధానం పొందుపరచి చాలజాగ్రత్తగ చెప్తున్నయ్ శ్రుతులు. ఎవరైనా తప్పుగా అర్థం చేసుకుంటారేమోనని భయపడుతూనే చెప్తున్నయ్.

# అయినా అర్థంకావటం లేదు

అన్నారు, అంటున్నారు సాధారణంగా అందరూ, ఇంకా చెప్పమన్నారు. ఇంకా చెప్పటానికి వేరేమీలేదు--- ఈచెప్పిన నాలుగుమాటలూ సంపూర్ణమైనవి అన్నయ్ శ్రుతులు. నీవు(అందరూ) తెలుసుకోవలసినదీ (జ్ఞేయం), పొందవలసినదీ(గమ్యం) అయిన బ్రహ్మ=ఆత్మ అనుభవైక వేద్యం తెలుసుకొని-అనుభవించి-పొందాలి, చెప్పగలిగినదీకాదు-చూపగలిగిన దీకాదు, ఇంకోదానితో పోల్చగలిగినదీ కాదు.

అయితే ఎవరు-ఎక్కడ-ఎప్పుడు-ఎలా అనుభవించాలి?

స్వానుభవైక వేద్యం

నీవే అనుభవించాలి — నీలోనే అనుభవించాలి

సదా అనుభవించాలి — నీవు నిన్ను నీలోనే నిన్నే అనుభవించాలి

నీ గమ్యం అని చెప్పబడే బ్రహ్మయే ఆత్మ. ఆత్మ శబ్దానికి అర్థం నేను. నేను నేను నేను నేను అనే నిజమైన అనుభవమే ఆత్మ=బ్రహ్మ. కనుక, నీవు నిన్ను నీలోనే నిన్నే అనుభవించాలి. ఈ అనుభవాన్ని పురస్కరించుకొని ఎవరు -ఎక్కడ-ఎప్పుడు-ఎవరిని(దేనిని) అనే ప్రశ్నలకన్నిటికీ నీవే (నేను శబ్దార్థమే) సమాధానం. నిన్ను నీకంటెవేరైన దేహేంద్రియాదులలో చూడటమూ-గుర్తించుకోవటమూ, నిన్ను నీకంటెవేరైన బాహ్యజగత్పదార్థాలలో చూడటమూ, సదా దేహేంద్రియాదులనూ-బాహ్యపదార్థాలనూ అనుభవించటమూ నీ నిజమైన అనుభవం కాదు. నీకంటె వేరైనవేవీ లేక

అనుభవించేవాడవు నీవు —అనుభవింపబడునదీ —అనుభవమనే క్రియ--- ఈ త్రిపుటి(మూడు)కూడా వేరువేరుగా గుర్తింపబడక, ఎక్కడ ఇదంతా నానాత్వమని ఎంచబడుతున్నదో, ఎక్కడ ఈనానాత్వం సమగ్రంగా సమసిపోతుందో, అదే, నీవు నిన్ను నీలోనే నిన్నే

అనుభవించే నిజమైన అనుభవం=ఆత్మానుభవం=స్వానుభవం. ఇదే బ్రహ్మానుభవం=బ్రహ్మప్రాప్తి=కైవల్యం.

బ్రహ్మ పరంబ్రహ్మ పరమాత్మ పరంధామ పరిపూర్ణ
శివ అచ్యుత జనార్దన వాసుదేవ
నిర్గుణ, నిర్వికార, నిరాకార, నిరంజన, నిరీహ, నిరవద్య
సద్ఘన చిద్ఘన ఆనన్దఘన
అప్రమేయ అవాఙ్మానసగోచర అనిరూప్యస్వరూప
వేదవేద్య వేదాన్తకృత్ వేదవిత్ వేత్తా వేద్యం

మొదలైన అనేకశబ్దములలో చెప్పబడిన తత్త్వమూ-తత్త్వానుభవమూ-సర్వమూ ఈ నీ నిజమైనఅనుభవమే-ఆత్మానుభవమే, కామమయమైన నీ(సర్వుల) (ప్రస్తుత)పరిస్థితిలో నీకొక నిజస్వరూపం ఉన్నదనీ, నిజమైన అనుభవం ఉన్నదనీ, అదే బ్రహ్మమనీ చెప్తే అర్థమయ్యేవిధంగా నీవులేవు కనుకనూ, చెప్పినప్పటికీ కుతర్కంచేసేటట్లున్నావు కనుకనూ,

నీనిజస్వరూపం=నీనిజఅనుభవాన్నే నీవు తెలుసుకొని అభ్యసించటానికి నీకంటె వేరుగా బ్రహ్మ-పరంబ్రహ్మ-ఇత్యాది శబ్దములతో చెప్తున్నయ్ శ్రుతులు. కానీ, నీకు (సాధారణంగా అందరికీ) అర్థంకాకపోయినంతమా త్రంచేత బ్రహ్మ నీకంటెవేరేనని చెప్పటమూ, నీ నిజానుభవాన్ని నీకు తెలియచెప్పకుండా ఉండటమూ శ్రుతిమతం కాదు. ఇదే శ్రుతిమతం అయితే నిజమైన ముముక్షువులు-జిజ్ఞాసువులు తరించే అవకాశమే లేకుండాపోతుంది. కనుక, నిజమైన జిజ్ఞాసువులకు శంకలురాకుండా, మూర్ఖులు కుతర్కంచేసినా ఎక్కడికక్కడ సరియైన సమాధానం చెప్తూ శ్రుతులు చాలాజాగ్రత్తగా తత్త్వం చెప్తున్నయ్ నాయనా! అందుకే గమ్యంనుగురించి శంకలురాకుండ చెప్తున్నది.

**యత్ర చైవాఽత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి** (గీ6-20)

ఎక్కడ, నీవు నిన్ను నీలోనే నిన్నే అనుభవించి పరిపూర్ణుడవవుతావో అదే ఆత్మానుభవం = నీనిజమైనఅనుభవం. ఈ అనుభవంలో నీ నిజస్వరూపంకంటె వేరైన దేహేంద్రియాదులూ-బాహ్యజగత్తూ-ద్వంద్వాలూ- నానాత్వమేమీ లేదు, కొంచెంకూడా లేదు. ఇదే కైవల్యం=కేవలఉనికి=కేవలఅనుభవం---- ఇక్కడ రెండవఉనికి లేదు, రెండవఅనుభవం లేదు, రెండవపదార్థమే లేదు, కనుక నానాత్వం అసలే లేదు.

## ఏదీ లేకుండా ఎట్లా ఉంటారు స్వామీ!

చూడు నాయనా! గాఢనిద్రలో ఎలా ఉన్నావు? నీకు జగత్తులేదు, దేహేంద్రియాదులు లేవు (దేహేంద్రియాదుల ధ్యాసలేదు), దేహంమీద

పాము ప్రాకుతున్నా తెలియదు, పాము కరవబోతున్నా తెలియదు, ప్రక్కన పడుకున్నవారి ధ్యాసలేదు, భార్యా-భర్త-పిల్లలు-సంసారం లేదు, ఇల్లు-ఆఫీసు-ఆస్తి లేవు. జాగ్రత్తులో ఏవేవి చూచి నీవి అని అనుకుంటున్నావో అవేవీ లేవు. వాటి ధ్యాసలేదు. కానీ నీవు ఉన్నావా? ఉన్నావంటావు కదూ! నిద్రసమయంలో లేకుండా పోయ్యానని ఇంతవరకెవ్వరూ చెప్పలేదు కదూ! ఎలా ఉన్నావు? నేను ఉన్నానని అనుకోకుండా, నిన్ను నీవు గుర్తించుకోకుండా (అంటే ఇంతమాత్రంభేదంకూడా లేకుండా) నీవున్నావు కదూ! కేవలం నీవేఉన్నావు కదూ! ఇది నీకు(సర్వులకూ) తెలిసిందేకదూ!

# అయినా అర్థంకావటం లేదు

అన్నారు, అంటున్నారు సాధారణంగా అందరూ. ఇలా శాఖాచంద్ర న్యాయంగా గాఢనిద్రావస్థతో పోల్చిచెప్పి, నిద్రలోవలె తమోగుణప్రవృత్తిలో కాక, చిత్ స్వభావంలో కేవలమై నీవు ఉండటమే నీ నిజఅనుభవమనీ, ఇదే కైవల్యమనీ, సంపూర్ణమైన మోక్షమనీ శాస్త్రం చెప్తుంటే

# అయినా అర్థంకావటం లేదు

అన్నారు, అంటున్నారు సాధారణంగా అందరూ. అందుకే, కైవల్య స్వరూపమైన నీ నిజఅనుభవాన్ని, నీకంటె వేరుగా చూపటానికి ప్రయత్నించినయ్ శ్రుతులు-శాస్త్రాలు. నీ నిజఅనుభవానికే బ్రహ్మ అనే శబ్దాన్ని ఉపయోగించి ఏకం (బ్రహ్మ) అని చెప్పినయ్, భయపడుతూనే చెప్పినయ్, చాల జాగ్రత్తగా చెప్పినయ్, మాట నోరుజారితే విషయం కోటలుదాటుతుందన్నట్లు

**ఎవరైనా-ఎప్పుడైనా తప్పుగా అర్థంచేసుకుంటారేమోనని**<br>**భయపడుతూ చాల జాగ్రత్తగానే చెప్పినయ్.**<br>**ఎలా ఏవిధంగానూ వర్ణించి చెప్పటానికి వీలులేని**<br>**నీ నిజఅనుభవాన్ని చెప్పటానికి సాహసించినయ్**

చెప్పటం కష్టమని తెలిసినా, ఎంతచెప్పినా తప్పుగాఅర్థంచేసుకుని కుతర్కవాదాలు చేస్తారని తెలిసినా, చెప్పకపోతే నీబోటి ముముక్షువులు, నిజమైనజిజ్ఞాసకలవారు చెడిపోతారని, చెప్పటానికి సాహసించినయ్. అందుకే చకితమభిదత్తే భయపడుతూనే చెప్పినయ్, చాల జాగ్రత్తగానే చెప్పినయ్. ఒక్కొక్కమాటను చెప్తూ, చెప్పినమాటకు ఎటువంటి తప్పుడుఅర్థాలు ఊహించి కుతర్కవాదంలోకి దిగుతారో ఊహించి, తరువాతమాటలోనే

సమాధానం చెప్పినయ్. ఇంకా తప్పుగా అర్థంచేసుకుంటారేమోనని శంకించి ఇంకొకమాట చెప్పినయ్. కొన్ని మాటలు-వాక్యాలు ఇలా చెప్పుకుంటూనే పోయినయ్. అందుకే, నీ (సర్వుల) నిజఅనుభవమైన కైవల్యంగురించి ఏకం అని చెప్పినయ్. నిజమైన జిజ్ఞాసువుకు అర్థమౌతున్నది. కానీ అందరూ ఇలా లేరుకదా. వారి కుతర్కాలను ఊహించి (ఇంతకు ముందు 68,69 పేజీలలో చెప్పినట్లు)

**ఏకం ఏకమేవ అద్వయం బ్రహ్మ నేహ నానాऽస్తి కిఞ్చన**

అని ఇన్ని మాటలు చెప్పినయ్. ఏం లాభం?

# అయినా అర్థంకావటం లేదు

అన్నారు- అంటున్నారు. ఈ మూర్ఖులు అర్థచేసుకోకపోయినా, నిజమైన జిజ్ఞాసువులు ఆనందిస్తున్నారు. ఇంకా, ఏమూలనైనా ఏవైనా శంకలు ఏరూపంలోగానీ కనబడకుండా- తెలియబడకుండా ఉండి, ఎప్పుడైనా పైకిలేచి బాధించకుండా, మళ్ళీ మననంచేసి ఆనందిస్తున్నారు. అందుకే, వారికి ఇంక శంకరాకుండా ఇంక చెప్పటానికి వేరేమీలేదు--- ఈచెప్పిన నాలుగుమాటలూ సంపూర్ణమైనవి అన్నయ్ శ్రుతులు.

**శంకలు తీరిపోయినయ్ జిజ్ఞాసువులకు**

# అయినా అర్థంకావటం లేదు

**అన్నారు, అంటున్నారు సాధారణంగా అందరూ.**

**మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి.** (కఠఉ.2-1-10)
**మృత్యోస్స మృత్యుంగచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి.** (కఠఉ.2-1-11)

ఇక్కడ నానాత్వంగానీ-భిన్నత్వంగానీ ఉన్నదన్నవారు, అలా అన్నమాత్రం చేతనే-అనుకున్నంతమాత్రంచేతనే- చూచినంతమాత్రంచేతనే మళ్ళీమళ్ళీ చచ్చి సంసారంలోతిరుగాడుతారు-నాశనమైపోతారు. వారిగతి అధోగతి అన్నయ్ శ్రుతులు.

# అయినా అర్థంకావటం లేదు

అన్నారు. నానాత్వం కనిపిస్తుంటే లేకపోవటమేమిటి? జగత్తు ప్రత్యక్షంగా కనిపిస్తుంటే లేదంటారేమిటి? ఇదేమీ అర్థంకావటంలేదు. మాకు కనిపిస్తున్న ఈ జగత్తుకు కారణం ఎవరు? చెప్తే దీన్నిగురించే

చెప్పమన్నారు, వారి దృష్టితోనే అడిగారు.

**నాసతో విద్యతే భావః, నాభావో విద్యతే సతః** (గీ2–16)

నీ(సర్వుల) నిజఅనుభవంతో పోల్చుకొనే సమాధానం చెప్తున్నయ్ శాస్త్రాలన్నీ. అందరిదృష్టిలో, అసతః విద్యతే భావః, అభావః విద్యతే సతః – అసత్ అయిన జగత్పదార్థములే ఉన్నట్లుగానూ, సత్ అయిన ఆత్మానుభవం=బ్రహ్మ లేనట్లుగానూ ఊహింపబడుతున్నది. ఎన్ని పూజలూ–పునస్కారాలూ అనబడేవి చేసినా ఇంతే, నాసిక్కులై పోయినారు. ఇది సుతరాం తప్పు,

**నాసతో విద్యతే భావః, నాభావో విద్యతే సతః** (గీ2–16)

అసత్ అయిన జగత్పదార్థాలకు ఉనికి ఎప్పుడూ లేదు. వాటినిగురించిగానీ, వాటికార్యకారణములగురించిగానీ విచారించవలసిన పనిలేదు. సత్ అయిన ఆత్మానుభవం=బ్రహ్మ= కైవల్యం =నీ(సర్వుల) నిజఅనుభవానికి ఉనికిలేకపోవటం అనేదే లేదు ––– ఎప్పుడూ ఉన్నది. ఇలా తెలుసుకున్నవారే ఆస్తికులు. జగత్తును ఏకించిత్ ఊహించినా వారందరూ నాస్తికులే అంటున్నయ్ శాస్త్రాలన్నీ.

**ఉభయోరపి దృష్టో உన్తస్తు, అనయోస్తత్త్వదర్శిభిః.** (గీ2–16)

తత్త్వం=నిజం=నిజానుభవం తెలుసుకున్నవాళ్ళు సత్–అసత్ అని చెప్పబడిన ఈరెండుపదార్థములలో, గమ్యమే చూస్తున్నారు అసత్ అయిన జగత్పదార్థాలు లేనేలేవనీ, సత్ అనే పదంచేత చెప్పబడే ఆత్మానుభవం=నిజ అనుభవమే సత్యమనీ గ్రహిస్తున్నారు.

ఇది తత్త్వదృష్టి అన్నయ్‌శాస్త్రాలు.

# అయినా అర్థంకావటం లేదు

అన్నారు–అంటున్నారు. జగత్తే లేదన్నారు గదా! జగత్తు–అసత్–సర్వులు–మొదలైన మాటలూ– ఈవిచారణ ఏమిటి? ఇది జగత్తే కదా! జగత్తే లేకపోతే ఇదంతా ఎలా చెప్పారు? శాస్త్రాలు ఎలా చెప్తున్నయ్?––– అన్నారు. శాస్త్రాలు ఇవన్నీ ఉన్నవనీ–సత్యమనీ ఎప్పుడూ చెప్పటంలేదు

**సర్వ మిదం జగత్ మోహితం** (గీ7–13)

లేనిజగత్తును ఊహించుకొని అందరూ మోహంలోపడుతున్నారు. కనుక వారిప్రవృత్తిని ఆత్మానుభవంతో పోల్చి, వారిమోహం పోగొట్టటానికి వారిమాటలలోనే శాస్త్రాలు చెప్తున్నయ్. జగత్తు–అసత్–సర్వులు–సర్వం–యిదంతా వారి మాటలే, శాస్త్రం వారిమాటలకూ–భావాలకూ తత్త్వం చెప్తున్నది. శాస్త్రాలన్నీ కేవలమైన ఆత్మానుభవమే దృష్టిలో పెట్టుకొని ఆత్మాను

భవమే=నీ(సర్వుల) నిజఅనుభవమే సత్యమని చెప్తున్నయ్. అందరూ సంసారకారణమైన **జగత్తునే దృష్టిలో** పెట్టుకొని జగదనుభవమే సత్యమని వాదిస్తూ జగత్తుననుభవిస్తున్నారు (అనుభవిస్తున్నామనుకుంటారు). ఇలా వాదిస్తూనే శాస్త్రాలను ప్రశ్నించి **జగత్ దృష్టితోనే** శాస్త్రతాత్పర్యం గ్రహించాలని ఆశిస్తున్నారు. అందుకే చాలభయపడుతూ జాగ్రత్తగా చెప్తున్నయ్ శాస్త్రాలు-శ్రుతులు.

**శంకలు తీరిపోయినయ్ జిజ్ఞాసువులకు.**

# అయినా అర్థంకావటం లేదు

అన్నారు-అంటున్నారు సాధారణంగా అందరూ.

**II** న కర్తృత్వం న కర్మాణి, లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫల-సంయోగమ్, స్వభావస్తు ప్రవర్తతే. (గీ5-14)
నాదత్తే కస్యచిత్పాపమ్, న చైవ సుకృతం విభుః,
అజ్ఞానేనావృతం జ్ఞానమ్, తేన ముహ్యన్తి జన్తవః. (గీ5-15)

ఆత్మ=ఆత్మానుభవం=కేవలం-కైవల్యం ఎప్పుడూ ఏ కర్మపదార్థాలనూ-జగత్తునూ సృష్టిచెయ్యదు-చెయ్యలేదు. కర్మలూ కల్పించలేదు, కర్తృత్వమూ చెప్పలేదు, కర్మలకు ఫలమూ చెప్పలేదు, కర్మఫలాన్ని అనుభవించటంగురించి ప్రస్తావించనూ లేదు, కర్మఫలం పొంది అనుభవించనూ లేదు. పాపపుణ్యాలను గ్రహించనూలేదు. పాపపుణ్యాలంటే ఏమో **ఆత్మకు=ఆత్మానుభవానికి** తెలియదు. అంటే, జగత్తు అనిచెప్పబడే పదార్థంయొక్క కార్యకారణములగురించి ఆత్మకు అసలేతెలియదు--- నీ(సర్వుల) **నిజఅనుభవంలో** జగత్తుయొక్క కార్యకారణములు లేనేలేవు. అందుకే కేవలం-కైవల్యం. ఆత్మను=నిజఅనుభవాన్ని=కైవల్యాన్ని విడిచారు కనుకనూ, కనీసం తెలుసుకోవటానికి ప్రయత్నించటంలేదు కనుకనూ, అజ్ఞానావృతులై జగత్తూ-కర్మపదార్థాలూ- కర్మలూ-కర్తృత్వాలూ-కర్మఫలాలూ-కర్మఫలానుభవాలు-పాపపుణ్యాలూ-ఇలా అన్నీ సృష్టించుకొని, ఎవరి పుర్రెలలో ఎలా ఊహాలువస్తే అలా ఊహించుకొని మోహంలో పడుతున్నారు, సంసారంలో కొట్టుకుంటున్నారు--- అని చెప్పినయ్ శాస్త్రాలన్నీ.

**శంకలు తీరిపోయినయ్ జిజ్ఞాసువులకు**

# అయినా అర్థంకావటం లేదు

**అన్నారు-అంటున్నారు సాధారణంగా అందరూ.**

జగత్తును మేము సృష్టిచెయ్యటమేమిటి? ఇంతపెద్దపనిని మేం

ఎలా చెయ్యగలం? అన్నారు. నీ స్వప్నంచూచుకో నాయనా! అన్నయ్ శాస్త్రాలు. అజ్ఞానావృతమూ–కామపూరితమూ అయిన మనస్సుతో గుర్తించుకుంటూ–తాదాత్మ్యతచెందుతూ, నేనేమనస్సు–మనస్సేనేను అని అనుకొనే నీవే(నీమనస్సే) నీస్వప్నాన్ని సృష్టించావు కదూ! స్వప్నంలోని నామరూపాదిజగత్తూ–ఇళ్ళూ–స్తంభాలూ– కుర్చీలు–మనుష్యులూ–కర్మలూ–వావివరుసలూ–ఆచారాలు–కర్తృత్వభోక్తృత్వాలు–కర్మఫలములూ– అనుభవాలూ–పాపపుణ్యాలూ–భయవిస్మయాలూ—– అంటే కార్యకారణాలు అన్నీ నీవే(నీ మనస్సే) సృష్టించావు. నీవే (నీమనస్సే) కార్యకారణ స్వరూపాలనన్నిటినీ ధరించావు. వేరెవరూ సృష్టించనూ లేదు, ఏ స్వరూపాలనూ ధరించనూలేదు. స్వప్నావస్థ అయిన తరువాత స్వప్నంలో సృష్టిఅంతా నాశనం అయిపోయింది, మళ్ళీ కనపడకుండా పోయింది కదూ! వేరెవరూ నాశనంచెయ్యలేదు కదూ! నీవే(నీమనస్సే) స్వప్నావస్థ అనే ఊహాలోకాన్ని (ఊహించుకొనే అవస్థను) ముగించినప్పుడు నీవే నాశనంచేశావు కదూ!

**యథా స్వప్నప్రపఞ్చోఽయం మయి మాయావిజృమ్భితః,**
**తథా జాగ్రత్ప్రపఞ్చోఽయం మయి మాయావిజృమ్భితః.**

ఎలాగైతే స్వప్నప్రపంచాన్ని నీయందునీవే కల్పించుకుని వ్యాపింపచేసుకొని–అనుభవించి–భయవిస్మయాది ద్వంద్వాలనమభవిస్తున్నావో, అలాగే జాగ్రత్ ప్రపంచాన్నికూడా నీయందునీవే కల్పించుకొని–వ్యాపింపచేసుకొని–అనుభవించి– భయవిస్మయాది ద్వంద్వాలనమభవిస్తున్నావు. స్వప్నమైనా–జాగ్రత్తైనా ఉన్నది–చూచినది–చేసినది నీమనస్సేగా! నీకు రెండుమనస్సులు లేవుగా! కనుక నీజగత్తుకు సృష్టిస్థితిలయకారుడవు నీవే. ఇలా అజ్ఞానవశుడవై – అన్యఅవస్థలలో, సృష్టిస్థితిలయములనుచేసే వ్యాపారంలో నిమగ్నుడవైనప్పటికీ,

ఆత్మ= నీనిజస్వరూపం=నీనిజఅనుభవం ఎక్కడికీ పోలేదు నాయనా! నీలోనే నిజమైన నీవే అయిఉన్నది —– అని చెప్పినయ్ శాస్త్రాలన్నీ.

**శంకలు తీరిపోయినయ్ జిజ్ఞాసువులకు.**

# అయినా అర్థంకావటం లేదు

**అన్నారు-అంటున్నారు, సాధారణంగా అందరూ.**

**న రూపమస్యేహ తథోపలభ్యతే**
**నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా** (గీ15–3)

జగత్తూ=సంసారంయొక్కరూపమూ ఎలాంటిదో, దాని మొదలు ఎక్కడో–ఎలాగో– ఎలావచ్చిందో, ఎప్పుడు–ఎలా పోతుందో, ఉండి ఎలా–ఎక్కడెక్కడ–ఎన్నివిధాలుగా–ఎన్నిరూపాలతో ఏడిపిస్తున్నదో అర్థంకాక,

జగత్తూ-సంసారంయొక్క సృష్టిస్థితిలయకారకుడవు నీవే (అజ్ఞానంలోపడిన నీవే)ననీ, కార్యకారణములన్నీ నీవేననీ చెప్తున్నప్పటికీ అర్థంచేసుకోలేక, జగత్తుకు అన్యకారణం వెతకటానికి మొదలుపెట్టారు. అన్యపదార్థమే లేనప్పుడు ఊహించుకున్న ఏపదార్థాన్నైనా కారణం అని అనుకుంటేనూ, ఒక్కొక్కరు ఒక్కొక్క కారణం ఊహించుకుంటుంటేనూ, అసలుకారణం పట్టుకోలేరు. ఇలా అన్యకారణం ఊహించటమే జరిగితే అసలుకారణం పట్టుకోలేరు, ఎవ్వరూ-ఎప్పటికీ ముక్తినిపొందే అవకాశమే ఉండదు. కనుక వీరిప్రవృత్తిని బాగావిచారించి కారణాన్ని శాస్త్రమే చెప్తున్నది.

రజ్జౌ సర్పభ్రాన్తిరివ (నిరాలమ్బ ఉపనిషత్తు)

త్రాడు పడిఉంటే పాముఅని అనుకున్నాడు. ఇలా అనుకోవటం భ్రాంతి అని అందరికీ అర్థమవుతున్నది. త్రాడు సత్యమైన వస్తువు, పాము కల్పితపదార్థం. సత్యమైన త్రాడుమీదనే పాము కల్పింపబడింది. కల్పింపబడిన పాముకు వాస్తవంలో ఉనికిలేదు. అంటే వాస్తవంలో పాము లేనేలేదు. కానీ భ్రాంతిలో చూచినవాడు, పామునే చూస్తున్నాడు. వాడికి త్రాడు కనపడటంలేదు--కనుక త్రాడు లేదంటున్నాడు. భ్రాంతిలో ఉన్నవాని దృష్టిలో పామేసత్యమై త్రాడు లేనిదైనప్పటికీ, వాస్తవంలో త్రాడేసత్యం పాములేనిది. అయినా, వాస్తవదృష్టితో వాస్తవమే చెప్పినా, పాముకు కారణం తనభ్రాంతియే అని ఒప్పుకొనేటట్లుగా లేడు భ్రాంతిగొన్నవాడు. తనభ్రాంతికి ఫలమైన భయాన్ననుభవించి పాము సత్యమంటాడే కానీ భ్రాంతిస్వరూపమే పాము (పాముకు వేరే స్వరూపమూ కారణమూ లేదు) అనిచెప్తే వినేటట్లుగా లేడు. పాముకు కారణం వెతకటం మొదలుపెట్టాడు. జగత్తులో ఎక్కడా పాములేదని తెలుసుకున్నా భ్రాంతిపోదు-భయంపోదు. పామును ఆరోపణచేసిన త్రాడుమీదనే పాములేదని తెలుసుకోవాలి. అప్పుడు త్రాడుమీద భ్రాంతిపోయి భయం నాశనమవుతుంది. కనుక అన్యపదార్థప్రసక్తి **చెయ్యకుండా---** త్రాడు పడిఉండటంవల్ల భ్రాంతిచెందాడు, పామును కల్పించుకున్నాడు కనుక, భ్రాంతినిచెందినవాడు తనభ్రాంతిని కారణం అని (వాస్తవ కారణాన్ని) ఒప్పుకోకపోతే త్రాడే కారణం అన్నారు. త్రాడు అధిష్ఠానసత్తాకారణం=ఉండటంవల్ల కారణమయ్యింది అన్నారు. కారణంకాకపోయినా కారణమైనదన్నారు. నిజంగా పామును సృష్టిచెయ్యకుండా కారణమైనదన్నారు. అప్పటికి కొంతతృప్తిచెందాడు భ్రాంతిగొన్నవాడు. భయం పోయినతర్వాత కొంతవిచారించి, భయానికికారణం తనభ్రాంతియేనని గ్రహించి త్రాడుయొక్క నిజస్వరూపాన్ని తెలుసుకొని జ్ఞానిఅయినాడు.

అలాగే, వాస్తవమైన ఆత్మ=ఆత్మానుభవం=నీ(సర్వుల) నిజఅనుభవం సదా అనుభవింపబడుతున్నప్పటికీ తెలుసుకోలేక, భ్రాంతిలో-అజ్ఞానంలో-అవివేకంలో ఆత్మానుభవాన్నే దేహేంద్రియాదిజగత్తుగానూ--బాహ్యజగత్తు

గానూ కర్మ-కర్తృత్వా-భోక్తృత్వా ఫల-అనుభవములుగానూ-ద్వంద్వమయం గానూ భావించి, తనజగత్తుయొక్క సృష్టిస్థిలయములకు తనే-తనభ్రాంతియే కారణమైనప్పటికీ వాస్తవకారణమైన తనభ్రాంతిని-అజ్ఞానాన్ని గుర్తించక, చెప్పినావినక అన్యకారణంకోసం వెతుకుతున్నాడు(రు) కనుక, లేని అన్యప దార్థాన్ని కారణంగా ఊహించుకొనే అవాంతరాన్ని ఒప్పకోక, వాస్తవమైఉన్న ఆత్మయందే జగత్తును కల్పించుకుంటున్నాడు కనుక ఆత్మయే కారణం అన్నయ్ శాస్త్రాలు. ఆత్మ అధిష్ఠానసత్తాకారణం= ఊరికేనే ఉండటంవల్ల కారణం అన్నయ్. కారణం కాకపోయినా కారణం అయినదన్నయ్. జగత్తును సృష్టిచెయ్యకుండా కారణమైనదన్నయ్.

# అయినా అర్థంకావటం లేదు

అన్నారు, అంటున్నారు సాధారణంగా అందరూ.

అధిష్ఠానసత్తాకారణం, సృష్టిచెయ్యకుండా కారణమవటం, కారణం అయ్యా-కాకుండా ఉండటం --- ఇదేమీ అర్థకావటం లేదన్నారు. సృష్టీ-జగత్తూ అంటే, చెట్టు-పుట్ట-కొండ-దేహం మాత్రమే కాదనీ, వాటితో ఎవరు-ఎలా వ్యవహరిస్తుంటే అలా వారిజగత్తు వారికి తటస్థమౌతున్నదనీ, ఈవ్యవహారం లేకపోతే జగత్తు ఏరూపంలోనూ లేకుండా పోతుందనీ,

వారి నిజఅనుభవంలో ఇదే సత్యమనీ, వారికి జగత్తుతో ఏవిధంగానూ సంబంధంలేదనీ చెప్తుంటే, వారుకల్పించుకున్న జగత్తునే చూచుకుంటూ ఈమాటలు అర్థంచేసుకోవటం లేదు. వారి జగత్తుకు కారణం చెప్పమని మరీమరీ అడగటం మొదలు పెట్టారు.

సచ్ఛబ్ద వాచ్యం, అవిద్యాశబలం బ్రహ్మ, బ్రహ్మణోఽవ్యక్తం,
అవ్యక్తాన్మహత్, మహతోఽహఙ్కారః,
అహఙ్కారాత్పఞ్చతన్మాత్రాణి
పఞ్చతన్మాత్రేభ్యః పఞ్చమహాభూతాని
పఞ్చమహాభూతేభ్యో ఽఖిలం జగత్. (త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్)

అధిష్ఠానసత్తాకారణమైన ఆత్మ=ఆత్మానుభవం=నీ(సర్వుల) నిజఅనుభ వానికే బ్రహ్మ అనే శబ్దాన్ని ఉపయోగించి, బ్రహ్మ మాయలోపడ్డాడు. మాయలోపడ్డ బ్రహ్మనుండి అవ్యక్తం పుట్టింది. అవ్యక్తంనుండి మహత్ పుట్టింది. మహత్నుండి అహంకారం పుట్టింది. అహంకారంనుండి పంచతన్మాత్రలూ, పంచతన్మాత్రలనుండి ఈ జగత్తంతా పుట్టింది అన్నయ్ శాస్త్రాలు - శ్రుతులూ.

ఇప్పుడర్థమయింది అన్నారు సాధారణంగా అందరూ.

బ్రహ్మ మాయలో ఎందుకు పడ్డాడు? సృష్టితో బ్రహ్మకు సంబంధం

ఏమిటి? ఇలాగే చెప్పి ముగించుతవా శాస్త్రాలూ - శ్రుతులూ అని మథనపడ్డారు నిజమైన జిజ్ఞాసువులు.

నిజమైన జిజ్ఞాసువులకు పై వాక్యాలు (ఉపనిషన్మంత్రంయొక్క) అంతరార్థంను వివరించింది. -- (చతుశ్లోకీభాగవతం 40వపేజీ నుండి 45వపేజీ వరకు చూడండి). మందబుద్ధులకు, బ్రహ్మ మాయలోపడి సృష్టి చేసినట్లుగా ఈ మంత్రార్థం కనిపిస్తున్నప్పటికీ, అంతరార్థం విచారిస్తే, అది వారి అజ్ఞానకారణమే అని అర్థమవుతుంది. ఇంకా ఎలా చెప్తున్నదో చూడు నాయనా!

**తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదనుప్రవిశ్య నిరుక్తం చానిరుక్తం చ, నిలయనం చానిలయనం చ, విజ్ఞానం చావిజ్ఞానం చ, సత్యం చానృతం చ సత్యమభవత్.** (తైత్తిరీయ.ఉ-ఆ-6)

జగత్తును సృష్టిచేసి దానిలోనే దూరాడు బ్రహ్మ అన్నయ్.

ఇప్పుడర్థమయింది అన్నారు సాధారణంగా అందరూ. తర్వాత మాటలు చెప్పనివ్వలేదు. అంతరార్థం అర్థంచేసుకొనే ఓర్పులేదు వీరెవ్వరికి. కానీ, జిజ్ఞాసువు చాల జిజ్ఞాసతో వింటున్నాడు. సృష్టిలో ప్రవేశించి(నప్పటికీ) సత్యమైన పరంబ్రహ్మ, దేశకాలనామరూపాలను చెప్పినట్లు ఇలాంటిది అని చెప్పగలిగినదిగానూ, సృష్టిలోని విశిష్టవస్తువులచే కూడా నిర్దేశింపబడనిది గానూ--- సృష్టికి ఆశ్రయమైనదిగానూ, సృష్టికి తనలో ఎటువంటి చోటూ-ఆశ్రయమూ లేనిదిగానూ--- జగత్తును తెలుసుకొనేదిగానూ, జగత్తును తెలిసుకోవలసిన అవసరంలేక, జగత్తుతో ఏసంబంధమూ లేనిదిగానూ--- సృష్టిరూపంలో సత్యమైనదానివలెనూ, తన నిజస్వరూపంలో సృష్టి లేనిదానిగానూ--- సత్యమభవత్=పరంబ్రహ్మతత్త్వం అయింది అన్నయ్ శ్రుతులూ-శాస్త్రాలూ.

**తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్** జగత్తును సృష్టిచేసి దానిలో దూరాడు అనిఅంటే -ఇదే నిజమని అనుకుంటారేమోనని, భయపడుతూనే, బ్రహ్మ సృష్టిచేసి సృష్టిలో దూరటమంటే ఎలాంటిదో, దూరి ఎలా ఉన్నాడో, ఏవిచారణచేస్తే సృష్టితో బ్రహ్మకు సంబంధంలేదని అర్థమవుతుందో ఇలా వెంటనే చెప్పినయ్ శ్రుతులు. తనభ్రమను గుర్తించక అన్యకారణంవెతికే వానికి, త్రాడు పామునుసృష్టిచేసి పాములో దూరింది, పాములో దూరి(న ప్పటికీ), పామువలె (విశిష్టంగా)ఉన్నట్లు కనిపించింది, వాస్తవంలో పామువలె త్రాడులేదు--- పాముకు ఆశ్రయమైనదిగా ఉన్నా, వాస్తవంలో పాముకు తనలో కొంచెంకూడా చోటునివ్వలేదు త్రాడు--- పామును తెలుసుకొనేదిగా ఉన్నా, వాస్తవంలో పామును తెలుసుకోవలసిన అవసరమూ లేదు, పాముతో ఏసంబంధమూ లేదు త్రాడుకు--- త్రాడు, పాముారూపంలోనే సత్యమైన

దానివలె (భ్రమలో) కనబడినప్పటికీ, తన నిజస్వరూపంలో పాములేకుండానే ఉన్నది---- ఇది త్రాడు పామును సృష్టించి పాములోదూరటం అంటే! చూచావా లేనిపామును సత్యమైనత్రాడుతో కలిపి ఇలాచెప్తుంటే ఎంత హాస్యాస్పదంగా ఉన్నదో!

అలాగే, లేని జగత్తును సత్యమైన బ్రహ్మతోకలిపి ఇలాచెప్తే హాస్యాస్ప దంగానే ఉన్నది. కనుక, జగత్తుకు కారణం వెతికే ఈ వెఱ్ఱివెంగళప్పలకు వ్యంగ్యంగా ఈమాటలుచెప్తే అప్పటికీ-ఇప్పటికీ-పండితులమనుకొనే వారి నుండి పామరులవరకు అందరూ, **తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్** అని మననం చేస్తూంటారు. తర్వాతమాటలను లక్ష్యపెట్టక, బ్రహ్మ సృష్టినిచేసి సృష్టిలోదూరాడని శ్రుతులు చెప్పినయ్, శ్రుతులే చెప్పినయ్ అంటారు. గద్దెలమీదికెక్కి నొక్కివక్కాణిస్తుంటారు, గద్దెనుండి దింపి వీపు పగులగొట్టి చెప్పినా, ముఖంపగులగొట్టి విచారణచెయ్యమన్నా ఈ అల్పబుద్ధులకు చేతకాదు. అందుకే ఇంకా చెప్తున్నాడు భగవంతుడు.

**మయా తతమిదం సర్వమ్, జగదవ్యక్తమూర్తినా,**
**మత్‌స్థాని సర్వభూతాని, న చాహం తేష్వవస్థితః.** (గీ9-4)
**న చ మత్‌స్థాని భూతాని, పశ్య మే యోగమైశ్వరమ్,**
**భూతభృన్న చ భూతస్థః, మమాత్మా భూతభావనః.** (గీ9-5)

ఈ జగత్తంతా నేనే వ్యాపించి ఉన్నాను అంటున్నాడు భగ వంతుడు. ఈమాటను సరిగా అర్థంచేసుకోలేక భగవంతుడు=బ్రహ్మ జగత్స్వరూపుడనీ-విరాట్స్వరూపుడనీ, జగత్తును సృష్టిచేసి జగత్తులో దూరి కూర్చున్నాడనీ-ఇరుక్కున్నాడనీ అనేకమైన విపరీతభావాలతో ఉంటుంటారు -- పండితులనబడేవారినుండి పామరులవరకు --సాధారణంగా అందరూ. ఇటువంటి వారికి సమాధానం చెప్తున్నారు భగవంతుడు చూడునాయనా!

కుండలో పూర్తిగా నీళ్ళు ఉన్నవన్నప్పుడు, నీటికంటె వేరేపదార్థంలేక నీరేఉన్నదని అర్థంకదూ! అలాగే, **మయా తతమిదం సర్వం జగత్**--జగత్ అనే పదార్థంలో పూర్తిగా నేనే వ్యాపించి ఉన్నాను, అంటే పూర్తిగా నేనే (బ్రహ్మ) ఉంటే ఇంక జగత్తుకు ఉనికి ఎక్కడిది? లేదు అని చెప్తున్నాడు. ఇది అర్థమైతే తర్వాత మాటలు అక్కరలేదు.

**అర్థమయింది నిజమైన జిజ్ఞాసువులకు**

# అయినా ఇంకా అర్థంకాలేదు

**అన్నారు అంటున్నారు సాధారణంగా అందరూ.**

ఈ అల్పబుద్ధులు ఇంకా ఏమన్నారంటే, సర్వమూ భగవంతుడే ఉంటే మాకెందుకు కనిపించడు?---- అవ్యక్తస్వరూపంలో ఉన్నానన్నాడు

భగవంతుడు. అవ్యక్తస్వరూపం=కనిపించనిస్వరూపం ఏమిటి? ఇదేమైనా మాయా- గారడీనా? అన్నారు. మీరు కల్పించుకున్న జగత్తు మీకు కనిపించినట్లు నేను కనిపించనన్నాడు భగవంతుడు. భ్రమతో కల్పించుకున్న పాములాగా త్రాడు కనపించదు. త్రాడు త్రాడులాగానే కనిపిస్తుంది.

మీరు కల్పించుకున్న జగత్తుయొక్క నామరూపాలతోనూ-సుఖదుఃఖాది ద్వంద్వాలతోనూ నేను కనిపించను-వ్యక్తంకాను. మీరు, జగత్తు సత్యమనే భావంలో ఉన్నారు కనుక, జగత్తుతో ఏవిధంగానూ సంబంధంలేని నేను అవ్యక్తం, మీకు కనిపించటం లేదు. జగత్తు వదిలిపెట్టే మీకు కనిపిస్తానన్నాడు. అప్పటిదాకా శాంతంగఉన్న వ్యక్తి క్రొత్తకోపం కొనితెచ్చుకున్నాడు. కోపంఅనే జగత్తులో శాంతంఅనే బ్రహ్మ దూరలేదు-దూరదు. కోపమే తనరూపంగా అనుకున్నంతవరకూ, తనవద్దనేఉన్న శాంతం, కోపంరాక పూర్వమునుండే ఉన్న శాంతం తనకు కనపడదు=అవ్యక్తం అంటున్నారు భగవంతుడు=బ్రహ్మ.

**శంకలు తీరినయ్ జిజ్ఞాసువులకు.**

"మళ్ళీ నీవు మొదటికొచ్చావేమయ్యా! ఇప్పుడేగా **తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్** అన్నయ్ శ్రుతులు" అన్నారు అంటున్నారు సాధారణంగా అందరూ. మీ మొహాలు మండిపోనూ! శ్రుతులు చెప్పినవి ఇంతేనా మీకర్థమైనది? ఆత్మ=ఆత్మానుభవం= నీ(సర్వుల) నిజఅనుభవమే కైవల్యమనీ గమ్యమనీ చెప్పినయ్. నీ(మీ)నిజఅనుభవంలో=కైవల్యంలో జగత్తుప్రసక్తి లేదని చెప్పినయ్. అథవా జగత్తు ఉన్నదనుకుంటే అది నీ(మీ)గోలయేకానీ మరేం కాదన్నయ్. వాస్తవంలో నీవు కైవల్యస్వరూపుడవు=ఆత్మస్వరూపుడవే అయినప్పటికీ, నీనిజస్వరూపంలో ఉండటంచేతకాక, జగత్తును సృష్టించుకొని జగత్తులో దూరావు-ఇరుక్కున్నావు, మాయను రావే అని కౌగిలించుకుని మాయలో పడ్డావు-- ఇవన్నీ నీ చేష్టలే. ఇంతచేసి నీవు సంసారివను కొని సంసారంలోతిరుగాడుతున్నా, నీ నిజస్వరూపానికి ఏచలనమూలేదనీ సంసారం అంటుకోలేదనీ చెప్పినయ్ శ్రుతులు. నీ నిజస్వరూపమూ, నీవు మాయలోపడిన నీసంసారస్వరూపమూ, రెండింటిని విచారించి నీనిజస్వరూపాన్ని=నీనిజఅనుభవాన్ని నీవు(ఇలా) గుర్తించలేక పోతున్నావు కనుక, నీనిజస్వరూపాన్ని=నీనిజఅనుభవాన్నే భగవంతుడు=బ్రహ్మ అని నీనుండి వేరుచేసి చూపించినయ్ శ్రుతులు. చూపి, బ్రహ్మయే నీవు= నీ నిజస్వరూపం అని బోధచేస్తున్నయ్.

**అంటే, నీలోనే నీవే కైవల్యస్వరూపుడవు అయి ఉన్నప్పటికీ నీవు గుర్తించలేకుండా ఉన్నావు కనుక, నీనుండి వేరుచేసి, నీవు గుర్తించటానికి వీలుగా నీ కైవల్యాన్ని చూపించినయ్ శ్రుతులు.**

నీవే నీనిజస్వరూపంలో=నీనిజఅనుభవంలో ఉండినట్లయితే, బ్రహ్మ=భగ

వంతుడినైన నాకు వేరేఉనికి లేదు. నేనూ-నీవు ఒకటే, నేనూ-నీవూ అనే భేదంలేదు. నీ శుద్ధమైన-కేవల-స్వరూపమే నేను. నన్ను నీలో చూచుకున్నా, నీకంటె వేరుగాచూచినా నానిజస్వరూపం=నీనిజస్వరూపం=నీ(సర్వుల)నిజఅనుభవం=ఆత్మానుభవం మారదు -- దీనికి, కల్పించిన జగత్తుతో ఏ విధంగానూ సంబంధం లేదు.

కనుక జగద్భావంతో చూస్తేనూ-తెలుసుకుంటేనూ వ్యక్తం కాదు. శంకలు తీరినయ్, ఆనంద పరవశులైనారు ముముక్షువులు=జిజ్ఞాసువులు.

# అయినా ఇంకా అర్థంకావటంలేదు

అన్నారు, అంటున్నారు సాధారణంగా అందరూ.

సరే! నన్ను వేరుచేసి సృష్టికికారణం అన్నారు కనుక, సృష్టికి నేను కారణమవటమంటే ఏమిటో, సృష్టి నాలోఉంటున్నదో, నేను సృష్టిలోఉన్నానో, ఇంకా ఎలాఉన్నానో --నేనే చెప్తా, జాగ్రత్తగా వినండి అంటున్నాడు భగవంతుడు నాయనా! కనుక శ్రద్ధతో విను.

మత్ స్థాని సర్వభూతాని --- సర్వభూతములు నాలోఉన్నయ్ న చ అహం తేషు అవస్థితః --- నేను సర్వభూతములలో లేను. అంటే, సర్వభూతములూ నన్ను ఆధారంచేసుకొని ఉన్నయ్‌గానీ, నేను సర్వభూతములనూ ఆధారంచేసుకొనీ, జగత్తును ఆధారంచేసుకొనీ లేను. అయితే, సర్వభూతములూ-జగత్తూ ఉండడం సత్యమేనా అన్నారు జగత్తుకోసం వాదించే వీరు వెంటనే. తొందరపడకుండా విచారణ చెయ్యమంటున్నాడు భగవంతుడు---- త్రాడును ఆధారంచేసుకొని పాము ఉండవచ్చునుగానీ, పామును ఆధారంచేసుకొని త్రాడుఉండటానికి వీలులేదు. అంటే పాము వాస్తవంలో ఉన్నదా-లేదా అనే ప్రసక్తిచెయ్యక పోయినా, భ్రమసమయంలో పాము ఉన్నదనుకున్నా రెండింటిలో ఎవరు-ఎవరిని ఆధారంచేసుకొని ఉన్నారో తెలుసుకోవాలి. ఎందుకంటే, ఏభ్రమలో-ఎలా ఆరోపణచేసినా, సత్యమైనవస్తువునందు అసత్యమైనది ఆరోపణచేసినా, ఎప్పటికైనా భ్రమతొలగిపోతే, ఆరోపణ-అసత్యమైనపదార్థమూ రెండూ నాశనమై, సత్యమైనవస్తువు మిగులుతుంది. అలాకాకుండా, అసత్యమైన పదార్థమునందు సత్యమైన వస్తువును ఆరోపణచేస్తే భ్రమ ఎప్పటికీ పోదు. సత్యమైనవస్తువే అసత్యమైన పదార్థంవలె కనిపిస్తుంది. సాధారణంగా అందరూ ఇలాంటి ఆరోపణయే చేస్తున్నారు. అప్పుడు సత్యమైనవస్తువును చూడగలిగే అవకాశం శాశ్వతంగా పోగొట్టుకుంటారు. అందుకే

**యస్యైవస్ఫురణం సదాత్మకం అసత్కల్పార్థగం భాసతే**

(దక్షిణామూర్తిస్తోత్రం-4)

త్రాడు అనేది వ్యావహారికంగ సత్యమైన పదార్థం. (కల్పిత)పాములోనే త్రాడు ఉన్నదనుకుంటే, పాముమాత్రం కనిపించి త్రాడు ఎప్పటికీ ఎలా కనిపించదో, అలాగే **మయాతతమిదం సర్వం జగత్** -- నేను జగత్తంతా వ్యాపించి ఉన్నానంటే, జగత్తుఉనికియొక్క నిజానిజాలు విచారించకపోయినా, కనీసం తెలుసుకోవలసినదేమిటంటే, ఏభ్రమలో ఎలా ఆరోపణచేసినా, నాలో సర్వభూతములూ-జగత్తూ ఉన్నదనవచ్చుగానీ, నేను వాటిలోలేను. సత్యమైననాలో, అసలేలేని సర్వభూతములూ-జగత్తూ ఉన్నట్లు ఆరోపణచేసినా ఎప్పటికైనా నాతత్త్వం-నానిజస్వరూపం తెలుసుకుంటారుగానీ--- అసలేలేని సర్వభూతములలోనూ-జగత్తులోనూ నేనున్నానని ఆరోపణచేస్తే నాతత్త్వం ఎప్పటికీ అర్థంకాదు, వారిసంసారం తొలగిపోదు. నన్ను చూస్తున్నప్పటికీ జగత్తు చూస్తున్నామనుకుంటారు. (త్రాడును చూస్తున్నప్పటికీ పామునే చూస్తున్నామనుకుంటునట్లు) నాతత్త్వమే అనుభవిస్తున్నప్పటికీ జగత్తునే అనుభవిస్తున్నామనుకుంటారు.

**అదేమిటయ్యా భగవంతుడా! ఈ రెండు ఆరోపణలలో ఇంత తేడా ఉన్నాదా? ఏమిటి ఋజువు? నిన్ను చూస్తూ జగత్తుచూస్తున్నామనుకోవటం ఏమిటో అర్థంకావటం లేదే---** చూడు నాయనా! కాఫీ త్రాగుతూ ఆనందిస్తున్నాననుకుంటున్నావా? -- ఇలాఅనుకోవటం గురించి ఎప్పుడైనా విచారించావా? ఆనందం అనేది నాస్వభావం=నానిజస్వరూపం. నాస్వభావమైన ఆనందాన్ని, నాకంటె వేరైన (తత్త్వదృష్టిలో=నానిజస్వరూపదృష్టిలో=కైవల్యదృష్టిలో=నీగమ్యందృష్టిలో=అసలేలేని కల్పిత) కాఫీలో ఆరోపణచేశావు. ఆరోపణచేసి

కాఫీలోనే ఆనందం ఉందన్నావు కాఫీయే ఆనందం అన్నావు
కనుక కాఫీయే కావాలన్నావు కాఫీని విడిచిపెట్టలేనన్నావు
ఆనందస్వభావమే అయిన నన్ను విడిచి పెట్టావు.

ఆనందమయమైన నాస్వభావాన్నే అనుభవిస్తున్నప్పటికీ, ఆనందం బాహ్యపదార్థమైన కాఫీలో ఉన్నదన్నావు-ఉన్నదంటున్నావు. ఆనందాన్నిచ్చే గుణం కాఫీలోనే ఉంటే గ్లాసుదింపకుండా చచ్చేదాకా కాఫీ త్రాగుతూనే ఉండవచ్చు గదా! కనీసం ఒక్కసారిగా ఒకబిందెడుకాఫీ త్రాగమంటేనే అనుకున్న ఆనందమంతా దుఃఖమయమవుతున్నది. పోనీ ఒకగ్లాసుకాఫీలో ఆనందం ఉన్నదనుకున్నా అలా అందరికి అన్ని సమయాలలో లేదు. ఒక గ్లాసుకాఫీ త్రాగిన వెంటనే యింకొక గ్లాసు కాఫీ యిచ్చి త్రాగమంటె ఆనందమంతా అగచాట్లపాలవుతుంది కనుక, ఆనందం కాఫీలో లేదు. తప్పకుండా అది(ఆనందం) నాస్వభావమే అయినా, ఆనందస్వభావమైన

నన్నువిడిచి, దుఃఖమయమైనదీ––ఆనందంఆరోపింపబడినదీ––– ఆనందమిస్తుందని కల్పించుకున్నదీ అయిన (కల్పిత)కాఫీనే పట్టుకున్నావు, విడవమంటే చేతకావటంలేదు. మళ్ళీమళ్ళీ కాఫీనేకోరి కాఫీలోకే జారిపడుతున్నావు, కాఫీసంసారంలో తిరుగాడుతున్నావు. **ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాడి అయినట్లు** నాకంటె కాఫీయే బాగుంది నీకు. శాశ్వతఆనందఖని–ఆనందఘనం అయిన నాకంటె, కల్పించుకొని నెత్తినెక్కించుకున్న కాఫీకొరివి ఆనందం అనిపిస్తున్నది నీకు. అంటే, నన్ను నాస్వరూపంలో చూడకుండా కాఫీస్వరూపంలో కాఫీలాగానే చూస్తున్నావు. ఇదే నాయనా! నన్ను జగత్తులాగా చూడటమంటే, ఇప్పుడర్థమయిందా? **ఋజువయిందా? ఎంత అవాంతరం జరుగుతున్నదో బోధపడుతున్నదా?** అందుకే,

మత్ స్థాని సర్వభూతాని, న చాహం తేష్వవస్థితః (గీ9–4)

నాలో (నా ఆనందంలో) కాఫీ ఉందన్నప్పటికీ, ఆరోపణచేసినప్పటికీ ఈ(నీ)భ్రమను ఒప్పుకోవచ్చునేమోగానీ, కాఫీలో నేను(నాఆనందం=ఆనందం) ఉండటానికి వీలులేదు. ఉండదు–– లేదు. ఇంతేనా, ఇలాగే భోజనంలో తృప్తి, సిగరెట్ ఆనందం, సినిమాలో ఆనందం, ప్రమోషన్‌లో పరిపూర్ణత, క్రొత్తబట్టలలో అందం––– మొదలైన ఐశ్వర్యభోగాలలోనూ–సకామకర్మలలోనూ కోరికలే చెలరేగి సంసారంలో బంధిస్తున్నప్పటికీ, తృప్తి–ఆనందం–పరిపూర్ణత–అందం–న్యాయం–ధర్మం– మంచి–సుఖం అనే విశేషాలను ఈకర్మలలో ఆరోపిస్తున్నారు. నా తత్త్వానుభవమే తృప్తీఆనందాలు, నాతత్త్వానుభవమే పరిపూర్ణత, నా నిజస్వరూపానుభవమే అందం, ఇదే న్యాయం–ధర్మం–మంచి– సుఖం– ఇత్యాదులైన విశేషాలు. ఇవన్నీ నా స్వభావాలు. నాలో, వీరి భోజనం–సిగరెట్–సినిమా–ప్రమోషన్–క్రొత్తబట్టలు–మొదలైన జగత్తూ–జగత్పదార్థాలు ఉన్నవని ఆరోపణ చేసినప్పటికీ, వీటినన్నిటినీ భోగిస్తున్నామనుకొనే సర్వభూతములూ ఉన్నవని ఆరోపణచేసినప్పటికీ ఈ భ్రమను= అజ్ఞానాన్ని ఒప్పుకోవచ్చునేమోగానీ, ఈ జగత్తూ జగత్పదార్థాలలోను–సర్వభూతములలోనూ నేను (తృప్తి–ఆనందం–పరిపూర్ణత–ధర్మం–మొదలైన నాస్వభావాలు) ఉండటానికి వీలులేదు––– ఉండవు––లేవు.

అంటే, నానిజస్వభావానికి కామజగత్తునూ–జగద్భావాన్నీ ఆరోపణచేసినా, నేను మారనుకనుక ఎప్పటికైనా నానిజస్వరూపం తెలుసుకొనే అవకాశం ఉన్నది. అలాకాకుండా జగత్తూ–జగద్భావంలో నేను (నానిజస్వభావములు) ఉన్నాననుకుంటే, జగత్తునేచూస్తూ, నేను జగత్స్వరూపుడనే అనుకుంటూ, జగత్తుయొక్క జ్ఞానానుభవాలవల్లనే పరిపూర్ణులైనామనీ, నన్నుపొందామనీ

అనుకుంటారు-అనుకుంటున్నారు. ఇది తీవ్రమైన జగద్భావం. ఇందుకే ఎంతగాచెప్పినా తత్త్వం ఇంకా అర్థంకావటం లేదు అన్నారు-అంటున్నారు సాధరణంగా అందరూ. కనుక,

పశ్య మే యోగమైశ్వరం

# నిజంచెప్తున్నాను విను నాయనా!

న చ మత్‌స్థాని అసలు భూతములు నాలో లేనేలేవు. త్రాడులో పాములేదు వాస్తవంలో. సత్యమైనవస్తువులో కల్పితమైన పదార్థం ఉండదు-లేదు-ఉండలేదు. నానిజస్వభావంలో=నానిజానుభవంలో=ఆత్మానుభవంలో=నీ(సర్వుల)నిజఅనుభవంలో కాఫీ-భోజనం-సినిమాలూ-సిగరెట్లూ-ప్రమోషన్‌లూ-క్రొత్తబట్టలూ- మొదలైన జగత్పదార్థాలూ లేవు, వాటిలో ఆరోపించిన ఆనందం-తృప్తి-పరిపూర్ణత-ధర్మం- మొదలైన స్వభావాలూ లేవు. లేనిపదార్థాలను కల్పించుకొని అనుభవిస్తున్నామనుకొనే సర్వభూతములుకూడా నాలోలేవు. అంటే, ఈ జగత్తంతా నాలో లేనేలేదు.

**భూతభృన్న చ భూతస్థః, మమాత్మా భూతభావనః** (గీ9-5)

మమఆత్మా న భూతభృత్ చ, న భూతభావనః, న చ భూతస్థః నాతత్త్వం=నానిజస్వభావం=నానిజస్వరూపం--- నేను నేను నేను నేను అని సర్వులూ అనుభవిస్తున్న ఆత్మస్వరూపం=ఆత్మభావం=నీ(సర్వుల) నిజానుభవం కాఫీని పుట్టించలేదు, కాఫీని పోషించటమూలేదు. (కాఫీలో ఆరోపణచేసిన ఆనందస్వభావాన్ని పోషించటమూలేదు. ఇలా అనుకోవటం సరియైనదేనని చెప్పటమూలేదు). కాఫీలో లేనూ లేదు. ఇలాగే ఇతరజగత్పదార్థములనూ-- సంసారకారణములైన కర్మలనూ ఎప్పుడూ పుట్టించలేదు-- పోషించటమూలేదు వాటిలో ఉండటమూలేదు. జగత్పదార్థాలను కోరి-అనుభవిస్తున్నామనుకొని, సంసారంలో తిరుగాడుతున్నామనుకొనే భూతములనూ పుట్టించలేదు-- పోషించటమూలేదు---- వాటిలో ఉండటమూలేదు. ఎవరు-ఎక్కడ-ఎప్పుడు-ఎందుకు-ఎన్నివిధాలుగా ఏఏజగత్తును ఎలాగెలాగు ఊహించుకుని సత్యమనుకున్నా వాటిని ఏపరిస్థితిలోనూ పుట్టించలేదు(సృష్టిచెయ్యలేదు)- పోషించటమూలేదు. వాటిలోనూ లేదు, వాటిని నాశనమూ చెయ్యటంలేదు. వాటితో నాశనమూ కావటంలేదు.

శంకలు తీరినయ్ అని ఆనందిస్తున్నారు జిజ్ఞాసువులు.

**ఏమయ్యా భగవంతుడా! నిన్ను కరుణామయుడు-దయాసాగరుడు-కృపాసముద్రుడు అన్నారే! మళ్ళీ ఇలాగే చెప్తావేమయ్యా! నీవేదో క్రొత్తగా మాకు పనికివచ్చేటట్లు చెప్తావనుకుంటే, జగత్తు-సృష్టి-స్థితి-లయములతో నీకు సంబంధం లేదంటావేమయ్యా!**

# ఇదేమీ అర్థంకావటం లేదే

అన్నారు, అంటున్నారు సాధారణంగా అందరూ.

**తేషామేవానుకమ్పార్థమ్, అహమజ్ఞానజం తమః,**
**నాశయామ్యాత్మభావస్థః, జ్ఞానదీపేన భాస్వతా.** (గీ10-11)

నేను కృపాసముద్రుని కనుకనే మీఅజ్ఞానం నాశనంచేసి జ్ఞానం చెప్తున్నాను.

నీ(సర్వుల) నిజస్వరూపమే బ్రహ్మ=నేననీ, నీనిజస్వరూపమును నీలోనే చూచి తెలుసుకోలేకున్నావు కనుక నీనుండి నీనిజస్వరూపాన్ని వేరుచేసి, బ్రహ్మ=భగవంతుడు అనే శబ్దములచేత నన్ను-నీకు చూపించినయ్ శ్రుతులు-శాస్త్రాలూ. ఎందుకంటే నీలోనే ఉన్న నీశుద్ధస్వభావాన్ని నీలోనే చూడడం చేతకాకపోతే, ముందుగా నన్నుచూచి, సృష్టి-స్థితి-లయములతో సంబంధంలేని నాశుద్ధస్వభావాన్ని=శుద్ధస్వరూపాన్ని చూస్తే అవగాహనచేసుకుంటే---- శుద్ధమైనఅద్దంలో శుద్ధమైనప్రతిబింబం చూచి నీ(దేహ)నిజస్వరూపంను గుర్తించినట్లు---- నిరంతరఅభ్యాసంచేత, శుద్ధమైన నాతత్త్వంలో నిజం తెలుసుకోవటానికి ప్రయత్నిస్తే, నాతత్త్వం బోధపడుతుంటుంటే, క్రమంగా అది నీనిజతత్త్వమేననీ --- నీనిజస్వరూపమేననీ-నీనిజస్వభావమేననీ- నీనిజానుభవమేననీ గుర్తించగలుగుతావు. కొన్ని కోట్లజన్మలనుండి ఇలా సంసారప్రవాహంలో కొట్టుకుంటున్నప్పటికీ నీనిజస్వరూపానుభవంలో (ఇతః పూర్వం) నీవున్నకాలంతో పోల్చుకుంటే ఈ కోటిజన్మలకాలం చాలచాలతక్కువ. అంటే నిజస్వరూపానుభవం నీకు చిరపరిచయమే, గుర్తించటానికి కష్టమే లేదు. ఎలాగో విను. నీముఖాన్ని నీవుచూడటం చాలఅరుదు. నీచుట్టూ ఉన్నవారి ముఖాలన్నిటినీ చూడటంకంటె నీముఖాన్ని నీవు చూడటం ఎంతో అరుదైనప్పటికీ అకస్మికంగా అద్దంకనపడితే, ఎంత తొందరపనిలో ఉన్నా, ఠక్కున ఆగి నీస్వరూపాన్ని గుర్తించుకొని ఎలా ఆనందిస్తున్నావో---- అలాగే నీనిజస్వరూపానుభవాన్ని చూచి చాలకాలమైనదనుకున్నప్పటికీ మరేం ఫరవాలేదు నాయనా! నా నిజతత్త్వం తెలుసుకున్న వెంటనే నీనిజస్వరూపాన్ని నాలో చూస్తావు నన్ను నీనిజస్వరూపంలో చూస్తావు. నేను నీవేనని, నీవు నేనేననీ గుర్తిస్తావు. నీవు నీవే అయిన నీలోనే ఉంటావు-ఆనందిస్తావు.

**జ్ఞానం లబ్ధ్వా పరాంశాన్తిమ్, అచిరేణాధిగచ్ఛతి.** (గీ4-39)
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా, విశతే తదనన్తరమ్.** (గీ18-55)

కనుక, ఇట్లా చెప్పావేమిటి అని అనవద్దు, ఫిర్యాదు చెయ్యవద్దు, శంకలు రానీయకు, జగత్తుకూ-నీకోరికలకూ బానిసవు కావద్దు, జగత్తుమ

కాలదన్నిపారెయ్యగల ధీరత్వం సంపాదించు.

అభాసవాసనయా బహిర్ముఖాయమానాం ధియం
రాతి నిగృహ్ణాతి స్వాకారేణైవ స్థాపయతి ఇతి ధీరః
స్వనిష్ఠా ఽవ్యభిచరితబుద్ధివృత్తిరిత్యర్థః.

నీ నిజస్వరూపం=నిజానుభవాన్ని విడిచి-- ఇంకొకటి ఏదో కావాలనీ, ఇంకదేనిలోనో ఏదో కావలసినది ఉన్నదనే అభాసవాసనచేత ఎక్కడికో పోబోయి సంసారంలో చిక్కుకొనే బుద్ధిని నిగ్రహించి నీనిజస్వరూపంలో నిలపగలగటమే ధీరత్వం. ఇదే ధీరులలక్షణం అన్నారు భగవంతుడూ - శ్రుతులూ-శాస్త్రాలూ.

**శంకలు తీరిపోయినయ్ జిజ్ఞాసువులకు**

# అయినా అర్థంకావటం లేదు

**అన్నారు, అంటున్నారు సాధారణంగా అందరూ.**

ఊరికే ఏదేదో ఉన్నదనుకొని ఊహించుకోవటం ధీరులలక్షణం కాదు నాయనా! ఇంత విస్తృతంగా చెప్తే అర్థంకాకపోతే క్లుప్తంగా చెప్పిన మాటలు విను.

బ్రహ్మ సత్యం జగన్మిథ్యా. (ని.ఉ.)

బ్రహ్మయే నీ నిజస్వరూపమనీ, నీ నిజస్వరూపాన్నే గమ్యంగాచూపిస్తూ చెప్పేవిచారణ అర్థంకాకపోతే, కనీసం మాటైనా జ్ఞాపకం ఉంచుకో. బ్రహ్మయే సత్యం, జగత్తు లేనిదే ఉన్నదానివలె కనిపిస్తున్నది (మిథ్యా). నీవు నిజంగా బ్రహ్మతత్త్వాన్నే కోరిన వాడవైతే ఈమాటను జ్ఞాపకండుంచుకొని అభ్యాసం చెయ్యమంటున్నయ్ శ్రుతులు.

# అయినా అర్థంకావటం లేదు

**అన్నారు అంటున్నారు సాధారణంగా అందరూ**

ప్రత్యక్షంగా కనిపిస్తుంటే లేదంటారేమిటి? ఇదెక్కడ న్యాయం? ఎలా నమ్మాలి? ఏదైనా జగత్తు ఉన్నదనే మాటలు చెప్పమన్నారు.

**III** అనిత్యమసుఖం లోకం, ఇమం ప్రాప్య భజస్వ మామ్. (గీ9-33)

పోనీ మీరన్నట్లు జగత్తు ఉన్నదనుకుందాం కాస్సేపు. ఇలా ఉన్నదనుకోవటంలో ఒక చిన్నరహస్యం= మీకుతెలియనిది చెప్తావినండి.

**ఈ లోకం అనిత్యం, అసుఖం**

కాఫీ అనిత్యం, శాశ్వతంగా ఉండేది కాదు, కాఫీవల్ల నీవు శాశ్వతంగా

ఉండేవాడవూ కావు, కాఫీలో సుఖంలేదు. కాఫీ శాశ్వతసుఖాన్నివ్వదు. త్రాగినప్పుడు దేహంలో కొంతచైతన్యం కలిగినట్లుగా అనిపించి, తన అధీనంలోకి నిన్ను లాక్కొని మళ్ళీమళ్ళీ త్రాగమంటుంది. రెండురోజులయిన తర్వాత అలవాటుచేయించి కాఫీలేకపోతే చైతన్యమే లేదనీ, తలకాయనొప్పి వస్తుందనీ, ప్రాణమే పోతుందనీ, జగత్తే తిరిగిపోతున్నదనీ నీచేత అనిపిస్తుంది, ఇలా దుఃఖకారణం అవుతుంది. ఇలాగే సిగరెట్-సినిమాలూ-క్రొత్తబట్టలూ-విలాసాలూ - ఇలాగే వీటిననుభవించే దేహేంద్రియమనోబుద్ధులుకూడా అనిత్యం, శాశ్వతంగా ఉండేవి కావు. ఎప్పుడూ తుమ్ముతూ-దగ్గుతూ రోగాలచేత పీడింపబడటమే కాక, ఎప్పుడూ ఏవేవోకావాలని నిన్నువేధించి-పరుగెత్తించి దుఃఖకారణమవుతున్నయ్. కోరినవి దొరికినా-దొరకకపోయినా కష్టమే. దొరికితే సుఖమనీ, దొరకకపోతే దుఃఖమనీ, దుఃఖంలో కోపం-మాత్సర్యం, దొరికినా లోభం-మోహం-మదం-అంతా అసుఖమే-అనిత్యమే, ద్వంద్వాలన్నీ సంసారకారణాలే. కనుక నన్ను భజించు, నన్నుపొందటానికి ప్రయత్నించు, జగత్పదార్థాలను పొందటానికి ప్రయత్నించకు.

**శంకలు తీరినయ్ జిజ్ఞాసువులకు.**

## అయినా అర్థంకావటం లేదు

**అన్నారు, అంటున్నారు సాధారణంగా అందరూ.**

ఎలా భజించాలి? ఎలా ప్రయత్నించాలి? అదేదో అడవులకు పోయి ఆకులూ-అలములూ తింటూ, ఘోర తపస్సు చెయ్యాలిట గదా! ఇప్పుడెలా వీలవుతుంది? ఎలా చెయ్యాలి? అన్నారు.

బ్రహ్మసత్యం జగన్మిథ్యేతి అపరోక్షజ్ఞానాగ్నినా, బ్రహ్మాది-ఐశ్వర్య
ఆశాసిద్ధ-సఙ్కల్పబీజ-సన్తాపరూపం తపః. (నిరాలంబఉపనిషత్తు)

బ్రహ్మయే సత్యం. సత్యమైన బ్రహ్మమే కావాలి-- జగత్తు లేనిదే ఉన్నదానివలె కనిపించి నన్ను ఏడిపిస్తున్నది-- ఈజగత్తు నాకువద్దు--- అనిపదేపదే మననంచేసి, జగత్పదార్థాలతో సంబంధాన్ని తెగతెంపులు చేసుకోమనీ, జగత్పదార్థాలను కోరేబుద్ధిని(మనస్సును) నిగ్రహించమనీ సర్వశాస్త్రాలు చెప్తున్నధోరణిని విశ్వసించి-ఆచరించి, నిరంతర అభ్యాసపూర్వక ఆచరణచేత, క్రమంగా, చతుర్ముఖబ్రహ్మగారి ఉద్యోగం ఇస్తానన్నా వద్దనే ధీరత్వం సంపాదించాలి. ఈమాటను ఇంతతేలికగా చెప్పటంలేదు నాయనా శ్రుతులు.

చతుర్ముఖ బ్రహ్మగారి ఉద్యోగం అంటే--- చతుర్దశభువనాలనబడే వాటిలో ఇంతకంటే పెద్దఉద్యోగం ఇంకొకటిలేదు. అది ఎంతపెద్ద ఉద్యోగమయినా బంధకారణమేనని గ్రహించి తిరస్కరించమంటున్నయ్. ఈ బ్రహ్మాదిఐశ్వర్యాలు వస్తవని గ్యారంటీ చెప్పడంలేదు. వచ్చినప్పుడెప్పుడో

వద్దనమనీ చెప్పటంలేదు. ఎప్పుడైనా పొరపాటునైనా- ఏగ్రహబలంవల్లనో-దైవానుగ్రహంవల్లనో-పెద్దలఆశీర్వాదబలంచేతనో-నీప్రారబ్ధంవల్లనో వస్తుందేమో, రాకనేపోతుందా అనే ఆశనుకూడా దగ్గరకు చేరనివ్వకు అంటున్నయ్. అంతేకాదు, ఆశఉంటే ఆశవల్ల ఐశ్వర్యం వస్తే బాగుండును, అనే సంకల్పం=కోరిక కలిగి, వస్తే నేనెల ఉంటాను? ఎలా ప్రకాశిస్తుంటాను? నన్నుగురించి అందరూ ఏమనుకుంటారు? ఎలా గొప్పగా చెప్పుకుంటారు? అని అనుకోవటమూ, ఈ సంకల్పానికి అంకురం=బీజం ఉండి, బీజస్వరూపంలో సంకల్పాలు చేయించి, ఆశలుకల్పించే ఈ ప్రవృత్తినంతా

**బీజరూపంలో మాడ్చి పారెయ్యమంటున్నారు**

ఇదే తపస్సు నాయనా!

ఇలా తపింపచెయ్యటం =ఎండకొట్టి=మాడ్చిపారెయ్యటమే తపస్సు. వేగి-మాడిన బీజం, ఏ భూమిలో ఎంత ఎరువువేసి ఎన్నినీరుపోసినప్పటికీ ఎలా మొలకెత్తదో అలాగే, మాడిపోయిన ఆశాబీజం, మళ్ళీ జగత్తుగానూ-ఐశ్వర్యభోగాలుగానూ మొలకెత్తదు, జగద్భావం నాశనమవుతుంది, సంసారపీడ విరగడవుతుంది. కనుక ఎన్నెన్ని జగత్పదార్థాలగురించీ-ద్వంద్వభావాలగురించీ ఎన్నెన్నివిధాలుగా గతంలో విచారించావో-ఆనందించి-అనుభవించావో, ఏడ్చి మళ్ళీమళ్ళీ చెప్పుకుని తృప్తిపడ్డావో, వాటిఅన్నిటిలో వసించుకుకూర్చున్న ఆశాబీజాన్ని మాడ్చిపారెయ్యాలి, మళ్ళీ మొలకెత్తకుండా (సంతాపం) బాగా మాడ్చిపారెయ్యాలి.

సరే, ఏదో మీరు చెప్పారుకనుక, శ్రుతులు చెప్తున్నయ్ అని అన్నారు కనుక చూస్తా-ప్రయత్నిస్తా- చేతనైనంతవరకు చేస్తా-అందినంతవరకు పట్టుకుంటా అని చప్పచప్పగా కబుర్లుచెప్తే జరిగే పనికాదు నాయనా! ఒక విజయదశమికి ముహూర్తంపెట్టి కొంచెం ఏదో చేశాను, ఒకగంటసేపు తత్త్వవిచారణ శ్రవణంచేశాను మళ్ళీవచ్చే విజయదశమికి ఇంకొకగంటసేపు శ్రవణంచేస్తాను. ఆ ఒక్కరోజు మాత్రం కాఫీ మానేస్తాను అని బేరాలడితే అయ్యే పనికాదు నాయనా! చొక్కాలోకి ఎఱ్ఱచీమలు దూరితే, ముందేచూచి వాటినిదులిపి చొక్కా తొడుక్కునేవాడు బుద్ధిమంతుడు. తొడుక్కున్నతర్వాత చీమలు కుట్టున్నప్పటికీ, శరీరమంతా బొబ్బలెక్కుతున్నప్పటికీ, ఈ విజయదశమికి ఒకచీమ తీసేశాను, మళ్ళీ విజయదశమికి ఇంకొకచీమ తీసేస్తాను. చూస్తా-ప్రయత్నిస్తా-చేతనైనంతవరకు చేస్తా అని అనేవాడిని ఏమనాలి? వట్టి మూర్ఖుడనాలి కదూ! తొడుక్కునేటప్పుడు చూడకపోయినా, కుట్టున్నప్పుడైనా చొక్కావిప్పి అన్నిచీమలను దులిపేవాడు మేలుకదూ ఈమూర్ఖుని కంటె. అలాగే, తత్త్వం అర్థంఅయి నీనిజానుభవంలో ఉండలేక పోయినా, ఇలా లేనందువల్ల సంసారం పొడిచి-కుట్టి-బాధిస్తుంటేనైనా తెలుసుకొని, సంసారకారణాలైన ఆశలనన్నిటినీ ఒక్కసారిగా మాడ్చిపారెయ్యమంటె చూస్తా-

ఎప్పుడోచేస్తాననే మూర్ఖుడికి ఎలా చెప్పాలి? ఒక ఆశ విడిచేలోపుగా క్రొత్తవి వెయ్యివచ్చి ఒక్కసారిగా ముసురుతున్నయ్. కామములు భోగించినకొద్దీ పెరుగుతూనే ఉన్నయ్. ఇదుగో ఇప్పుడు ఇది పూర్తిఅవుతుంది. తర్వాత ఖాళీయే, విశ్రాంతిగా అభ్యాసం చెయ్యవచ్చు అని అనుకుంటున్నప్పటికీ, జన్మజన్మలకీ అవిశ్రాంతి రావటంలేదు, అభ్యాసం మొదలు కావటంలేదు. కనుక, ఈతపస్సు ఎలా చెయ్యాలో చెప్తున్నయ్ శ్రుతులు---- జగన్మిథ్యా= జగత్తు లేనిదేఉన్నదానివలె కనిపిస్తున్నది అని మననంచేస్తూ అభ్యాసం చెయ్యమంటున్నయ్. జగత్తు సత్యమని అనుభవిస్తూ, జగత్తుతో సంబంధంలే కుండా ప్రయత్నం చేస్తాననటం సరియైన అభ్యాసపద్ధతి కాదంటున్నయ్. ఎందుకంటె జగత్తు ఉన్నదనుకున్నంతమాత్రంచేతనే నెత్తినెక్కి తాండవం చేస్తుంది.

**కనుక జగత్తు లేదనే అభ్యాసం చెయ్.**

కొంతకాలానికి జగత్తు లేనట్లుగానే ఉన్నది అనే అనుభవం కలుగుతుంది. ఈ అనుభవంతో ఇంకా అభ్యాసంచేస్తే ఇంకాకొంతకాలానికి ఈనమ్మకం ఇంకాకొంచెం దృఢమవుతుంది. ఇలా అభ్యాసం చెయ్యగాచెయ్యగా జగత్తు లేనేలేదనే నమ్మకం సంపూర్ణంగా దృఢమవుతుంది---- అపరోక్షజ్ఞానం=అను భవజ్ఞానం కలుగుతుంది. ఈ అపరోక్షజ్ఞానంలో నీ ఆశాబీజాలన్నిటినీ చిత్తుచిత్తుచేసి మాడ్చి మసిచేసెయ్. ఇదే నిజమైన తపస్సు. ఈతపస్సుకు అరణ్యాలకు పోవలసిన అవసరం లేదు. ఉన్నచోటనే చెయ్యవచ్చు, చెయ్యకూడదని నిషేధం లేదు.

**ముక్తి మిచ్ఛసి చేత్తాత విషయాన్ విషవత్త్యజ** (అష్టావక్రగీత)

ముక్తిపొందాలంటే విషయాలను=ఆశలను విషంవలె విడిచిపెట్టు, అది చేసినవెంటనే ముక్తి నీస్వరూపమే అయిపోతుంది, అని అంటున్నయ్ శ్రుతులూ-సర్వశాస్త్రాలూ.

వేరే మార్గం లేదు
ఎవరికి అర్థమయినా కాకపోయినా
ఎవరు అభ్యాసం చేసినా చెయ్యక పోయినా
వేరే మార్గం లేదని మరీ చెప్తున్నయ్ నాయనా!
ఇలా క్రమబద్ధంగా చెప్తున్నయ్ శ్రుతులూ-సర్వశాస్త్రాలూ.
అయినా శాస్త్రధోరణిని పట్టుకోరు.
తమ కామబుద్ధితోనూ-జగద్భావంతోనూ చూస్తున్నారు.
చెప్పినది వినరు
విన్నా తప్పుగా అర్థంచేసుకుంటారు
పైగా శ్రుతులే చెప్పినయ్ అంటారు

శ్రుతులను కవ్వించి, అయినా అర్థంకావటం లేదని పదేపదే అడిగి, వీరికోసం చెప్పిన కొన్నిమాటలను అసందర్భంగా బయటికితీసి, వాటికి కట్టుకథలు కల్పించుకుంటున్నారు. తాము కల్పించుకున్నవి శ్రుతులే చెప్పినయ్ అంటున్నారు. శ్రుతులు ఒప్పుకొన్నయ్ అని అంటున్నారు ఈ కామకాములు.

కవ్వించి, అన్నీ తామే అనటమంటే ఎలాగో తెలుసా----

చిన్న పిల్లలు ఆడుకుంటూ, ఎగతాళి చేసుకుంటూ, సాధువైన కుర్రవానిని ఆటపట్టించి–కవ్వించి, ఒరేయ్! ఒకటిస్తిని– రెండిస్తిని– అని చెప్పుకుంటూ పోరా! అనంటారు. ఆ కుర్రవాడు ఒకటిస్తిని–రెండిస్తిని–మూడిస్తిని–నాల్గిస్తిని–ఐదిస్తిని–ఆరిస్తిని–ఏడిస్తిని....అని అంటుంటే, మధ్యలో అక్కడ ఆపి, ఎగిరి గంతుపెట్టి, రేయ్! ఎప్పుడు ఏడ్చావురా? ఆహాహా!! ఏడ్చాడుట, ఎలా ఏడ్చావురా? ఎన్నినీళ్ళు కారినయ్‌రా? ఆతర్వాత ఏమైందిరా!!! మీ అమ్మ ఓదార్చిందా! మీఅమ్మ ఒళ్ళో నిద్రపోయావా---అహ్హహ్హహ్హా-- అని అందరూకలిసి పెద్దపెట్టున ఎగతాళి చేస్తారు. పాపం! వాళ్ళు చెప్పినవేవీ చెయ్యలేదు ఆ కుర్రవాడు. అయినా వాళ్ళగోలకు ఎదురుచెప్పలేక అట్లాగే చూస్తూ ఊరుకుంటాడు.

శ్రుతులు చెప్పిన దానిని శ్రద్ధగా వినక, చెప్తున్న గమ్యంను గ్రహించటానికి ప్రయత్నించక, కుంటిప్రశ్నలు వేసి తప్పుగాఅర్థం చేసుకొని, శ్రుతులే చెప్పినయ్ అంటారు.

1 **తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్** అన్న తైత్తిరీయ ఉపనిషన్మంత్రానికి పైన విచారించుకున్న పూర్వాపరాలు గ్రహించక, చెప్తున్నా వినక, మంత్రాన్ని పూర్తిగానైనా చదవక, బ్రహ్మ సృష్టిచేసి సృష్టిలో దూరాడు–ఇరుక్కున్నాడు–క్రిందకూర్చున్నాడు– పైనకూర్చున్నాడు– ప్రక్కగాదూరాడు-- జగత్తుగా మారిపోయినాడు అంటారు.

శ్రుతులే ఇలా చెప్పినయ్ అని అంటారు.

2 **బ్రహ్మణోఽవ్యక్తం...** అన్న త్రిశిఖిబ్రాహ్మణోపనిషన్మంత్ర అంతరార్థం గ్రహించక బ్రహ్మ సృష్టిచేశాడు, జగత్తు ఉండటం సత్యం అంటారు.

శ్రుతులే ఇలా చెప్పినయ్ అని అంటారు.

3 **మయాతతమిదం సర్వం...** అని గీ9–4,5శ్లోకాలలో, నేను జగత్తులో ఉండటమంటే ఏమిటో చెప్తూ, నాకు జగత్తుతో ఏవిధమైన సంబంధమూ లేదనీ, వాస్తవంలో జగత్తు అసలేలేదనీ, వారివారి జగత్తుయొక్క సృష్టి స్థితిలయములకు వారే కారణమనీ, వారి కామమే కారణమనీ సందేహానికి తావేలేకుండా చెప్తుంటే అర్థంచేసుకోక భగవంతుడు జగత్తంతా వ్యాపించి ఉన్నాడు కనుక జగత్తును అనుభవించటమంటే భగవంతుని ఆరాధించటమే అని అంటారు.

పైగా, భగవంతుడే ఇలా చెప్పాడంటారు.

4 త్రిభిర్గుణమయైర్భావైః...అని గీ7-13,14 శ్లోకాలలో మూడుగుణముల మయములైన భావాలలో అందరూ మోహంలో పడుతున్నారు. **వీటికి పరమైన నాతత్త్వం** తెలుసుకోవటంలేదు. వీరి ఈ గుణమయీమాయలో వీరే పడికొట్టుకుంటున్నప్పటికీ మాయకు దివ్యత్వాన్ని ఆరోపించి దైవీమాయ అనీ, ఇంకారెండాకులు ఎక్కువ చదివామనుకొని, అది నామాయ అనీ అరుస్తున్నారు. ఇలా తప్పుడర్థాలు చెప్తున్నారు కనుకనే వీరికి వీరిమాయ దాట శక్యంకాకుండా ఉన్నది. **ఈ గుణమయములైన భావాలకూ, వీరి గుణమయీ మాయకూ అతీతమైన** నన్నే ఎవరు ప్రపత్తిచేస్తారో వారు ఈమాయను దాటుతారు--- అని చాలావిశదంగా చిన్నపిల్లలకుకూడా అర్థమయ్యేటట్లు చెప్తుంటే, **పండితమ్మన్యులు** కొందరు ఏమంటారో తెలుసా! **శ్లోకంలో ఏభ్యః** పరం మామ్ = **వీటికి పరమైన నన్ను** అన్నమాటలు చూడలేని గ్రుడ్డివాళ్ళయి, నేను మాయాశక్తిస్వరూపుడను అని భగవంతుడు చెప్పాడు ఈ శ్లోకాలలో – మాయాశక్తిస్వరూపుడనైన నన్ను ప్రపత్తిచేస్తే మాయను దాటుతారన్నాడు భగవంతుడు అని చెప్తారు. ఓరి మాయదారిమొద్దుల్లారా! మాయాశక్తిని ప్రపత్తిచేస్తే మాయలో పడతారురా! అలాచేసే ఇలా కొలుకురాని కొరివిల్లా తయారయ్యారు. మీమాయ మీకు అర్థంకావటంలేదు–దాటశక్యంకావటంలేదు---- సరిగ్గా కళ్ళుపెట్టుకొని చూడండిరా గుడ్డిఎదవల్లారా! నేనుచెప్పిన మాటలను ముక్కకుముక్క అర్థంతెలుసుకున్నా బాగుపడిపోతారు. పోనీ, ఈ తత్త్వవిచారణా, జగత్తు ఉన్నదీ–లేదు అనే మీమాంస అర్థంకాకపోతే

**అనిత్యమసుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వ మామ్.** (గీ9-33)

అందరికీ–ప్రతిక్షణమూ–జాగ్రత్ అవస్థలోనే ప్రత్యక్షమవుతున్న నిజాన్నైనా గుర్తించండి. ఈ లోకంలో–జగత్తులో ఏవీ నిత్యమైనవీకావు–సుఖాన్నిచ్చేవీకావు. ప్రొద్దున లేచినప్పటినుండి రాత్రి నిద్రపోయేవరకు జాగ్రదవస్థ అంతా, దుఃఖమయం–ద్వంద్వమయం –అన్నీ ఎగుడుదిగుడులే –అంతా గోలయే, ప్రశాంతత లేదు. కనుక ప్రశాంతస్వరూపమైన నన్ను ప్రపత్తిచెయ్యి–– అని భగవంతుడు చెప్తే ఈమాటకూడా అర్థంచేసుకోలేని మట్టిబుర్రలైపోయి---- భగవంతునికి శతకోటివిధాలుగా వారికామాన్ని అంటగట్టి సుప్రభాతాలూ–స్తోత్రాలూ–వ్రతాలూ–నోములూ– యజ్ఞాలూ–యాగాలూ–కర్మలూ–పెళ్ళిళ్ళూ–మతాలూ–మతాచారాలూ– సంగీతనాట్యకళలు అని ఎన్నోపేర్లతో చాలరభసను కల్పించుకొని, భగవంతుని కామమయునిగా సృష్టించుకొని భగవంతుని ఆరాధిస్తున్నామంటున్నారు.

భగవంతునే ఆరాధిస్తున్నామంటున్నారు
భగవంతుడే చెప్పాడు గదా అంటున్నారు

ఓరి గుడ్డిమొహాల్లారా! నేను చెప్పినది ఇదట్రా! మీ కామములనూ జగత్తునూ నాశనం చేసుకోమని చెప్తే, అవన్నీ నామీదనే ఆరోపించి నన్నుకూడా మీలోనే కలుపుకొని, మీ కామములనే ఆరాధిస్తూ, జగద్భావాన్ని పెంచుకుంటూ నన్ను ఆరాధిస్తున్నామంటారేమిరా కుంకల్లారా! పైగా, నేనే చెప్పానంటారేం? నేనేం చెప్పాను? జగత్తు అనిత్యం-అసుఖం కనుక, జగద్భావాన్నీ-కామములనూ నిగ్రహించి వైరాగ్యం అలవాటుచేసుకొని, తద్వారా నన్ను పొందమని చెప్పాను. జగద్భావంనుండి ఎంతెంత దూరం గాపోయి, కామములను నాశనంచేసి వైరాగ్యం పొందుతారో, అంతంతగా నన్ను పొందినవారవుతారు. వైరాగ్యం పొందటమే నన్ను ప్రపత్తిచెయ్యటం, సంపూర్ణవైరాగ్యం పొందటమే నన్ను పొందటం.

అని ఇంతగా ఇన్నిసార్లు నేనుచెప్పినా, శ్రుతులూ-శాస్త్రాలూ చెప్పినా చెవిన పట్టరేమర్రా! అని అంటున్నాడు భగవంతుడు.

**అవ్యక్తం వ్యక్తిమాపన్నమ్, మన్యన్తే మామబుద్ధయః,**
**పరంభావమజానన్తః, మమావ్యయమనుత్తమమ్.** (గీ7-24)

నాతత్త్వం నిజంగా తెలుసుకోకుండా, బుద్ధిలేని వీరు, ఎప్పుడూ నామరూపాలతో వ్యక్తంకాకుండానూ, కామపూరితమైన వారి దేహేంద్రియ మనోబుద్ధులకు వ్యక్తంకాకుండానూ ఉన్న నాతత్త్వం ఒక నామరూపంతో ఉన్నదంటారు. వారి ఇంద్రియభోగాలకు దొరుకుతున్నదంటారు, అని అంటున్నాడు భగవంతుడు. భగవంతునికి నామరూపాలు ఊహించటమే బుద్ధిలేనితనం అని అంటూంటే భగవంతునికే కామంఆరోపించి-ఆనందించే వారిని ఇంకేమనాలి? ఏమేమో కర్మలు దైవీకర్మలనుకుని చేయబోయి, భగవంతునికి కామం ఆరోపించి, తమకామాన్ని మననంచేసి, కామాన్నే ఆరాధిస్తారు, నిష్కామసేవ చేస్తున్నామంటారు. ఇలాంటి దుష్టకర్మలు చెయ్యకపోతే, చక్కగా ఉచ్చారణా సౌష్ఠవంతో

1 ఓం కృష్ణానంద ముకుంద మురారే! వామన మాధవ గోవింద!
శ్రీధర కేశవ రాఘవ విష్ణో! శ్రీనారాయణ చిద్రూప

అనే మంత్రాన్ని ఎప్పుడూ నోట ఉచ్చరిస్తూ, దినసరిగాచేసే పూజాకార్యక్రమంలో, కళ్ళు మూసుకొని, చిత్తం అన్యాయత్తంకాకుండా, ఒక అరగంట సేపైనా ఈమంత్రాన్ని ఉచ్చరించి, తర్వాత

2 కళ్ళు మూసుకొని, మానసికార్చన మంత్రములని ఈ (ప్రతి) ప్రవచనగ్రంథం మొదట్లోచెప్పిన మంత్రములనన్నింటినీ తొందరపడకుండా స్వచ్ఛంగా ఉచ్చరించి, తర్వాత

3 భగవద్గీతా అధ్యాయాలను తొందరపడకుండా ఉచ్చరిస్తూ, కంఠస్థంచేసి కళ్ళుమూసుకొని మననంచేస్తే, సరియైన పూజ-కర్మ అవుతుందని ఎందుకు

గ్రహించరు అందరూ? ఈ పూజ అర్థయుతంగా, మంత్రాల అర్థంమననం చేస్తూ ఆచరిస్తే ఇంతకంటే సత్కర్మ ఉంటుందా?

4 నిర్గుణతత్త్వం అర్థంకాదు, భగవంతునికి ఆకారం లేకపోతే మనస్సు నిలవదనుకుంటే, సాకారఅర్చన మంత్రాలనే, కళ్ళుమూసుకొని

**ఓం శ్రీకృష్ణాయ నమః** అని ఉచ్చరించి, మనస్సులో శ్రీకృష్ణవిగ్రహాన్ని ప్రతిష్ఠచేసుకొని, శ్రీకృష్ణునికి నమస్కారం చెయ్యి. మనస్సులోనే-మానసికంగా వెయ్యి సాష్టాంగనమస్కారాలు చెయ్యి.

ఆకారాన్ని చూడు

**ఓం బర్హిబర్హావతంసకాయ నమః** అని ఉచ్చరించు. అందంగా ఉన్న నెమలిపింఛం చూడు. ఇంకెక్కడా అందంలేదనీ ఆపింఛంలోనే అందం ఉన్నదనీ నీ మనస్సుకు చెప్పు.

**ఓం కిరీటకుణ్డలధరాయ నమః** ధగధగమెరిసే కిరీటం చూడు, చెవులకున్న కుండలాలు చూడు. ప్రకాశం అంటే ఇదేననీ, ఇంకెక్కడా ప్రకాశం లేదనీ నీ మనస్సుకు చెప్పు.

**ఓం ఫుల్లారవిన్దనయనాయ నమః** చక్కగ వికసించి ఆనందాన్ని కురిపిస్తున్న కళ్ళుచూడు. ఆనందమంతా ఆ కళ్ళలోనే ఉన్నదనీ వేరెక్కడా లేదనీ నీ మనస్సుకు మరీమరీ చెప్పు. కనిపిస్తున్నప్పటికీ చూడలేని నీగ్రుడ్డికళ్ళను బాగా చూచి అలా ఎప్పుడూ వికసించి ఉండమని ఆదేశించు.

**ఓం మన్దస్మితవదనాయ నమః** చిరునవ్వు చిందించే మోము చూడు. నిన్ను నవ్వించి, నీదుఃఖం పటాపంచలుచేసే ఆ ముఖమూ-నవ్వూ కంటే మరెక్కడా ఆకర్షణలేదని నీ మనస్సుకు మరింతగా చెప్పు, నీ ఏడుపుముఖాన్ని ఆచిరునవ్వును చూచి వికసించనివ్వు.

**ఓం మురళీనినాదాహ్లాదాయ నమః** మురళీస్వరం విను. ఆ ధ్వనిలోనే సప్తస్వరాలూ-సర్వరాగాలూ పలుకుతయ్. బాగావిను. విని, భక్తిలేని నీ పీకుడుసంగీతం విడిచిపెట్టు, కూనిరాగాలకు స్వస్తి చెప్పు. ఏమీలేని మురళిలోనుండి శ్రావ్యమైన సంగీతం వినిపించినట్లే, జగత్తులేదనే భావంలో ఆనందమంతా ఉన్నదన్న కృష్ణుని బోధను ఆలకించు.

**ఓం కౌస్తుభమణిభూషితాయ నమః** దేదీప్యమానంగా మెరుస్తున్న ఆభరణం కౌస్తుభమణిని చూడు. నిండువిగ్రహానికి అలంకారమైన ఈఆభరణం చూచి తృప్తిచెందు. నీకేమైనా ఆభరణాలుంటే వెంటనే విడిచిపెట్టు-తీసెయ్-ఒలిచెయ్. కృష్ణుని ఆభరణంచూచి తృప్తిపడవే, ఈ ఆభరణాలతో నీకేంపని అని చెంపపగలగొట్టి చెప్పు నీ మనస్సుకు.

**ఓం దివ్యమాల్యామ్బరధరాయ నమః** ఎన్నటికీ వాడని పూలమాలలను చూచిచూచి ఆనందించు. నీవు అలంకరించుకున్న పూలమాలలు

తత్క్షణం విసిరిపారెయ్. కృష్ణుడు ధరించిన మాలలోనే ఆనందం ఉన్నది, అది చూచి తృప్తిపడు, నీకెందుకు ఈషోకులు మనసా అని నీ మనస్సుకు గడ్డిపెట్టు.

**ఓం తులసీదామశోభితాయ నమః** అన్నిమాలల మధ్య, ఆకుపచ్చవర్ణంతోనూ-విశిష్టమైనసువాసనతోనూ శోభాయమానంగా ఉన్న తులసీమాలతో ఆకృష్ణుని అందం చూడు. శోభలన్నీ కృష్ణునిలోనే ఉన్నయ్. చూచి ఆనందించక నీకు శోభలెందుకు? ఎందుకే అలా ఊరికే కులుకుతావు మనసా అని ఇంకాకొంచెం గడ్డిపెట్టు.

**ఓం దివ్యమాల్యామ్బరధరాయ నమః, ఓం పీతవాససే నమః** ఎప్పుడూ మాసిపోని అంబరములను చూడు. పీతాంబరం చూడు, కట్టుకున్న మరుక్షణం వాడి-మాసిపోయే క్రొత్తబట్టలతో ఎందుకే మురిసిపోతావు? పండగకు క్రొత్తబట్టలు కావాలని చచ్చేదాకా ఎందుకు ఏడుస్తావు? కృష్ణుని పీతాంబరం మరొక్కసారిచూచి తృప్తిపడవే రాక్షసీ! అని నీమనస్సును చిత్రవధచెయ్.

**ఓం విన్యస్తపాదయుగళాయ నమః** ఒక పాదంమీద ఇంకొకపాదంవేసి వయ్యారంగా నుంచుంటేనే నాట్యం చేసినట్లు ఉన్నది. ఇంక ఒళ్ళు వంకరులుగా త్రిప్పుతూ నీకు భరతనాట్యమెందుకు మనసా అను.

**ఓం దివ్యమఙ్గళవిగ్రహాయ నమః** దివ్యమంగళవిగ్రహం - కృష్ణుని తనివితీర చూచి తరించక, గవులుకంపుకొట్టే దేహాన్ని అద్దంలో చూచి మురిసి పోతావేమే వెర్రిమొగమా? ఇంకో గవులుకంపుకొట్టే దేహాన్ని కౌగిలించుకొని ఆనందిస్తున్నానంటావేమే బుద్ధిలేనిదానా?

**ఓం బ్రహ్మచారిణే నమః** పోనీ కృష్ణుని కౌగిలించుకుంటే కామతృప్తి అవుతుందనుకోకు, కృష్ణునితో కేళిసలిపి గోపికలు కామతృప్తిని పొందారనే కథలు వినకు-చెప్పకు. 16000మంది రాజకన్యలనూ- కొసరుఎనిమిదిమందినీ పెళ్ళిచేసుకున్నాడని చెప్పే కథలే, కృష్ణుడు అస్ఖలిత బ్రహ్మచారి అని చెప్తున్నయ్. మరి ఒకభార్యా-ఒకభర్తతోనే నీవు వ్యభిచారివయినావు, రెండుభావాలూ సమన్వయించుకొని నీకామం మాడ్చిపారెయ్.

**ఓం కళఙ్కరహితాయ నమః** కృష్ణునికి దేహం ఉన్నట్లు ఇలా ఆకారం చూచినప్పటికీ, పుట్టటం-పెరగటం-చావటం-మొదలైన కళంకములు లేవు. అజ్ఞానకారణంగా పుట్టి, అజ్ఞానంలోనే పెరిగి, అజ్ఞానంలోనే నాశనమై, మళ్ళీ అజ్ఞానకారణంగా పుట్టే సర్వులదేహంవలె కాదు కృష్ణస్వరూపం. అజ్ఞానంతో సంబంధం అనే కళంకం లేదు కృష్ణపరమాత్మకు, కృష్ణుని నీవు నిజంగా కోరితే ఈ కళంకం నీకు మాత్రం ఎందుకు? అజ్ఞానం పటాపంచలుచేసుకో, కృష్ణతత్త్వం తెలుసుకో, ఈ జననమరణప్రవాహరూప సంసారకళంకం వద్దని ఆకృష్ణుని సన్నిధిని గోలపెట్టు. ఆర్తి ఉండాలి సుమా!

**ఓం లీలామానుషవిగ్రహాయ నమః** అకారమేలేని కృష్ణుని = కృష్ణతత్త్వంను, గ్రహించలేని నీకోసం మనుష్య అకారంలో ఉన్నవానివలె గోచరమవుతున్నది గానీ, సంసారంలో చిక్కుకున్న నీ ఆకారం = స్వరూపంలాంటిది కాదు కృష్ణతత్త్వం. కృష్ణతత్త్వాన్ని కోరి దేహభావం విడిచిపెట్టు.

**ఓం మాయామానుషచారిత్రాయ నమః** నామరూపాలతోటి కృష్ణునిగురించి చెప్పిన కథలన్నీ మాయాచరిత్రలు, కృష్ణుని=కృష్ణతత్త్వంను పొందాలంటే ఈకథలు సహాయపడవు సరికదా, ప్రతిబంధకాలు. కృష్ణతత్త్వం తెలుసుకో కుండా, గోపికాకృష్ణుల నిజసంబంధాన్ని గుర్తించకుండా కృష్ణుడు గోపికలతో కేళిచేశాడనీ, వారికి మన్మథసుఖాన్నిచ్చాడనీ పాటలుపాడితే నాశనమవుతావు.

**ఓం సంసారవైరిణే నమః** ఏ పరిస్థితిలోనూ ఎవరూ జగద్భావంలోకి జారిపడటమూ, జగత్తు సత్యమని అనుకోవటమూ, చర్వితచర్వణంగా అనేకదేహాలతో జన్మలెత్తిజగద్భావాన్ని పెంచుకొని సంసారం పెంచుకోవటాన్నీ ససేమిరా సహించలేని తత్త్వం. సంసారానికి శత్రువు. కృష్ణదర్శనమాత్రంచేత సంసారం నాశనమవుతుంది. కృష్ణుని దర్శనంచేసుకున్నా సంసారంపోలేదంటే అది నీ దృష్టిలోపమే. కృష్ణునిలో లోపంలేదు. నీకు కృష్ణుని చూడటం చేతకాలేదు.

**ఓం గీతాఽమృతమహోదధయే నమః** అమృతత్త్వాన్ని ప్రసాదించే తత్త్వాన్ని బోధించాడు. శాస్త్రసారాన్ని జ్ఞానవిజ్ఞానసహితంగా చెప్పాడు. నీలోని కోరిక లన్నీ విడిచిపెట్టమన్నాడు. అదే సాంఖ్య-కర్మ-జ్ఞాన-సన్న్యాస- ధ్యాన- జ్ఞానవిజ్ఞాన- అక్షరబ్రహ్మ- రాజవిద్యారాజగుహ్య- విభూతి- విశ్వరూప దర్శన- భక్తి- క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ- గుణత్రయవిభాగ- పురుషోత్తమప్రాప్తి, దైవాసురసంపద్విభాగ, శ్రద్ధాత్రయవిభాగ, మోక్షసన్న్యాసయోగములు అవి అన్నాడు. ఇన్ని యోగాలలో వేరేవేరే మార్గాలు లేవు. ఈ భిన్నత్వం భగవంతునిలో లేదు. ఈ భిన్నమార్గాలకన్నిటికీ ఒకటేకారణం, అదే కామం. కామములనన్నిటినీ నిగ్రహించటమే మొదటికర్మ, అదే చివరి కర్మ. అన్ని కామములూ అని అంటున్నాడే కానీ కొన్ని కాదు. ఇన్ని విభిన్నమార్గాలను ఊహించుకొని ఏదిముందు-ఏదివెనుక అని కాలయాపనచెయ్యక అపలుకా రణమైన కామములనన్నిటినీ నిగ్రహించమని సమస్యాపరిష్కారం చేశాడు భగవంతుడు= కృష్ణపరమాత్మ.

**ఓం మోక్షైకప్రదాయ నమః** నేనిచ్చేది ఒకటే, అదే మోక్షం. ఇంక ఏఐశ్వర్యాలు ఇవ్వను. నీ ఐశ్వర్యభోగాల అనుభవంతో నాకెట్టి సంబంధమూలేదు. నీ వ్యవహారాలతోనూ సంబంధం లేదు. నన్ను కోరి, నావద్దకువచ్చి అడిగితే మోక్షం ఇచ్చేస్తా, ఉదారంగా ఇచ్చేస్తా అడిగినంతమాత్రంచేత ఇచ్చేస్తా. కానీ నేను చెప్పిన విధంగా అడగాలి. అన్ని కోరికలనూ విడిచి అడగాలి. ఇలా మోక్షంకంటె ఇంకవిమీవద్దని, అన్ని కోరికలనూ విడిచి అడగాలి.

అడగకపోతే నేను ఇచ్చినా అది నీకు కనపడదు-లభించదు. కామం నీలో ఏమూల-ఏకొంచెం దాక్కున్నా నేనిచ్చిన మోక్షం నీకు కనపడదు.

**ఓం జగద్గురవే నమః** అందరికీ, జగత్తుకంతకూ ఏకైక గురువు. సర్వులలో అపాదమస్తకం నివసించి, అనుక్షణం అజ్ఞానాన్ని నాశనంచేసి జ్ఞానాన్ని బోధిస్తున్నాడు. వారివారి అనుభవాలవల్లనే నాశనంచేసి జ్ఞానాన్ని బోధిస్తున్నాడు. వారివారి అనుభవాలవల్లనే వారికి తెలిసేటట్లుగా చేస్తున్నాడు. వారి అనుభవాలలో కాదుగదా, శాస్త్రప్రమాణంతో నాలుగు బోధవాక్కులు చెప్పటం చేతకాకపోయినా జగద్గురుపీఠాన్ని అలంకరించానని అహంకరిస్తే అధోగతిపాలవుతావు మనసా!

**ఏ విభు-పాదపద్మ-భజనోత్కర్షంబులన్**
**తత్త్వవీక్షణముం జేసెదరు, విబుధుల్.** (భాగవతం)

ఈ విధంగా మననం చెయ్యి. సాకారమూర్తిని ఊహించినా, ఈవిధంగా తత్త్వం గ్రహించటానికి దోహదమిచ్చేటట్లు మననంచెయ్యి. నీకామం నాశనంకావటానికి ప్రయత్నంచెయ్యి.

సర్వే మనోనిగ్రహ-లక్షణాన్తాః (భాగవతం)

సర్వకర్మలూ అశుద్ధమై-కామపూరితమైన నీ మనస్సును నిగ్రహించి తద్వారా మోక్షసౌభాగ్యం పొందటానికే ఉపకరించాలి. అలాకాకుండా నీకామం భగవంతునికి అంటకట్టి, నీకర్మలద్వారా నీకామమునే మననంచేస్తూంటే ఈకర్మలు నిన్ను నాశనం చేస్తయ్. బాగా విచారించుకో;

**ఇంతకంటె మెట్టుదిగి నీకు చెప్పవలసినదేమీ లేదు, అని చెప్తున్నయ్ శ్రుతులూ-శాస్త్రాలూ.** శాస్త్రసారాన్ని క్లిష్టంగా మననంచేస్తే, సర్వశాస్త్రాలు ఏంచెప్పటానికి ప్రయత్నిస్తున్నవో తెలుసుకొనే దృష్టితో సమన్వయం చేసుకుంటూ మననంచేస్తే, శాస్త్రాన్ని అమూలాగ్రం SCANNING చేస్తే

నీకామమే నీకు అడ్డువస్తున్నదనీ
కామం సంపూర్ణంగా నిగ్రహింపబడితే
నీవు పొందగోరేది = మోక్షం తప్పకుండా పొందుతావనీ
కామం ఏకొంచెం ఉన్నా అది సర్వత్ర ప్రతిబంధకమేననీ

అర్థమవుతుంది నాయనా! శాస్త్రం చెప్తున్న ఈతత్త్వవిచారణను సూత్రప్రాయంగా మూడుమాటలలో మననంచెయ్యాలంటే----

**I** స్వానుభవైక వేద్యం నిన్ను నీవే నీలోనే నిన్నే చూచి నీవే అయిఉండటమే నీ నిజస్వరూపం=నీ నిజానుభవం. ఇదే కైవల్యం. ఈ అనుభవంలో ఇంకకొపదార్థం లేదు, ఇంకొకపదార్థాన్నికోరే కామంలేదు. ఈ అనుభవం నీ నిజస్వరూపదృష్ట్యా అర్థంకాకపోయినా, నీ ప్రస్తుతఅనుభవదృష్ట్యా

సుషుప్తిఅవస్థలో గోచరమౌతూనే ఉన్నది. సుషుప్తిలో ఇంకొకపదార్థంలేదు, ఇంకొకపదార్థాన్నికోరే కామమూ లేదు. అయినా నీవున్నావు కదూ! హాయిగా ఉన్నావు కదూ! కనుక, సుషుప్తితో పోల్చుకొని, ఏవీలేకపోయినా నీవేఉండటం-హాయిగాఉండటం అనే అనుభవాన్ని అర్థంచేసుకొని, సుషుప్తిఅవస్థలోని తమోగుణాన్ని విడిచి, జాగ్రదవస్థలోకూడా ఇంకొకపదార్థంలేకుండా, ఇంకొక పదార్థాన్ని కోరే కామంలేకుండా ఉన్న నీఉనికిని గుర్తించు.

**II** నిన్ను నీవే నీలోనే నిన్నే చూచి నీవేఅయి ఉండటం చేతకాక ఇంకొక పదార్థంకావాలి అని కోరి, **ఇంకొకపదార్థం** క్రమంగా **అనేకపదార్థములుగా** అయి నీదృష్టిలో అనేకపదార్థసహిత జగత్తే సత్యమైనదిగానూ, నీనిజానుభవం లేనిదిగానూ కనిపించినా, వాస్తవంలో ఈ అనేకపదార్థాలూ-జగత్తూ లేవు, ఇంకొకపదార్థం కూడా లేదు, నీవే ఉన్నావు. ఈనిజంకూడా నీ ప్రస్తుతఅనుభవంలో నీకు తెలుస్తున్నదే. స్వప్నావస్థలో (నీకంటెవేరుగా) ఇంకొకపదార్థమూ- అనేకపదార్థాలూ కనిపించి, స్వప్నావస్థలో అవే సత్యమైనవిగానూ, (జాగ్రత్తులోని) నీ(దేహ)నిజస్వరూపం లేనిదిగానూ గోచరించినా, వాస్తవంలో స్వప్నం(ఇవేవీ) లేదు, నీవే ఉన్నావు. కానీ స్వప్నావస్థలో కూడా నీవే ఉన్నావనీ స్వప్నావస్థ అంతా కల్పితమనీ, స్వప్నావస్థలోని నీదేహానికి గాయం తగిలినా నీనిజదేహానికి గాయం తగలలేదనీ, కనీసం మచ్చకూడా అంటుకోలేదనీ, స్వప్నావస్థలోని నీఅనుభవాలేవీ నీనిజఅనుభవాలు కావనీ, వాటినిగురించిన చిహ్నాలేవీ మిగలలేదనీ, నీస్వప్నావస్థ పూర్తిఅయి స్వప్నం=ఊహ నాశనమయిన తరువాత అర్థమవుతున్నది.

అలాగే, ఇంకొకపదార్థంకావాలి అని కోరి, అనేకపదార్థాలనుకల్పించుకొనే నీకామం నాశనమయితే, ఉన్నది నీవేననీ, నిన్ను నీవే నీలోనే నిన్నే చూస్తూ నీవే అయి ఉన్నావనీ, నీకంటె వేరేపదార్థం లేదనీ, వాటిని గురించిన చిహ్నాలూ-ఛాయలూ కూడాలేవనీ అర్థమవుతుంది. స్వప్నం సత్యమని అనుకున్నంతవరకు నీరూపం నీకెలా కనపడలేదో, అలాగే నీకామం ఉన్నంతవరకు నీనిజానుభవం నీకు గోచరించదు, లేని జగత్తే ఉన్నదానివలె నీకు కనిపిస్తుంటుంది. కనుక నీ కామాన్ని మొదట్లోనే మట్టు పెట్టు. ఇంకొకటిని కోరినప్పుడే నాశనంచేస్తే అనేకములను కల్పించదు.

**III** అలా చెయ్యలేక పోయాను. నా జగత్తు అనేకపదార్థసహితమయిపోయింది, ఈ జగత్తు లేనిదేఉన్నదానివలె కనిపిస్తున్నదని చెప్పినా అర్థంకావటంలేదు. విచారణ అర్థమయినా అనుభవానికి రావటంలేదు, ఇప్పుడేం చెయ్యాలి? అని సవినయంగ అంటే విను. ఈజగత్తు-నీజగత్తు-జగత్పదార్థాలు అన్నీ **అనిత్యములూ-అసుఖములూ అని తెలుసుకొని** వాటినివిడిచి నన్ను పొందటానికి అభ్యాసంచెయ్యి. వాటియందు వైరాగ్యమే నన్ను పొందటమని తెలుసుకో---- నన్ను పొందటమంటే నాలో-నీలో-జగత్తులో-సర్వత్ర

నీకామాన్ని అంటకట్టటం కాదని బాగాతెలుసుకో---- ఇలా అంటకట్టే నాశనమవుతావనికూడా స్పష్టంగా తెలుసుకో---- వైరాగ్యంపెంచుకో అని చెప్పిన భగవంతుని వాక్యాలను తు-చ తప్పకుండా ఆచరించు. ఈసంగతికూడా నీ ప్రస్తుతఅనుభవంలో నీకు తెలుస్తున్నదే. నీజాగ్రదవస్థలో ఏ పదార్థమూ శాశ్వతంగాఉండేది కాదనీ, శాశ్వతసుఖాన్నిచ్చేది కాదనీ, ఆశరేకెత్తించి మోసంచేసేవేననీ, ప్రత్యక్షంగా తెలుస్తూనే ఉన్నది కదూ! సిగరెట్ త్రాగనివాళ్ళకు, సిగరెట్మీద కోరికలేనందువల్ల సిగరెట్ (త్రాగే వారికి సిగరెట్తో ఉన్న) జగత్తులేదు కదూ! అంటె సిగరెట్జగత్తు సిగరెట్కోరికలలోనే ఉన్నది. సర్వజగత్తు సర్వజగత్తును కోరే కోరికలోఉన్నది, అర్థమవుతున్నది కదూ! అర్థమవుతున్నప్పటికీ అర్థంకాని మొద్దువలె ప్రవర్తించక అన్నికోరికలను నాశనంచెయ్యి. బలవంతగానైనా మట్టుపెట్టు. అలా చెయ్యవచ్చునో-లేదో, చేస్తే ఏమౌతుందో, ఎవరికైనా అపకారం కలుగుతుందేమో, అలాగే ఎందుకు చెయ్యాలి, ఇలా ఎందుకు చెయ్యకూడదు, కొంతచేస్తే చాలదా అనిఅంటూ వెధవకబుర్లు చెప్పకు, కుతర్కం చెయ్యకు---- ఇలా శ్రుతులూ-శాస్త్రాలూ చెప్పినయ్, చెప్పినదానిని శ్రద్ధగా వినక, చెప్పిన గమ్యం గ్రహించటానికి ప్రయత్నమేచెయ్యక, చెప్పేధోరణిని ACCENT OF SAYING పట్టుకోక, ఎన్ని ఉదాహరణలతో వివరించినా, ఉదాహరణకు విపరీతపుటర్థాలు ఊహించారు-ఊహిస్తున్నారు. ఏతత్త్వం చెప్పటానికి ఉదాహరణలు చెప్పారో గ్రహించలేదు. జగత్తూ-కోరికలూ అంటూ వాటినేపట్టుకొని వ్రేళ్ళాడుతున్నారు. జగత్తు చూస్తున్నాం-అనుభవిస్తున్నాం అన్నారు-అంటున్నారు---- జగత్తంటే ఏమిటో-ఎలాంటిదో-స్వరూపమేమిటో ఎరుగరు అనుభవిస్తున్నామనుకొనే ఈ వెర్రిదద్దమ్మలు.

అందుకే చాలజాగ్రత్తగా, భయపడుతూనే చెప్తున్నయ్ శ్రుతులన్నీ, అయినా అందరికీ అర్థంకావటంలేదు. అర్థంకాకపోయినా చెప్తే-అడిగితే మళ్ళీమళ్ళీ బోధచెయ్యవచ్చు. బోధను వినటంకూడా ఇష్టంలేక, ఇక అర్థంకావటంలేదని చెప్పటంమానేసి, తమకిష్టం వచ్చినట్లు అర్థంచేసుకొని తప్పుడుచేష్టలు చెయ్యటం మొదలుపెట్టారు. పైనచెప్పిన విచారణలో ఏకొంచెం అర్థమయినా, ఏకం ఏకమేవ అద్వయం బ్రహ్మ, నేహ నానాఽస్తి కిఞ్చన అన్న శ్రుతివాక్యం అర్థమయినా, అద్వైతమతం అని పేరుపెట్టుకున్నవారు కామం నిగ్రహించటానికి వెనుదీయరు, కామం అడ్డువస్తున్నదని చెప్పటానికి భయపడరు. జీవాత్మ సత్యమనీ, జీవాత్మ-జగత్తులు సత్యమనీ చెప్పే ద్వైత-విశిష్టాద్వైతమతాల ప్రసక్తే ఉండదు, మతానికి పేర్లు పెట్టుకొని ఇన్ని రెటమతాల ప్రచారాలు ఉండవు, సత్సాంగత్యంపేరిట కామప్రచారాలు ఉండవు, సులభమార్గాలపేరిట అజ్ఞానమార్గాలు వృద్ధికావు, భక్తిగీతాల పేరిట భగవంతునికి కామం అంటకట్టరు. పూజలలో-దేవతామూర్తులలో-

పూజావిధానాలలో-నామములలో-మంత్రాలలో-మంత్రోచ్చారణలో సర్వత్ర కామం కల్పించరు-వినరు.

అందుకే చాలా భయపడుతూనే చెప్తున్నయ్. భయపడినంతా జరిగింది. దైవీకర్మలనూ-భగవంతునీ-తత్త్వవిచారణనూ- అధ్యాత్మవిద్యనూ-వారినిజ స్వరూపాన్నీ కామదృష్టితోనేచూచి కామమయంచేశారు, పుస్తకాలువ్రాశారు, ప్రచారాలుచేశారు, వారి కామాన్ని సమర్థించుకున్నారు. ఎవరు-ఎక్కడ-ఏపరిస్థితిలో ఉన్నా అందరికీ ఒకటే గమ్యం--- సర్వకామములను నిగ్రహించినందువల్లనే మోక్షం అని చెప్తే, వారి కామములను కొన్నిదాచు కొని శాస్త్రవాక్యాలను (వారు)సవరించి, వారికిష్టమైనట్లుగా త్రిప్పుకొని ఏ మార్గానపోయినా గమ్యం చేరుకోవచ్చునని, కామాన్ని ఇంకా వాసవచూస్తూ ముళ్ళమార్గం పట్టారు నాయనా!

భయపడినంతా జరిగింది. కామమయులైన ఈమనుష్యులు ఇలా భ్రష్టు లౌతూనే ఉంటారని శ్రుతులకుబాగా తెలుసు. అందుకే చాలాభయపడుతూ చెప్తున్నయ్. ఎవరికోసం? గ్రహించి బాగుపడటానికి ఉద్యుక్తులైన జిజ్ఞాసువు లకోసం- ముముక్షువులకోసం. నిజమైన జిజ్ఞాసువులు గ్రహించారు. తమ నిజానుభవాన్ని పొందారు, ఇకముందూ పొందుతారు. ఇంత గందరగోళానికి వేరుగా ఉన్నది కనుకనే ఆత్మ చిత్-చిన్మాత్రం-జ్ఞానమయం.

అందుకే అతద్వ్యావృత్తిచేత చెప్తున్నయ్ శ్రుతులు. జగత్తు పరిభా షలో చెప్పబడే చైతన్యమూకాదు- ప్రకాశమూకాదు-జ్ఞానమూకాదు ఆత్మ, సత్తామాత్రం= చైతన్యప్రకాశ-జ్ఞానములు వేరువేరు కావు. తత్త్వం అర్థంకావటానికి అక్కడక్కడ వేరువేరుగా మాటలు చెప్పినప్పటికీ అవి ఒకే తత్త్వాన్ని చెప్తున్నయ్.

అనుభవైకవేద్యం - కేవల అనుభవాన్ని చెప్తున్నయ్.

స్వానుభవైకవేద్యం--- నిన్ను నీవు నీలోనే నిన్నే చూచి నీవే అయిపోయే నీ నిజఅనుభవాన్ని చెప్తున్నయ్= ఆత్మానుభవాన్ని చెప్తున్నయ్

అందుకే ఆత్మ చిత్ - చిన్మాత్రం.

# సూత్రప్రాయంగా భగవద్గీత ఏంచెప్తున్నదో

**భూమిరాపో ఽనలో వాయుః, ఖం మనో బుద్ధిరేవ చ,**
**అహఙ్కార ఇతీయం మే, భిన్నా ప్రకృతిరష్టధా.** (గీ7-4)
**అపరేయమితస్త్వన్యామ్, ప్రకృతిం విద్ధి మే పరామ్,**

**జీవభూతాం మహాబాహో, యయేదం ధార్యతే జగత్.** (గీ7-5)

**ఏతద్యోనీని భూతాని, సర్వాణీత్యుపధారయ,**
**అహం కృత్స్నస్య జగతః, ప్రభవః ప్రలయస్తథా.** (గీ7-6)

నా(భగవంతుని)ప్రకృతి-నామాయ అనే శబ్దముల నిజమైన అర్థమేమో ఈ పుస్తకంలోనే (33-35 పేజీలలో) విచారించుకున్నాం. భగవంతునికి నామరూపములు లేవు. కనుక దేహప్రకృతి లేదు. భగవంతుడు క్రియారహితుడు-నిరంజనుడు కనుక, చేసినపనిలేదు-చెయ్యవలసినపనిలేదు-పొందినఅనుభవంలేదు- పొందవలసినఅనుభవంలేదు--- కనుక సృష్టిఅనే వ్యాపారాన్ని చెయ్యలేదు, ఎవరి సృష్టితోనూ ఎప్పుడూ సంబంధపడలేదు. భగవంతుడు గుణరహితుడు=నిర్గుణుడు--- గుణములబంధంలో పడలేదు కనుక, మాయాగుణం లేదు - మాయలో పడలేదు, మాయతనలో చేరనూ లేదు, మాయ తన అవరణలోకికూడా (సర్వజగత్తులోకి ఎక్కడా)రాలేదు. ఈ ప్రకృతి- మాయ శబ్దాలన్నీ అజ్ఞానులకు సంబంధించినవేననీ-కల్పించుకున్నవే ననీ, భగవంతునిమీద ఆరోపణచేసినవేననీ చాలాసార్లు చెప్పకున్నాం కదూ! ఈదృష్టితో అర్థంచేసుకుంటూ, భగవంతుడు పైశ్లోకాలలో ఏంచెప్తున్నాడో చూద్దాంపట్టు.

1 భూమి-నీరు-నిప్పు-గాలి-అకాశం అనే పంచభూతములు అపరాప్రకృతి-పరంకానివి-నికృష్టమైనవి- జడములు-చైతన్యహీనములు.

2 పంచభూతాత్మకమైన దేహంకూడా అపరాప్రకృతి-పరంకానిది-నికృష్టమైనది-నీచమైనది-జడం- చైతన్యహీనం-మొద్దు.

3 దేహంలో ఉన్న ఇంద్రియాలూ-మనస్సూ-బుద్ధీ-చిత్తం-అహంకారం-ఇవన్నీకూడా అపరాప్రకృతి- పరంకానివి- నికృష్టమైనవి-నీచమైనవి-జడములు- చైతన్యహీనములు-మొద్దులు.

**ఇది చాలా గొప్ప రహస్యం నాయనా!**

**భూమికి** గొప్పఆకర్షణశక్తి ఉన్నది. మహాసముద్రాలనూ- పెద్దపెద్దకొండలనూ-కోటానుకోట్లజీవరాసులనూ భరిస్తున్నది. తనచుట్టు తానుతిరుగుతూ సూర్యునిచుట్టూ తిరుగుతున్నది. గొప్ప బ్రహ్మాండమైనది భూమండలం.

**నీరు** భూమిని సారవంతం చేస్తున్నది. ఉష్ణోగ్రతను తగ్గించి బ్రతకటానికి అనుకూలంగా చేస్తున్నది. ప్రవహించే చైతన్యశక్తి ఉన్నది. ప్రవహించేవేగాన్ని అరికట్టి విద్యుచ్ఛక్తిని తీస్తున్నారు.

**నిప్పు** అతితీవ్రమైనది-ఉగ్రమైనది. అయినా, తగుమాత్రమైతే వంటకు పనికివస్తున్నది. అధునికవిజ్ఞానంలో ఎన్నో విశేషాలకు చాలాఉపయోగపడు తున్నది.

**గాలి** కంటికి కనపడకపోయిన కనని-వినని వింతలు చేస్తున్నది. సర్వత్ర

వ్యాపించి ఉన్నప్పటికీ ఎంతోవేగంగా పరుగెత్తగలదు. రేడియోతరంగాలూ-టెలివిజన్ తరంగాలూ, ఇంకాఇలాంటివి చాలా తనలో దాచుకొని, కోరినవాళ్ళు కోరినచోట్ల కోరినంత కోసుకుంటుంటే అందిస్తున్నది. ఎంతఉపయోగం!

**ఆకాశం** శబ్దాన్నిపుట్టించి గాలికి తోడ్పడుతున్నది. శబ్దతరంగాలను సృష్టించి గాలికిఅందిస్తే, గాలి వ్యాపింపచేస్తున్నది. అసలు, సర్వజగత్తూ ఉండటానికి అవకాశాన్నిస్తున్నది ఆకాశం.

దేహం చైతన్యవంతంగా పుట్టింది-పెరుగుతున్నది-కదుల్తున్నది.

**ఇంద్రియాలు** కనపడనప్పటికీ ఎంతో తీపి అనుభవాలనిస్తూంటయ్, ఎప్పుడూ తోడుగాఉంటయ్ - అంటుకొనిఉంటయ్, పిలుస్తే పలుకుతయ్ చైతన్యస్వరూపాలై చరిస్తుంటయ్.

మనస్సు వాయువేగాన్ని మించినవేగంతో పరుగెత్తుతుంది, లోకాలన్నీ తిరిగి రెప్పపాటుకాలంలో ఉన్నచోటికి వస్తుంది, చలాకీగా ఉంటుంది. ఒక్కక్షణంకూడా తీరికలేకుండా తిరుగుతూ ఉంటుంది.

**బుద్ధి** నిశ్చయాలు చేసేస్తూ ఉంటుంది. ఎంతో విచారణచేస్తుంది. ఈబుద్ధివల్లనే మనుష్యుడు చంద్రమండలం వెళ్ళివచ్చాడు. దూరదేశాలు దగ్గరకువచ్చినయ్ (దగ్గరదేశాలు దూరమైనయ్). విజ్ఞానశాస్త్రం SCIENCE చాల అభివృద్ధి పొందింది. అధునాధునిక జగత్తు నిర్మాణానికి దోహదమిస్తుంది.

**అయినా**

భూమి-నీరు-నిప్పు-గాలి-ఆకాశం-దేహం-ఇంద్రియాలు-మనస్సు-బుద్ధి-ఇవన్నీ అపరములు-పరంకానివి-జడములు- చైతన్యహీనములు-మొద్దులు-అని అంటున్నాడు భగవంతుడు.

**అందుకే ఇది చాలా గొప్ప రహస్యం నాయనా!**

మనుష్యులందరిదృష్టిలో జగత్తూ-నామరూపాలు-వింతలూ-విషయాలూ విశేషాలూ-తినటం-త్రాగటం-పెళ్ళిళ్ళూ-పిక్‌నిక్‌లూ -చంద్రమండలయాత్రలూ-ఇవే గొప్పవిగా-ఉత్కృష్టమైనవిగా-చైతన్యములుగా-జ్ఞానవిజ్ఞానములుగా ఉన్నయ్. భగవంతుని దృష్టిలో, ఇలాంటివి ఎన్ని-ఎంతగొప్పగా విశేషించి వర్ణించినా అవి జడములు-మొద్దులు -చైతన్యహీనములు. **ఎందుకో తెలుసా!**

**అవి అన్నీ నశ్వరములే-నాశనమయ్యేవి.**

పుట్టకపూర్వం లేనివి, మధ్యకాలంలో మురిపించి, తర్వాత లేకుండా నాశనమయ్యేవి. ఉన్నవనుకొనే మధ్యకాలంలోకూడా మురిపించి-మభ్య పెట్టి-ఆశరేకెత్తించి-మోహంలోపడేస్తున్నయ్. వాటి మురిపెంలో కాలం-బలం-శక్తి-అన్నీ వృథా అయిపోతున్నయ్. శాశ్వతసుఖానికి=మోక్షసుఖానికి పనికిరావటంలేదు సరికదా, ప్రతిబంధకాలై నిల్చినయ్.

**అందుకే జడములు = మొద్దులు అనంటున్నాడు.**

నీవు నీకుర్రవాడిని మొద్దు! పనికిరాని వెధవ!! – అని తిట్టటంలేదూ!! కుర్రవాడికి చేతులూ-కాళ్ళూ కదుల్తున్నప్పటికీ, పరుగెత్తగలిగినప్పటికీ మొద్దు అనంటున్నావు. తిండి తినటానికీ, గోలచేసి నిన్ను అవగతులపాలు చెయ్యటానికీ పనికొస్తున్నప్పటికీ పనికిరాని వెధవ అని అంటున్నావు. ఎందుకు? దేనితో పోల్చి చెప్తున్నావు? నీకు కావలసిన పనితో పోల్చి, నీవునమ్మిన సౌభాగ్యంతో పోల్చి చెప్తున్నావు – వీటికి తూగకపోతే మొద్దు- పనికిరానివెధవ అనంటున్నావు కదూ! అలాగే,

| | |
|---|---|
| అపవర్గాధిపుడు=మోక్షప్రదాత కరుణామయుడు | సుఖస్యైకాంతికస్య =సుఖ ఖని కృపాసముద్రుడు |

అయిన భగవంతుడు నీ శాశ్వతసుఖాన్ని కోరి, నీవు పొందవలసిన కైవల్యస్వరూపదృష్టితో, నీదుస్థితిని చూచి, నీకు గొప్పరహస్యం చెప్తున్నాడు--- ఇవన్నీ అపరములు-నికృష్టములు-నీచములు-జడములు అనంటున్నాడు. అంతే కాదు. అపరాప్రకృతి అంటున్నాడు. ప్రకృతి అంటే, **ప్రకర్షేణ కృతం, మోహేన అవగతం, భుక్తం అనేన ప్రకృతిః** ఏది బాగా కల్పింపబడినదో –అనుభవింపబడుతున్నదో – దేనికి వాస్తవంలో ఉనికిలేదో అదే ప్రకృతి. అంటే, పంచభూతములూ- దేహేంద్రియమనోబుద్ధులూ-అన్నీ జడములు మాత్రమే కాదు. అవి కల్పితాలు, మోహంలోమాత్రం సత్యమైన వానివలె కనిపిస్తయ్, మోహంలో అనుభవింపబడుతున్నయ్. వాస్తవంలో వాటికి ఉనికిలేదు.

**ఇంకా ఈ రహస్యం ఎలాంటిదో తెలుసా!**

జడములూ-చైతన్యహీనములూ అయినవి ఎవరినీ-ఏవిధంగానూ-ఎప్పుడూకూడా బాధించలేవు. కనీసం **ఇంతమాత్రమైనా తెలుసుకోమంటున్నాడు.**

I భూమి అనే ప్రకృతి, కల్పింపబడిన పదార్థం, తను కల్పింపబడిన స్వభావంచేత తనచుట్టూ తాను తిరుగుతుంటుంది. సూర్యునిచుట్టూ తిరుగుతుంటుంది. రాత్రి-పగలు వస్తుంటయ్, రోజులు గడుస్తుంటయ్. నా రోజులు బాగాలేవనే నీ ఆక్రోదనకు భూమి ఏం చేసింది? నిన్నెలా బాధించింది? నిన్ను బాధించకుండా, తన ప్రకృతి (కల్పిత) స్వభావంలో తానుఉన్నది **కనుకనే జడం.** అయినా చైతన్యమై బాధించిందంటున్నావు.

ఇది నీకు తెలియని రహస్యం నాయనా!

II సూర్యచంద్రులూ-నవగ్రహాలూ తమ(ప్రకృతి=కల్పిత) స్థానాలలో ఉన్నయ్. వాటి పరిభ్రమణం వాటి ప్రకృతిగతిననుసరించి వాటి ప్రకృతిస్థానాలలో జరుగుతున్నది. ఇంతకీ నాగ్రహవీక్షణ బాగాలేదు, గ్రహశాంతి చెయ్యాలంటావు. తప్పదుమంత్రాలు వల్లించి "శనిగారూ!

శాంతించండీ!" అంటే శని శాంతిస్తాడా? శని ఎలా ఉంటాడో తెలియదు, శనికి శాంతి చెయ్యాలి! మండుటెండలో నుంచుని సూర్యగ్రహావీక్షణ బాగాలేదని వాపోయి, మంత్రాలు వల్లించి, "సూర్యుడుగారూ! శాంతించండీ!" అంటే ఏంచేస్తాడు సూర్యుడు? వేడిగావెలగటం మానేసి చల్లగావెలుగుతాడా? సూర్యుడు తనప్రకృతిలో వేడిగానే వెలుగుతుంటాడు. నీ కెదురుగావచ్చి వేడిలో మ్రగ్గుమననూ లేదు, AIR CONDITIONED (ఏర్ కండిషన్డ్) గదిలో కూర్చోమననూ లేదు. సూర్యునికి నీతో ప్రసక్తే లేదు. **అందుకే జడం.** అయినా చైతన్యమై నిన్ను బాధిస్తున్నాడనుకున్నావు. అలాగే శనిగానీ, ఏ ఇతరగ్రహాలుగానీ నిన్ను బాధించక (సుఖదుఃఖాదిద్వంద్వాలను కలిగించక) తమతమ ప్రకృతిస్థానాలలో ఉన్నయ్. **అందుకే జడం.** అయినా చైతన్యమై నిన్ను బాధిస్తున్నవనుకుంటున్నావు.

ఇది నీకు తెలియని రహస్యం నాయనా!

**III** సూర్యుడు జడమే అయినా, ఎండలో కూర్చున్నప్పుడు, ఎండ వేడి అనే బాహ్యప్రకృతికి పంచభూతాత్మకమైన దేహప్రకృతి సమ్మిళితమై దేహ ప్రకృతికి తాపం కలిగినట్లు--- నీవు నీ తండ్రిగర్భంలో ప్రవేశించేటప్పుడూ, తండ్రిగర్భంనుండి తల్లిగర్భంలోకి ప్రవేశించేటప్పుడూ, పుట్టేటప్పుడూ నవగ్రహములు తమతమ స్థానాలలో ఉండి వాటిప్రకృతిస్థానములవల్లకలిగిన బాహ్యప్రకృతి (బాహ్యావాతావరణం) నీదేహప్రకృతితో సమ్మిళితమౌతున్నది. ఈ విశేషఫలం బీజమై నీదేహం పుట్టిపెరుగుతూ, తత్సంబంధమైన మార్పులుకలుగుతుంటేనూ, అనారోగ్యానికి గురిఅవుతుంటేనూ, ఐహిక ఫలాలనుభవిస్తుంటేనూ జాతకచక్రం గీయించి కలుగబోయే భోగాలను లెక్కవేసుకుంటుంటా(రు)వు. ఒకవేళ జాతకచక్రాల శాస్త్రం సరియైనదే అని అనుకున్నా, తండ్రిగర్భంలో ప్రవేశించినకాలంగానీ, తల్లిగర్భంలో ప్రవేశించినకాలంగానీ, తెలియక, తల్లిగర్భంనుండి బయటికి పడినకాలం వ్రాసుకొని తత్కాల గ్రహస్థితులు వ్రాసి తప్పుడులెక్కలు వేస్తుంటా(రు)వు. పైన చెప్పినట్లు, నవగ్రహాలు తమతమ స్థానాలలో తమతమ ప్రకృతిచేత పరిభ్రమిస్తున్నయ్, ఎవరి పుట్టుకతోనూ సంబంధంలేకుండా ఉన్నయ్ కనుక **జడములు.** అలాగే

పుట్టిన దేహంకూడా - తల్లిదండ్రుల కామప్రకృతికి జన్యమైన శుక్లశోణితాలు (నీరుఅనే ప్రకృతి) అవశంగా తమ ప్రకృతిస్థానాలలో మార్పులుచెందుతూ తత్కాల గ్రహస్థితులతో (వాతావరణంతో) సమ్మిళితమై (వాతావరణానికి గురియై), ఈ విశేషఫలంగా తదనుగుణమైన అవయవాలతో దేహరూపమై, తల్లిగర్భంలోనుండి బయటపడుతున్నది. ఎలాంటి ప్రకృతిమార్పులవల్ల పుట్టిందో, అలాగే మార్పులుచెందుతూ-పెరుగుతూ, బాహ్యప్రకృతితో చేరి కష్టనిష్ఠూరాలకూ, ఆరోగ్యఅనారోగ్యాలకూ దేహం

గురిఅవుతున్నది. ఇదంతా ప్రకృతి వైపరీత్యమే. అందుకే దేహం జడం. అయినా దేహానికివచ్చిన అనుభవాలు నాకేవచ్చినవని భావిస్తూ, దేహం చైతన్యవంతమై సుఖదుఃఖాలు కలిగిస్తున్నదనుకుంటున్నావు.

ఇది నీకు తెలియని రహస్యం నాయనా!

**IV** పంచభూతములలో ఒక్కటైన భూమిపదార్థ స్వరూపాలు - బియ్యం-మట్టి కలిపితే ఒకవిధమైన మిశ్రమం కలుగుతున్నది. ఈ మిశ్రమంలోకూడా బియ్యం-మట్టిల ప్రకృతిస్థితిని అనుసరించి మిశ్రమంలో వైవిధ్యం ఉన్నది. పంచభూతములలో ఒకటైన బియ్యం(భూమి)-నీరు కలిపితే ఇంకొక విధమైన మిశ్రమం అవుతుంది. పంచభూతములలో ఒకటైన నీరునూ-నిప్పునూ కలిపి--- నిప్పుమీద నీరుపోస్తే నిప్పు చల్లారిపోతుంది--- ఇదొకమార్పు, నీరును ఒకగిన్నెలోపోసి నిప్పుమీద పెట్టే (ఆ నిప్పు-నీరే ఈవిధంగాకలిసినప్పుడు) నీరు వేడెక్కి-త్రెల్లి-ఆవిరైపోతున్నది--- ఇది ఇంకొకమార్పు.

పంచభూతాత్మకపదార్థములైన కందిపప్పు-నీరు కలిపితే క్రమంగా కందిపప్పు చివికి మెత్తబడుతుంది-ఇదొకమార్పు. నిప్పుమీద పెడితే ఉడుకుతుంది-ఇది ఇంకొకమార్పు. తర్వాత ఉప్పువేస్తే ఉడికిన పప్పులో కలిసిపోతుంది- ఈమార్పు ఇలా ఉండగా, పప్పు ఉడకకమునుపే ఉప్పువేస్తే ఉడికేపప్పుకూడా ఉడకక గట్టిపడుతుంది (గిడసబారిందంటారు)- ఇదొక విపరీతం. వండినపప్పు తింటే, దేహంలో-పంచభూతాత్మకమైనదేహంలో కలిసి ఇంకా పచనమవుతుంది - ఇది వేరొకమార్పు. అథవా తినక అలాగే ఉంచితే మురిగిపోతుంది- ఇది ఇంకొకమార్పు.

ఇలా, పంచభూతాత్మకమైన పదార్థాలు సమ్మిళితమైన విశేషాల వల్ల అనేకమైనరీతులలో మార్పులుచెందినట్లుగానే పంచభూతములైన భూమీ-నీరు-నిప్పు-గాలి-ఆకాశం అనేకమైనపాళ్ళలో -అనేకమైనరీతులుగా సమ్మిళితమై, ఈకన్పిస్తున్నవనుకునే నామరూపాది పదార్థాలుగా-మట్టి-రాయి-కొండ-కట్టు-సెలయేరు-సముద్రం -చెట్టు-పుట్టగా తయారవుతున్నయ్. ఇవి ఇలాతయారవటానికి నీప్రమేయం ఏమీలేదు. అవి తమతమ ప్రకృతి స్థానాలలో-మార్పులలో తయారవుతున్నయ్. అందుకే జడములు. అయినా చైతన్యములై నిన్నుపిలిచి తమఅందం చూడమన్నట్లుగా అద్దమైన చోట్లకు పిక్‌నిక్‌లకూ, SIGHT SEEINGలకూ పోయి సుఖదుఃఖాది ద్వంద్వాలు వచ్చినవంటావు.

ఇది నీకు తెలియని రహస్యం నాయనా!

**V** పంచభూతములూ, పంచభూతాత్మక బాహ్యపదార్థాలూ ఏవీ విధాలుగా ఎలా సమ్మిళితమై ప్రకృతి సిద్ధమైన మార్పులు చెందుతున్నవో--- దేహం కూడా పంచభూతాత్మకమై--- దేహంలో ఉన్న ఘనపదార్థం

భూమి, ద్రవపదార్థం నీరు, వేడి అగ్ని, ప్రాణాపానాదివాయువులు గాలి వీటన్నిటికీ అవకాశం ఇచ్చే చోటు ఆకాశం---- ఇలా దేహం పంచభూతాత్మకమై, దేహగతమైన పంచభూతములు అనేకపాళ్ళల్లో-అనేకరీతులుగా సమ్మిళితమౌతూ, బాహ్య పంచభూతాత్మక ప్రకృతితో కలిసి, తమతమ ప్రకృతిస్థానాలలో అనేకమార్పులుచెందుతూ ఉంటయ్. ఈ మార్పులతోగానీ - దేహంతోగానీ నీకు ప్రమేయం లేదు. **అందుకే దేహం జడం.** అయినా, దేహంలో జరుగుతున్న ఈమార్పులు నీకే జరుగుతున్నట్లు అనుకొని, వాటిని వెంటాడి కౌగిలించుకొని, (దేహంలో కలిగే)

ఒక మార్పును దురద అనీ ఒక మార్పును నొప్పి అనీ
ఒక మార్పును కడుపులో నొప్పి అనీ ఇంకొక మార్పును ఆరోగ్యమనీ
వేరొక మార్పు వెంటనే జరుగుతుంటే అస్వస్థతయనీ
మరొకమార్పు చెవుడు అనీ, గ్రుడ్డి అనీ అనారోగ్యమనీ, చావు అనీ

ఇవన్నీ నీకే వచ్చినవనీ అనుకుంటూ దేహం చైతన్యవంతమై ఇవన్నీ చేస్తున్నదనుకుంటున్నావు.

ఇది నీకు తెలియని రహస్యం నాయనా!

**VI** పంచ భూతాత్మకములైనవి బాహ్యపదార్థములన్నీ, పంచభూతాత్మకమైనవి దేహేంద్రియాదులు, బాహ్యపదార్థాలు అనేకంగా కలిసి ఎలా మార్పుచెందుతున్నవో, అలాగే దేహంలోకి స్వీకరింపబడేవి, దేహంలోకిపోయి అలాగే మార్పులు చెందుతున్నయ్. బాహ్యంగా వండబడిన లడ్డు, నోట్లోకి పోయినప్పటినుండి, నమలటం - లాలాజలంతో కలవటం మొదలుగా, రక్తంలో-మాంసంలో సారం ఇమిడి, చెత్త బయటికి తోసెయ్యబడటంవరకు ఇంకా పచనమవుతూ- మార్పులుచెందుతున్నది. ఇలా బాహ్యపంచభూతాత్మకప్రకృతి దేహేంద్రియాది పంచభూతాత్మకప్రకృతితో కలవటం స్పర్శ అంటారు. ఈ స్పర్శవల్ల కలిగేదికూడా ప్రకృతి సిద్ధమైన మార్పే, పంచభూతాత్మకమైన మార్పే. **కనుక జడం.** అయినా వాటియందు కామబుద్ధిని ఆరోపించి---- ఒకటి రసనేంద్రియం అన్నావు---- లడ్డు రసనేంద్రియం కోరే ఇంద్రియార్థం అన్నావు---- లడ్డును చూడగానే నోరూరిందన్నావు---- నోట్లో వేసుకుంటే తియ్యగా రుచిగా ఉందన్నావు---- తింటే బాగా ఉందన్నావు---- పేడను రసనేంద్రియం కోరలేదన్నావు---- చూస్తుంటే ఉమ్మికూడా మ్రింగబుద్ధి కావటంలేదన్నావు---- నోట్లోవేసుకుంటే అసహ్యంగా ఉంటుదన్నావు---- తింటే బాగా ఉండదన్నావు.

1 లడ్డు తనప్రకృతిస్వరూపంలో తానున్నది. ఎప్పుడూ-ఎవరికీ తనస్వరూపం చెప్పలేదు, తనగుణం చెప్పలేదు. లడ్డంటే ఇష్టమైనవారికి రుచికరమైన పదార్థాన్ని అనీ చెప్పలేదు, ఇష్టంలేనివారికి రుచిలేని పదార్థాన్ని అనీ

చెప్పలేదు. అంటే, ఏద్వంద్వభావాన్నీ వ్యక్తంచెయ్యటం లేదు. అంటే, భోగింపబడే బాహ్యపదార్థంలో ద్వంద్వభావం లేదు.

2 భోగిస్తున్నది, ఇంద్రియార్థాన్ని కోరుతున్నదనే రసనేంద్రియంకూడా తనప్రకృతిస్వరూపంలో ఉన్నది. కన్ను, తను చూడగలిగిన కాంతికంటే ఎక్కువకాంతి తటస్థమైతే వెంటనే కళ్ళు మూసేసుకుంటుంది. కాంతి తక్కువైన చీకటిలో కళ్ళు బాగాతెఱుచుకుంటుంది. అంటే, తన సామాన్యస్థితికి హెచ్చు–తగ్గులు వస్తే వెంటనే గుర్తించి తప్పించుకోటానికి ప్రయత్నిస్తుంది.

అలాగే, రసనేంద్రియం కూడా. సాధారణంగా దేహం గాలిపీల్చుకుంటూ ఉన్నప్పుడు లాలాజలం వస్తూఉంటుంది, మ్రింగబడుతూ ఉంటుంది. పీల్చేగాలిలో ఏమార్పువచ్చినా, వెంటనే గుర్తించి–ఆగి–మార్పును పరీక్షిస్తుంది––– నోటిలో ఊరిన లాలాజలాన్నికూడా మ్రింగక పరీక్షిస్తుంది. తను పీల్చేగాలికంటే వేరుగా లడ్డువాసనతోకూడిన గాలిగానీ, అశుద్ధమైన పెంట–పేడ–కల్లు–మొదలైన వాటివాసనలతోకూడిన గాలిగానీ (మంచి–చెడులలో) ఏదివచ్చినా ఊరిన లాలాజలం నోట్లోనే నిలిచిపోతుంది. ఇది రసనేంద్రియ ప్రకృతి. ఈ ప్రకృతికి నీప్రమేయం లేదు. రసనేంద్రియం తన ప్రకృతిసిద్ధమైన మార్పులను చెందుతున్నదేగానీ రుచులను చెప్పటం లేదు. అంటే ద్వంద్వభావం రసనేంద్రియంలో లేదు. అయినా లడ్డును చూచినపుడు నోరూరిందని కామబుద్ధితో మ్రింగుతున్నావు. పెంటను చూచినపుడు అసహ్యం అని లాలాజలం ఉమ్మేస్తున్నావు. అంటే, ద్వంద్వభావాన్ని నీవు కల్పించుకుంటున్నావుగానీ రసనేంద్రియంలో లేదు. భోగిస్తున్నవనుకొనే ఇంద్రియాలలో ద్వంద్వభావం లేదు.

3 బాహ్యప్రకృతి అయిన లడ్డు రసనేంద్రియప్రకృతితో స్పర్శ కలిగినప్పుడు – అంటే తినేటప్పుడు స్పర్శప్రకృతిననుసరించి దేహంలో పచనమవుతుంది. ఇక్కడ స్పర్శలోకూడా ద్వంద్వభావంలేదు. అంటే రుచిగల పదార్థమైతేనే పచనమవుతుందనీ, రుచిలేని పదార్థమైతే పచనంకాదనీ ద్వంద్వభావం భేదభావం లేదు. కురుపుకు మందు రాస్తే కురుపు మానిపోతుంది. కురుపుకు కారంచల్లితే పెరిగి పెద్దవ్రణం అవుతుంది–– ఇది ఎటువంటి ప్రకృతి మార్పో, అలాగే భుజించిన పదార్థాన్ననుసరించి (దేహంలో) పచనం అయిన తరువాత వేడి–జలుబు–జ్వరం–అజీర్ణం–మొదలైన ప్రకృతిమార్పులు కలుగుతుంటయ్ కనుక, స్పర్శ అంటే బాహ్య పంచభూతాత్మక ప్రకృతీ, దేహేంద్రియ పంచభూతాత్మక ప్రకృతుల సమ్మేళనమన్నమాట. దీనివల్ల కలిగే పర్యవసానాలుకూడా ప్రకృతిమార్పులే, పంచభూతాత్మకప్రకృతిమార్పులే. ద్వంద్వంలేదు – అంటే స్పర్శలోకూడా ద్వంద్వభావం లేదు.

4 ఎవరు లోకువ అంటే, నంబిరామయ్య లోకువ అని అందరికీ తెలిసిన సామెతలాగానే వారి (ఈ)అజ్ఞానాన్ని వారుగుర్తించక, ఈసృష్టినంతాచేసి అందరినీ ఏడిపిస్తున్నాడని విరుచుకుపడటానికి, అందరికీ లోకువగా దొరికిన భగవంతుడు- నిర్గుణ-నిర్వికార-నిరంజన-పరంబ్రహ్మ--- ద్వంద్వాతీతం--- ద్వంద్వభావం పరంబ్రహ్మలో లేదు.

5 నీకు తెలిసినా-తెలియకపోయినా నీనిజస్వరూపంలోకూడా ద్వంద్వ భావంలేదు. నీవు వాస్తవంలో గుణాతీతుడవు ద్వంద్వాతీతుడవు.

అంటే, ఈ మంచీచెడూ-సుఖందుఃఖం-న్యాయంఅన్యాయం-ధర్మంఅధర్మం మొదలైన ద్వంద్వాలు

1 భోగింపబడే బాహ్యపదార్థాలలో లేవు.
2 భోగించే (భోగిస్తున్నవనుకొనే) దేహేంద్రియమనోబుద్ధులలో లేవు.
3 బాహ్యపదార్థాలూ-దేహేంద్రియమనోబుద్ధులూ కలిసే స్పర్శలో లేవు.
4 పరంబ్రహ్మ = భగవంతునిలో లేవు
5 నీ నిజస్వరూపం =ఆత్మలో లేవు.

మొదటి మూడూ జడములు కనుకనూ, తర్వాత రెండూ ద్వంద్వాతీతములు కనుకనూ, వీటిలో ద్వంద్వభావంలేదు.

**మరి ఎక్కడాలేకపోతే ఇదంతా ఏమిటి? ఈ ద్వంద్వబుద్ధీ, సంసారకార్యకారణములూ ఎక్కడివి? ఎక్కడినుండి పుట్టుకొస్తున్నయ్.**

ఈ ప్రశ్నలకు సమాధానం, అందరికీ నిజంగా కావలసినదీ-పనికివచ్చేదీ అయిన సమాధానం ఏమిటో తెలుసా! ద్వంద్వబుద్ధిగానీ ద్వంద్వాలుగానీ వాస్తవంలో లేనేలేవు. ఎక్కడా లేనివి సర్వత్ర కల్పిస్తున్నావు(రు.)

1 భోగింపబడేవనే బాహ్యపదార్థాలలోనూ
2 భోగించేవనే దేహేంద్రియమనోబుద్ధులలోనూ
3 రెండింటి స్పర్శలోనూ
4 పరంబ్రహ్మలోనూ
5 నీ నిజస్వరూపంలోనూ

సర్వత్ర కామబుద్ధిచేత కల్పిస్తున్నావు. నీ నిజస్వరూపంలో నిలవటం చేతకాక, ఇంకా ఏదైనా కావాలనే కోరికతో మొదలుపెట్టి, కోరికతోనే సర్వమూ సృష్టించుకొని, కోరికలమయమై, సర్వత్ర ద్వంద్వాలనే చూస్తున్నావు. ఎక్కడాలేని ద్వంద్వభావాన్ని ఇలా సర్వత్ర ఉన్నదనుకోవటాన్ని పరాప్రకృతి అని అంటున్నాడు భగవంతుడు. పరాప్రకృతి అంటే గొప్పప్రకృతి అని అర్థంకాదు నాయనా! ప్రకృతి అంటేనే

**ప్రకర్షేణ కృతం, మోహేనఅవగతం భుక్తం అనేన ప్రకృతిః**

ఏది బాగా కల్పింపబడి, మోహంచేత తెలుసుకోబడుతున్నదో, మోహం చేత అనుభవింపబడుతున్నదో అది ప్రకృతి. పైన విచారించుకున్నట్లు — అపరాప్రకృతి అని చెప్పబడ్డ పంచభూతాలలోనూ, పంచభూతాత్మక దేహాదులలోనూ ఎక్కడా, సంసారానికి కారణమైన ద్వంద్వబుద్ధీ—కామమూ లేదు---- అందుకే జడములు, అందుకే అపరాప్రకృతి.

లేని ద్వంద్వాలను సర్వత్ర బాగాకల్పించుకొని, మోహంలో సత్యమని భావించి, అనుభవిస్తూ మళ్ళీమళ్ళీ మోహంలోకి జారిపడుతూ, సంసారంలో తిరగాడుతున్నావుకనుకనూ, ఇలా కల్పించుకోవటమనే (నీ) ప్రకృతియే నీ పతనానికి కారణమవుతున్నది కనుకనూ దీనిని పరాప్రకృతి అని అంటున్నాడు.

**జీవభూతాం యయేదం ధార్యతే జగత్**

సర్వజగత్తునూ ఈ పరాప్రకృతియే ధరిస్తున్నది.

నీ జగత్తును (నీ)పరాప్రకృతియే ధరిస్తున్నది.

జగత్తు అంటే పంచభూతములూ కావు. పంచభూతాత్మకములైన బాహ్యపదార్థములు చెట్టు-పుట్ట-కొండ.... కావు, దేహేంద్రియమనోబుద్ధులు కావు. వీటి స్పర్శకూడా కాదు. వీటియందు కామమును ఆశించి-కోరి-ఆరోపించిన ఫలంగా కలుగుతున్న ద్వంద్వబుద్ధియే జగత్తు. ద్వంద్వబుద్ధియే పరాప్రకృతి. పరాప్రకృతియే జగత్తు.

**ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ** (గీ 7-5)

ఇలా తాము కల్పించుకున్న పరాప్రకృతిలోనుండే అందరూ వస్తున్నారు. తాము కల్పించుకున్న ద్వంద్వబుద్ధిలోనే నివసిస్తున్నారు. తాము కల్పించుకున్న ఈ జగత్తులో కుళ్ళికుళ్ళి కృశించి నాశనమవుతున్నారు.

**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా.** (గీ7-5)

అస్య జగతః---- వీరు కల్పించుకున్న -- వీరి ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములలో---- వీరు వీరి ద్వంద్వబుద్ధినే చూస్తున్నప్పటికీ---- సదా ఉన్నది నేనే---- ద్వంద్వాతీతమైన నేనే ఉన్నాను. సృష్టిస్థితిలయముల దేశకాలవస్తుభేధభావములందు సర్వత్ర సదా నేనే ఉన్నాను. లడ్డునుకోరే సంకల్పానికి సంబంధించిన దేశకాలవస్తుభేదభావములలో ద్వంద్వాతీతమైన నేనే ఉన్నాను. లడ్డును అనుభవించక పూర్వమూ, అనుభవించే సమయంలోనూ, తర్వాతకూడా ద్వంద్వాతీతమైన నేనే ఉన్నాను. కానీ నన్ను తెలుసుకోకుండా లడ్డునే కోరుతున్నారు, లడ్డులో ద్వంద్వభావాలనే వెదకుతున్నారు. నాతత్త్వం తెలుసుకొని ద్వంద్వాతీతబుద్ధిని అభ్యాసంచెయ్యకుండా జగత్తునే కోరుతున్నారు. ద్వంద్వభావాలలో=పరాప్రకృతిలోనే నివసిస్తున్నారు అని **అంటున్నాడు** భగవంతుడు=**ఆత్మ**మూర్తి---- బంధకారణములైన ద్వంద్వములకు **అతీతమైన** **ఆత్మమూర్తి**—నీగమ్యం—నీధ్యేయం.

## అందుకే ఆత్మ చిత్

**ప్రకృతేః క్రియమాణాని, గుణైః కర్మాణి సర్వశః,**
**అహఙ్కార-విమూఢాత్మా, కర్తా ఽహమితి మన్యతే.** (గీ3-27)

ప్రకృతికి చెందిన గుణములచేత సర్వవిధాలైన కర్మలను ప్రకృతియే చేస్తున్నది. అంటే సర్వవిధాలైన కర్మలను ప్రకృతియే చేస్తున్నది. అంటే సర్వవిధాలైన కర్మలూ ప్రకృతిలో ప్రకృతివల్లకలిగే మార్పులే. అయినప్పటికీ నేను చేస్తున్నానంటాడు, ఆత్మ శబ్ద వాచ్యమైన నేను తో ప్రకృతిచేష్టలను జతపరుస్తాడు. ఇదే అహంకారం--- అహం అంటే నేను అని అర్థం. అహంకారం అంటే కానిదానిని అహం అనటం, కానిదానిని అహంభావన కల్పించటం--- కాని దేహేంద్రియమనోబుద్ధులనే ప్రకృతిని అహం=నేను అని అనటం, కాని దేహేంద్రియమనోబుద్ధుల ప్రకృతిచేష్టలలో అహంభావన కల్పించటం=నేను చేస్తున్నాను అని అనటం--- ఇదే అహంకారం.

ఇలా అహంకారంలో పడేవాడు విమూఢాత్ముడు- నిజఆత్మస్వభావుడు కాడు. మూఢభావములు-మూఢాచారములే ఆత్మగా అనుకొనేవాడు. ఇలాంటి అహంకార విమూఢాత్ముడు అన్నీ నేను (తనే) చేస్తున్నాననుకుంటూ, ద్వంద్వభావాలు నాకే (తనకే) వస్తున్నవనుకుంటూ ఏడుస్తుంటాడు.

**తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః,**
**గుణా గుణేషు వర్తన్తే, ఇతి మత్వా న సజ్జతే.** (గీ3-28)

కానీ తత్త్వవిత్= తత్త్వం తెలుసుకున్నవాడు=నిజం గ్రహించినవాడు, గుణములూ-కర్మములూ అనే వాటిని విచారించి, గుణములు గుణములయందు ప్రవర్తించటమే కర్మయనీ, కర్మలతో తనకేమీ ప్రమేయంలేదనీ గ్రహించి నిర్లేపుడై ఉంటాడు. అంటే, కర్మయొక్క సంకల్పమూ-కోరికా-ప్రయత్నమూ -ఫలమూ-అనుభవమూ-సర్వమూ అపరాపరా ప్రకృతుల చేష్టలూ- మార్పులేనని తెలుసుకుంటాడు. వాటిలో ద్వంద్వాలను వెతకటం విడిచి నిర్లేపుడై ఉంటాడు. తాను నిర్లేపుడై ఉంటే, యిక గుణములు ఉత్పన్నంకావు, ఇంద్రియములు గుణకర్మలచేత ప్రేరేపింపబడవు.

**ప్రకృత్యైవ చ కర్మాణి, క్రియమాణాని సర్వశః,**
**యః పశ్యతి తథా ఽఽత్మానమ్, అకర్తారం స పశ్యతి.** (గీ13-29)

ప్రకృతియే (అపరా-పరాప్రకృతులే) సర్వకర్మలూ చేస్తున్నది.
ప్రకృతి తన ప్రకృతిలోనే సర్వకర్మలూ చేస్తున్నది.
ప్రకృతిలోనే మార్పులు (కర్మఫలంగా) జరుగుతున్నయ్.
ప్రకృతిలో ప్రకృతిమార్పులే జరుగుతున్నయ్.

ప్రకృతి భగవంతుడు=ఆత్మతో ఎప్పుడూ కలుసుకోలేదు-కలుసుకోదు.
భగవంతుడు=ఆత్మ, ప్రకృతితో ఎప్పుడూ కలుసుకోలేదు-కలుసుకో(డు)దు.

ప్రకృతి తనచేష్టలను ఆత్మకు అంటకట్ట లేదు.

ఆత్మ, ప్రకృతిచేష్టలను ఎప్పుడూ తనవిగా అనుకోవటమూ లేదు.

కనుక, ఎవడు తనను=తనస్వరూపాన్ని కర్తృత్వ-భోక్తృత్వాలు లేని ఆత్మగా =ఆత్మస్వరూపంగా తెలుసుకుంటాడో వాడే తెలుసుకున్నవాడు.

**ఉపాధిరాయాతి స ఏవ గచ్ఛతి, స ఏవ కర్మాణి కరోతి భుఙ్క్తే,**
**స ఏవ జీర్యన్మ్రియతే సదాఽహమ్, కులాద్రివన్నిశ్చల ఏవ సంస్థితః.**
(వివేకచూడామణి502)

పాతచొక్కా పోతే క్రొత్తచొక్కా వచ్చినట్లు
పాతదేహం పోయి క్రొత్తదేహం వస్తూంటుంది.

వచ్చినదేహం ఎందుకువచ్చిందో ఆకర్మలు చేస్తుంటుంది. (దేహం) పెరుగుతుంటుంది, కర్మలుచేస్తూ ఉంటుంది, అనుభవిస్తూ ఉంటుంది, చివరికి చస్తుంది. పుట్టటం-కర్మలుచెయ్యటం-అనుభవించటం-చావటం ఇవన్నీ ప్రకృతి(అపరాపరాప్రకృతుల) చేష్టలే-అనుభవాలే. నేను ఎప్పుడూఉండేవాడిని, వీటితో నాకు సంబంధం లేదు అని తెలుసుకొని ముక్తినిపొందుతాడు.

అహంకార విమూఢాత్ముడు, అలాకాకుండా

**పురుషః ప్రకృతిస్థో హి, భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్,**
**కారణం గుణసఙ్గోఽస్య, సదసద్యోని జన్మసు.** (గీ13-21)

గుణములంటే ప్రకృతిలోకలిగే మార్పులేనని చెప్పున్నప్పటికీ, ప్రకృతితో తాదాత్మ్యతచెందుతూ, పంచభూతాత్మక బాహ్యపదార్థాలతోనూ, పంచభూతాత్మక దేహేంద్రియమనోబుద్ధులతోనూ(ప్రకృతితో) తాదాత్మ్యతచెందుతూ, ప్రకృతిలోకలిగే మార్పులను=గుణములను అనుభవిస్తుంటాడు-అనుభవిస్తున్నాననుకుంటాడు. పైన చెప్పుకున్న విధంగా, ప్రకృతిమార్పులను తనకు అన్వయించుకుంటాడు. తను వాస్తవంలో ఈప్రకృతితోగానీ, ప్రకృతిమార్పులతోగానీ సంబంధంలేనివాడని గుర్తించడు. తన నిజస్వరూపం తెలుసుకోడు. తెలుసుకోక, ఇలా ప్రకృతిమార్పులతో=గుణములతో సంబంధాలను పెంచుకుంటున్న కారణంగా మళ్ళీమళ్ళీ జన్మలెత్తుతున్నాడు. మంచి జన్మఅయినా, చెడుజన్మఅయినా ఒకటే కారణం - ఇదే కారణం కనుక, ప్రకృతినీ-ప్రకృతిలోనిమార్పులనూ ప్రకృతికి విడిచిపెట్టు. సంచభూతములనూ - పంచభూతాత్మకమైన మార్పులనూ=గుణములనూ పంచభూతములకే విడిచిపెట్టు. నీవు పరాప్రకృతికీ, పంచభూతాత్మక జడప్రకృతికీ విలక్షణుడవు, ఆత్మస్వరూపుడవు ఇది గొప్ప రహస్యం నాయనా!

**అందుకే ఆత్మ చిత్**

**యస్మాత్ క్షరమతీతోఽహమ్, అక్షరాదపిచోత్తమః,**

**అతో౽స్మి లోకే వేదే చ, ప్రథితః పురుషోత్తమః.** (గీ15-18)

1 పంచభూతాత్మక ప్రకృతి=దేహేంద్రియమనోబుద్ధులు క్షరములు =నాశనమయ్యేవి. కనుక ఆత్మకాదు.

క్షరములకు (క్షరప్రకృతికి) అతీతమైనది ఆత్మ.

2 క్షరములైన దేహేంద్రియమనోబుద్ధులందు శాశ్వతబుద్ధీ, జడమైన పంచభూతాత్మక (దేహ) ప్రకృతియందు చైతన్య(చిత్)బుద్ధీ, దుఃఖభూయిష్ఠములూ-దుఃఖాలయములూ అయిన దేహేంద్రియమనోబుద్ధులందు ఆనందబుద్ధీ --- ఇదే పరాప్రకృతి. ఇది తొందరగ నాశనం కావటంలేదు. క్షరములైన దేహములు కొన్ని కోట్లు వచ్చి-చచ్చినా, ఈ తప్పుడుబుద్ధులూ- తప్పుడు భావనలూ-తప్పుడు తాదాత్మ్యతలు అనే పరాప్రకృతి నాశనంకావటంలేదు, నాశనంకాకుండా సంసారానికి కారణం అవుతున్నది. అందుకే దీనిని అక్షరప్రకృతి అన్నారు. అక్షరప్రకృతి ఆత్మకాదు. అక్షరప్రకృతికి కూడా అతీతమైనది ఆత్మ.

**ఇతి గుహ్యతమం శాస్త్రం** (గీ15-20)

ఇది రహస్యాతి రహస్యం నాయనా!

1 అపరాప్రకృతి-ప్రకృతి-క్షరప్రకృతి కంటె వేరైనది-అతీతమైనది ఆత్మ=నీనిజస్వరూపం. అపరా-క్షరప్రకృతులు జడములు ఆత్మను బంధించలేవు. నిన్ను సంసారంలో బంధించలేవు.

2 పరాప్రకృతి-పురుషుడు(జీవుడు)-అక్షరప్రకృతి కంటెకూడా వేరైనది-అతీతమైనది ఆత్మ=నీనిజస్వరూపం. పరా-అక్షరప్రకృతులూ-జీవుడూ మోహకల్పితాలు, వాస్తవంలో లేవు. వాస్తవంలో లేనివి ఉన్నవనుకోవటం వల్లనే సంసారం. తప్పుడు అనుకోవటాలు అంతమైతేనూ, ఆత్మజ్ఞానంచేత నాశనమైతేనూ, సంసారం పటాపంచలైపోతుంది. వాస్తవంలో లేని పరా-అక్షర ప్రకృతులుగానీ-జీవభావంగానీ ఆత్మను బంధించలేవు, నిన్ను సంసారంలో బంధించలేవు.

**1 బంధిస్తున్నవి అని అనుకున్నంత మాత్రంచేతనే బంధంలో ఉన్నాను అని అనుకుంటున్నావు.**

**అలాగే**

**2 బంధించవు అని అనుకున్నంత మాత్రం చేతనే బంధం పటాపంచలైపోతుంది, ముక్తుడవుతావు.**

ఇదే ఆత్మజ్ఞానం

ఇదే రహస్యాతిరహస్యం-గుహ్యతమం-రాజగుహ్యం.

అందుకే ఆత్మ చిత్ - నీ నిజస్వరూపం.

**తీర్థాని తోయరూపాణి, దేవాః పాషాణమృణ్మయాః,**
**యోగినో న ప్రపద్యన్తే, ఆత్మధ్యాన-పరాయణాః.** (ఉ.గీ.3-6)

ఇలా అనేకవిధాలుగా చెప్తున్న ఆత్మజ్ఞానాన్ని, రహస్యములన్నిటికీ రహస్యమైన ఆత్మతత్త్వాన్ని ఆత్మయొక్క చిత్ స్వరూపాన్ని గుర్తించి-గ్రహించి -అభ్యసించక తీర్థయాత్రలకు పోయి గంగలోమునిగి సముద్రంలో తేలితే ఏం లాభం నాయనా? మోక్షం వస్తుందా? కొంచెం విచారిస్తే--- నీవు మునిగేది ఎంతసేపు? చాలా ప్రయత్నంచేసి, భయంతీర్చుకొని, జారుతుందేమోనని చూచిచూచి, చోటువెతుక్కొని, అటుఇటు తిరిగి, స్నానాలకు కేటాయించిన మెట్లమీద కూర్చున్నందువల్ల నడుము వఱకు మునిగి, ఇంకా మునగటానికి భయంవేసి చెంబుతో గంగనీరు నెత్తిమీద పోసుకుంటేనూ, ఇంకాకొంచెం ధైర్యంతెచ్చుకొని, ముక్కుమూసుకొని, ఒక్క రెప్పపాటుకాలం మునిగి తక్కున లేస్తేనూ నీకు మోక్షం వస్తుందనుకుంటే పుట్టినప్పటినుండి నీళ్ళలోనే మునిగి బ్రతుకుతున్న జలచరములకు ఎన్నిరెట్ల మోక్షం రావాలి? కోటానుకోట్ల టన్నుల మురికిని కక్కుతున్న దేహాన్నిపుణ్యతీర్థాలనబడే వాటిలో ముంచితే- మోక్షం రాదు నాయనా! తీర్థాలలో పుణ్యమూ-మోక్షమూ లేదు. పైన భగవద్గీత వాక్యాలలో చూచినట్లు తప్పుడు భావనలున్నంతవరకు మోక్షం కలలోమాట అనిబాగా తెలుసుకో నాయనా!

**కామైస్తైస్తైర్హృతజ్ఞానాః, ప్రపద్యన్తే ఽన్యదేవతాః,**
**తంతం నియమమాస్థాయ, ప్రకృత్యా నియతాస్స్వయా.** (గీ7-20)

కామములను తృప్తిపరచుకోవటానికి జగత్తులో పరిభ్రమించే దుస్థితి చాలక, కామములకు రూపకల్పనచేసి దేవతలనబడేవారిని ఆరాధించే రాక్షసప్రవృత్తిని విడిచిపెట్టేగాని మోక్షంయొక్క ఆవరణకూడా గోచరించదు తండ్రీ!

1 త్వఙ్మాంసరుధిర మేధోపురీషరాసి అయిన స్థూలశరీరమూ,

2 జడమైన దేహమునందు ఆత్మభావన చెయ్యటమూ, ఇంద్రియాలతో ఇంద్రియార్థములననుభవించటమూ, మనస్సుచేత జగద్విషయాలను చింతించటమూ - ఇలాంటి ప్రవృత్తిగలిగి విషయవాసనాభరితమైన సూక్ష్మశరీరమూ,

3 ఈ ప్రవృత్తి దుఃఖకారణమవుతున్నప్పటికీ తెలుసుకోక, ఆత్మజ్ఞానం పొందక సంసారంలోతిరుగాడే హీనస్థితి--- అజ్ఞానం--- కారణశరీరమూ

స్థూలసూక్ష్మకారణశరీరములనే ఈమూడుశరీరములూ=త్రిపురములూ మోక్షపథంలో ప్రతిబంధకాలని శాస్త్రం చెప్తుంటే, త్రిపురములలోనే సుఖాన్ని కోరి -ఆరోపించి త్రిపురములలో సుందరభావాన్ని ఊహించి, తమ

కోరికకూ-ఆరోపణకూ-ఊహకూ ఒక రూపాన్నిచ్చి త్రిపురసుందరి అని పేరుపెట్టి, స్త్రీగా రూపకల్పన చేసి బాలాత్రిపురసుందరి అని పేరుపెట్టారు. ఈవిడయే ఆదిశక్తి అయిన పార్వతి అన్నారు. బాలాత్రిపురసుందరిని ఆరాధిస్తున్నారు.

యా దేవీ సర్వభూతేషు కామరూపేణ తిష్ఠన్
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః.

సర్వభూతములలో కామరూపంలోఉన్న దేవికీ-కామానికీ నమస్కారం. కామఫలాన్నిస్తూ సుఖంకలిగించే దేవికి నమస్కారం. స్థూలసూక్ష్మకారణశరీరాలే (త్రిపురసుందరియే) మాకుశరణ్యం అన్నారు అంటున్నారు. ఇంతటితో-ఆగక

త్రిపురహరం మూడు పురములయందు (స్థూలసూక్ష్మకారణశరీరములయందు) కలిగినమోహాన్ని తన భక్తులకు హరించేటటువంటిన్నీ

యస్మిన్ లయం యాతి పురత్రయం చ (కై.ఉ.-14)

ఏతత్త్వంలో (ఆత్మతత్త్వం=శివతత్త్వంలో) పురత్రయం నాశనమవుతుందో, శమ్భుః--- శం యస్మాత్ భవతి ఎవనివల్ల=ఏతత్త్వంవల్ల మోక్షసుఖం కలుగుతుందో అటువంటి శివుని--- ఈ మోహస్వరూప బాలాత్రిపురసుందరికిచ్చి పెళ్ళిచేశారు. మోక్షస్వరూప శివతత్త్వానికీ, మోహస్వరూప బాలత్రిపురసుందరికీ సంబంధం కలిపారు, పుణ్యకార్యాలు చేశామనుకున్నారు, అనుకుంటున్నారు. ఇంకా ఏంచేశారో తెలుసా! మోక్షస్వరూప శివతత్త్వమూ తెలుసుకోక, మోహస్వరూప బాలాత్రిపురసుందరినీ తెలుసుకోక, ఇద్దరి నామరూపాలే సత్యమనుకుంటూ, వీరిమధ్యసంబంధాన్ని మరింతగట్టిచేశారు. సాంబశివుని (వీరు ఊహించుకున్న రూపాన్ని) పట్టుకొని పొడుగుగా తలనుండిపాదాలవరకు ఒక మధ్యగీతగీశారు. పొడుగు చెక్కలనుకోసే మెషీన్ (BAND SAW MACHINE)లో రెండుసగాలుగా కోశారు. కుడిభాగం తీసుకొని, వామభాగం సముద్రంలో పారేశారు. బాలాత్రిపురసుందరి=పార్వతిని (వీరు ఊహించుకున్న రూపాన్ని) పట్టుకొని అలాగే కోశారు. వామభాగంతీసుకొని, కుడిభాగం సముద్రంలోనో-ఎక్కడో పారేశారు. తీసుకున్న రెండుభాగాలనూ ఎలా అంటించారో, తుమ్మబంక ఉపయోగించారో, అధునాధున అరాల్డైట్ ARALDITE ఉపయోగించారో లేక వెల్డింగే WELDING చేశారో - మొత్తానికి రెండుభాగాలను కలిపి, కుడిభాగం శివాంశము, వామభాగం శక్తిఅంశము - విరిసి అర్ధనారీశ్వరుడు అన్నారు. శివతత్త్వం విడిచిపెట్టారు.

ఈ విధంగా తమకామానికి అనుగుణంగ సవాలక్ష దేవతలను సృష్టించుకుంటున్నారు. భగవత్తత్త్వాన్ని (బ్రహ్మభావాన్ని) చిత్రవధ చేసుకుంటున్నారు.

ఇదంతా భక్తిఅనీ, దీనివల్లనే ఆత్మజ్ఞానప్రాప్తి అవుతుందనీ అనుకుంటున్నారు. జ్ఞానం అడుగంటుకుపోయి-నాశనమవటంవల్ల ఇటువంటి దుష్కర్మలు చేస్తారు వీళ్ళు అనంటున్నాడు భగవంతుడు.

కన్దర్పదర్ప-హరసున్దర-దివ్యమూర్తే!
కాన్తా-కుచామ్బురుహ-కుట్మల లోలదృష్టే!
కల్యాణ-నిర్మల-గుణాకర-దివ్యకీర్తే!
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్.

మన్మథుని గర్వం అణచగల దివ్యమూర్తి వేంకటేశ్వరుడట - పోనీ మంచిమాట చెప్పారు. కామం నాశనంచెయ్యగల పరమాత్మయే వేంకటేశ్వరుడు, అందులో సందేహం ఏమీలేదని అనుకుని, శ్లోకం ఇంకా చదువుతే - అబ్బే! అలాంటివాడుకాదు మా వేంకటేశ్వరుడు అన్నారు. మరి ఎలాగంటే - లక్ష్మీదేవి అవయవాలను లోలుడై చూడటంలో మన్మథుడికంటే రెండుఆకులు ఎక్కువ చదివాడుట. అంతకుముందు కామబాణం వెయ్యటంలో మన్మథునికి సాటిఎవరూ లేరట, అందువల్ల మన్మథుడు తన గొప్పతనానికి గర్వపడేవాడుట. ఇప్పుడు వేంకటేశ్వరుడు లక్ష్మీదేవియొక్క అవయవములను చూడటంలో మన్మథుని గర్వం అణగద్రొక్కేశాడుట.

కలవేణురవావశగోపవధూ-శతకోటివృతాత్ స్మరకోటిసమాత్,
ప్రతివల్లవికాభిమతాత్సుఖదాత్ వసుదేవసుతాన్నపరం కలయే.
(వేంకటేశ్వరస్తోత్రం)

వేణువు వాయిస్తున్న శ్రీకృష్ణుడు (స్మరకోటిసమాత్) కోటిమన్మథుల సమానుడై ప్రకాశిస్తున్నాడనీ, శతకోటి గోపవధువులు అయనను చుట్టుముట్టారనీ, వారిలో ఒక్కొక్కరికీ వారి అభిమతమైన మన్మథసుఖాన్నిచ్చాడనీ, ఈవిశేషంచేత, వసుదేవసుతుడైన శ్రీకృష్ణునికంటె శ్రేష్ఠుడు లేడనీ స్తోత్రం చేస్తారు నాయనా! ఇదిస్తోత్రం కాదనీ భగవంతునిమీద కామఆరోపణమాత్రమేననీ చెప్తే వీరికి అర్థంకాదు. ఇలాంటి స్తోత్రాలవల్ల ఆత్మతత్త్వజ్ఞానం లభ్యమవుతుందనుకుంటారు.

కేళిచలన్మణికుణ్డల-మణ్డిత- గణ్డయుగస్మిత శాలీ
హరిరిహ ముగ్ధవధూనికరే-విలాసిని విలసతి కేళిపరే (గీతగోవిందం)

శృంగారచేష్టలు చేస్తున్న గోపికలతో శ్రీకృష్ణుడు కేళీవిలాసం చేస్తున్నాడంటున్నారు నాయనా! కేళీచేసే కృష్ణునికి బిరుదిస్తున్నారు. చూడు! కేళిచలన్మణికుణ్డల-మణ్డిత-గణ్డయుగస్మిత-శాలీ--

కేళిక్రియలో అట్టిట్టాడుతున్న మణికుండలముచేత మండితమైన=ప్రకాశి

స్తున్న చెక్కిలిద్వయము గలిగి, కేళిలో పరవశించి చిరునవ్వులతో ప్రజ్ఞాశాలివలె కేళిచేస్తున్నాడుట--- నామరూపములతో వ్యక్తంకాని కృష్ణతత్త్వానికి నామ రూపాలను కల్పించిచూస్తున్న ఈ దౌర్భాగ్యులకు, కృష్ణవిగ్రహం చూడటంతో తృప్తిలేదు నాయనా! వెంటనే మన్మథుడు-కేళీ జ్ఞాపకం వచ్చినయ్. పాపం ఏం చేస్తారు? వాళ్ళకున్నదే అది, వారికి కావలసినదే అది. తమకు కావలసినది కృష్ణునిలో వెదకుతున్నారు. తమలాగానే ఇంటిముందు పేరుతో బోర్డు తగిలించుకోవటానికి బిరుదులు ప్రసాదించారు.

> స్మరకోటి-సమాత్
> కేళిచలన్మణికుణ్డల-మణ్డిత-గణ్డయుగస్మిత-శాలీ
>
> శ్రీకృష్ణః

ఇలా ఒక NAME BOARD పేరుతో బోర్డు తయారుచేసి కృష్ణుని ఇంటి వాకిట్లో వ్రేళ్ళాడదీశారు ఈ ధీశాలురు-భక్తులు-కామమదాంధులు.

**అహం హి సర్వయజ్ఞానామ్, భోక్తా చ ప్రభురేవ చ,**
**న తు మామభిజానన్తి, తత్త్వేనాతశ్చ్యవన్తి తే.** (గీ9-24)

ఇలా సకామకర్మలూ-అన్యదేవతారాధనలూ చేస్తూ, దేవతలయందూ-భగవంతునియందూ వారి కామభావాలను రుద్దుతూ, కామభావాలలోనే మునుగుతున్న వీరు తమను సమర్థించుకోవటానికి పై భగవద్గీతా శ్లోకం చెప్తారు నాయనా! ఎవరు ఏదుష్కర్మలు చేసినా వాటినన్నిటినీ భగవంతుడే స్వీకరిస్తాడనీ, బదులుగా వారుకోరినవన్నీ ఇస్తాడనీ అర్థం చెప్తారు, తప్పుడర్థాలు చెప్తారు. శ్లోకంలో భగవంతుడు అలాగే చెప్తున్నాడా అని విచారించరు, తమ అర్థాలు చెప్పుకొని, భగవంతుడే చెప్తున్నాడంటారు.

సర్వయజ్ఞానాం అహం భోక్తా అంటే, వీరు పెళ్ళిళ్ళల్లో ఒళ్ళు మరచి సంతోషంలో పెళ్ళిభోజనం షడ్రసోపేతంగా తిని, భూనభోంతరాలు దద్దరిల్లేటట్లుగా బేవ్.......మని త్రేన్చి, పొట్టమీద చేతితో తృప్తిగా రాసుకుంటూ, మధ్యమధ్య ఆనందపరవశంలో పొట్టమీద ఒక చిన్నపాటు తట్టు తట్టినట్లు--- భగవంతుడుకూడా వీళ్ళకర్మలలో ఫీరిచ్చేవన్నీ తిని, బేవ్....మని త్రేన్చి తృప్తి చెందుతాడనీ, ఇలా భోక్తా అనీ, తన తృప్తికి బదులుగా వీరు కోరిన హిరణ్యాక్షవరాలన్నీ ఇస్తాడనీ, ఇలా ప్రభు అనీ అనుకుంటుంటారు. ఇలా అనుకొనే మొద్దుదద్దమ్మల్లారా! ఇలా అనుకొంటూ నానిజతత్త్వం

తెలుసుకోక విడిచారంటే నాశనమవుతారు అని శ్లోకంలోని రెండవ పాదంలో హెచ్చరిస్తుంటే వీరిదృష్టి అటు మళ్ళదు నాయనా!

నేను భోక్తా అంటే--- అందరి కర్మలను నేను స్వీకరిస్తానని చెప్పటం లేదు. అందరి కర్మలూ నాగురించే జరుగవలె, నాతత్త్వం తెలుసుకోవటంకోసమే (తదనుగుణ్యమైన) కర్మలు చెయ్యాలి. అసలు కర్మ అంటే నాతత్త్వం తెలుసుకోవటానికి చేసే ప్రయత్నం=అభ్యాసమే. అన్యకర్మలు కర్మలుకావు. నాకు కామాన్నిఅంటగట్టే కర్మవల్ల నాతత్త్వం బోధపడదు, సంసారం ఇంకా పెరుగుతుంటుంది.

నేనుప్రభు అంటే--- వారుకోరే ఐశ్వర్యభోగాలనన్నిటినీ ఇస్తానని కాదు. వారి నిష్కామకర్మల ఫలంగానూ, వారి అభ్యాసఫలంగానూ, ఎప్పుడెప్పుడు తత్త్వబోధ ఎలా చెయ్యాలో వారి నిత్యజీవితంలో వారిననుసరించి ఉండి, అలా (తత్త్వబోధ) చేస్తుంటాను.

నాకు వారితో ఏదైనాసంబంధం ఉంటే, అది వారు నాతత్త్వం తెలుసుకొనే ప్రయత్నంలోనే. కానీ ఈ కామమదాంధులు వారి ఐశ్వర్యభోగాలకు నన్ను పిలుస్తారు, వారి మాటలలోకీ వారి భావాలలోకీ నన్ను లాక్కొస్తారు. నేను వస్తానో-వచ్చానో-లేదో చూచుకోకుండానే నేను వచ్చాననుకుంటారు. అన్నీ ఇచ్చేస్తున్నాననుకుంటారు, సృష్టిచేసేస్తున్నానంటారు, మధ్యమధ్య వారిని ఏడిపిస్తున్నానంటారు.

అసలు నేనివ్వటమంటే ఏదో ఎలాగో విను నాయనా! నాదగ్గర ఉన్నది మోక్షసుఖమే. నేను ఇవ్వగలిగినదీ-ఇవ్వదలచుకున్నదీ మోక్షసుఖమే. అసలు (నేనే) నాపేరే అపవర్గాధిపుడు=శంభు=మోక్షప్రదాత. ఇప్పటికి ఎన్నడో-ఎన్నోకల్పాలకుపూర్వం, ఈ మోక్షసుఖాన్ని నాదగ్గరే ఉంచుకునే వాడిని. ఎవరైనా వచ్చి-అడిగితే ఇద్దామనుకున్నాను. ఉదారంగానే ఇద్దామనుకున్నాను. అడిగినంత మాత్రాననే, ఒక కిలో అడిగితే పది కిలోగ్రాములు ఇద్దామనుకున్నాను అయినా

నాభిజానాతి మాం (గీ7-13)
మాం తు వేద న కశ్చన (గీ7-26)
న తు మామభిజానన్తి తత్త్వేన (గీ9-24)
న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే (గీ7-15)
అవజానన్తి మాం మూఢాః (గీ9-11)

ఒక్క కుంకకూడా నాదగ్గరకు వచ్చి నన్ను అడిగినపుణ్యాన పోలేదు. చాలాకాలం ఓపిక పట్టాను. లాభంలేక పోయింది. బహుశః నాదగ్గర మోక్షం ఉన్నదని వీరికి తెలియదేమోనని యీ విషయం ప్రచారం చేద్దామని ప్రతివాడి చుట్టూ తిరిగాను, ఇదిగో తీసుకోరా అన్నాను

ప్రతివల్లవికాభిమతాత్సుఖదాత్ (వేంకటేశ్వరస్తోత్రం)

అన్నాడు. ప్రతి గోపికాస్త్రీకి తన అభిమతమైన మన్మథ సుఖాన్నిచ్చే వాడినన్నాడు

**జనతాభిమతాధికదానరతాత్, ఉదారమతి** (వేంకటేశ్వరస్తోత్రం)

అన్నాడు. అందరూ కోరిన అభిమతములను ఉదారంగా ఇచ్చేవాడిన న్నాడు. ఓరి దౌర్భాగ్యుడా నేను తెచ్చినది మోక్షసుఖంరా! నీ సాంసారిక అభిమతం కాదురా అన్నాను. వింటేనా, వారిగోల వారిదే. అయినా, క్షమ వహించి చూచాను, ఎప్పటికైనా అర్థంచేసుకుంటాడేమోనని— ప్చ్! ఆ ఛాయలు కనిపించలేదు. ఇంకొకఅడుగు ముందుకువేసి నామోక్షసుఖంతో వారిలోనే దూరాను క్షణక్షణానికి మోక్షసుఖానుభవాన్ని చెప్తూ, వారిచేత అనుభవింపచేస్తూ చాల ప్రయత్నించాను.

సర్వస్య చాహం హృది సన్నివిష్టః (గీ15-15)
హృది సర్వస్య ధిష్ఠితం (గీ13-17)
సర్వేషు భూతేషు తిష్ఠన్ (గీ13-27)

అన్నాను. పోనీ వారిలో నేను ఎలాఉన్నానో చెప్పకపోతే తెలియదేమోనని అదికూడా చెప్పాను.

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్ (గీ13-27)
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం (గీ13-17)
అహమాత్మా సర్వభూతాశయ-స్థితః (గీ10-20)
ఆత్మభావస్థః (గీ10-11)
వేదాన్తకృత్ వేదవిదేవ చాహం (గీ15-15)

అని చాలాసార్లు చెప్పాను. BUT IN VAIN, అంతా వృథా అయిపోయింది. నాతత్త్వం= మోక్షం అని నేను అంటున్నకొద్దీ మొండి పట్టుదలతో కామం కామం అని అరవటం మొదలుపెట్టారు.

అతః చ్యవన్తి తే (గీ9-24)
నివర్తన్తే మృత్యు సంసారవర్త్మని (గీ9-3)
తతో యాన్త్యధమాం గతిం (గీ16-20)
హరన్తి ప్రసభం మనః (గీ2-60)
తదస్య హరతి ప్రజ్ఞాం (గీ2-67)

సంసారంలో నాశనమవుతారని హెచ్చరించాను, మరీమరీ చెప్పాను, ఎన్నోవిధాలుగా ఎన్నోసార్లు చెప్పాను, శాస్త్రాలచేత చెప్పించాను, నన్ను తెలుసుకున్న జ్ఞానులచేత చెప్పించాను, కానీ ఏమీలాభం లేకపోయింది.

ఏం చెయ్యాలో బోధపడలేదు.

విసుగువేసింది. అయినా వారిమీద జాలివేసింది. మోక్షసుఖాన్ని వారిదగ్గరే విడిచిపెట్టి వచ్చేశాను. ఇకనుండి పుట్టిన ప్రతివానికీ మోక్షం చెందుగాక అన్నాను. నాపనిని పూర్తి చేసుకొని లేచ్చక్కా వచ్చాను. ఎప్పుడైనా తీసుకుంటారేమోనని అనుకున్నాను. ఏంలాభం? ఇచ్చింది అక్కరలేకపోయింది. మళ్ళీ నావెంబడి పడ్డారు. కలియుగంలో మాకోర్కెలుతీర్చే కొండంత దైవమా! అన్నారు. అపదమొక్కులవాడా! వేంకటేశ్వరా!! వెనకటిరమణా! గోయిందా!! నీసొమ్మేమైనా పోయిందా!!! మాకోర్కెలు తీర్చు! అంటున్నారు. ఓరి మీ దుంపలు తెగా! నేను ఇచ్చేదేదో ఇదివరకే ఇచ్చేశాను. ఇంక నాదగ్గర ఏమిలేదర్రా! నాకు మీరుపెట్టిన పేరుయొక్క అర్థం తెలిస్తే నేను ఇదివరకే ఇచ్చింది మీకు కనపడుతందర్రా అన్నాను.

**వేం** --- పాపం= కోరిక

**కటతి** --- తెగనరికే వాడిని, హరించేవాడిని

**ఇతి వేంకటః** కనుక వేంకట

**తస్య ఈశః** --- కోరికలను నిగ్రహించమని శాసించేవాడిని

**తస్య వరః** --- అలా శాసించేవారిలో శ్రేష్ఠుడిని.

మీ కోరికలలో ఏవైనా మిగిలినా, ఇంకా పెరిగినా (మీరు కల్పించుకున్న) దేవతలుగానీ మరెవరైనా ఒప్పుకుంటారేమో గానీ

**సఙ్కల్పప్రభవాన్కామాన్, త్యక్త్వా సర్వానశేషతః,**
**మనసైవేన్ద్రియగ్రామమ్, వినియమ్య సమంతతః.** (గీ6–24)

కోరికలనన్నిటినీ అన్నివైపులనుండి చుట్టుముట్టి ఒక్కుమ్మడిగా నాశనం చేసుకోండి. ఒకటికూడ మిగులకుండా నాశనం చేసుకోండి! ఇలాగైతేనే బాగు పడ్తారు! నాదగ్గరకువస్తే ఆపనిని నేను చేస్తాను. ఏదీ! మీ కోరికలను హరించేదా అని వెంబడిపడ్డాను. అమ్మ బాబోయ్! అని అరిచారు ఒక్కసారిగా. అంత ఉగ్రస్వరూపం నీకు కూడదయ్యా అని అన్నారు. మీ బొందలు పెట్టా! ఈ నానిజస్వరూపం మీకు ఉగ్రరూపంగా తోచి, మీ కామములను నిగ్రహించకుండా, మీ దౌర్భాగ్యాన్నంతా నామీద పడెయ్యాటనికి ప్రయత్నిస్తే

**అతః చ్యవన్తి** (గీ9–24)

మీ దుష్కర్మలవల్ల మీరే నాశనమవుతారని మళ్ళీచెప్పాను. **ఈరోజు దాకా చెప్తూనే ఉన్నాను.** ఇలా చెప్తూఉంటాను. నేను చెయ్యగలిగింది ఇంతే--- ఇదీ భగవంతుని తీరు నాయనా!

**కనుక, ఆత్మధ్యానపరాయణులు=ఆత్మతత్త్వాన్నే కోరేవారు**

తీర్థయాత్రలలోనూ – పాషాణమృణ్మయాలైన అన్యదేవతారాధనల లోలనూ, వారి కామరూపాలలోనూ, దేవతల కామస్వరూపాలలోనూ

గ్రమ్గరు. కాలం-శక్తి వృథాచేసుకోరు నాయనా!

మరేం చేస్తారంటే---- అసలు సిసలైన తత్త్వవిచారణ చేస్తారు.

**ఇదం శరీరం కౌన్తేయ, క్షేత్రమిత్యభిధీయతే,**

**ఏతద్యోవేత్తి తం ప్రాహుః, క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. (గీ13-2)**

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి, సర్వక్షేత్రేషు భారత!**

**క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానమ్, యత్తత్ జ్ఞానం మతం మమ. (గీ13-3)**

ఈ శరీరం క్షేత్రం. ఈ క్షేత్రంను చూచి దానినిగురించి తెలుసుకొనేది క్షేత్రజ్ఞుడు. సర్వశరీరాలలో= సర్వక్షేత్రాలలో ఉన్నక్షేత్రజ్ఞుడు పరమాత్మ=ఆత్మ.

చూచి తెలుసుకొనే క్షేత్రజ్ఞునికంటే చూడబడే క్షేత్రం వేరు. క్షేత్రం జడప్రకృతి. క్షేత్రానికి సంబంధించిన ఊహలూ- సుఖదుఃఖాదులన్నీ మిథ్యా-కల్పితాలు. క్షేత్రజ్ఞుడు, క్షేత్రంతోగానీ, మిథ్య అయిన సుఖదుఃఖాదుల తోగానీ ఎప్పుడూ సంబంధపడడు-కేవలంసాక్షి. క్షేత్రక్షేత్రజ్ఞులను గురించిన ఇటువంటి జ్ఞానమే జ్ఞానం అనబడుతుంది. క్షేత్రమైన దేహానికీ, క్షేత్రజ్ఞుడైన పరమాత్మ=ఆత్మకూ సంబంధంకల్పించి, ఆత్మకు కామం ఆరోపణచెయ్యటం కేవలం అజ్ఞానం. క్షేత్రక్షేత్రజ్ఞులను విభాగంచేసి, క్షేత్రభావాన్ని విడిచి, క్షేత్రజ్ఞుని తత్త్వం గ్రహించటమే జ్ఞానం.

**జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం, హృది సర్వస్య ధిష్ఠితమ్ (గీ13-17)**

ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమూ (పరోక్షజ్ఞానమూ) జ్ఞానమును ఆచరించి అనుభవపూర్వకంగా తెలుసుకోవటానికి చేసే నిగ్రహాయుక్తమైన అభ్యాసంవల్ల పొందేదీ---- జ్ఞానగమ్యమూ---- సర్వదైవీకర్మలవల్లనూ-సర్వవ్యావహారికకర్మలవల్లనూ తెలుసుకోవలసిన జ్ఞేయము

ఆత్మయే, ఆత్మయొక్క చిత్స్వభావమే - సర్వులలో ఉన్నది.

**అందుకే ఆత్మ చిత్**

**యత్కేవలం జ్ఞానగమ్యం** (శాండిల్య ఉ.2-6)

ఏది కేవలం (ఆత్మయొక్క) అపరోక్షజ్ఞానంచేతనే పొందబడేదో

అంటే, స్వానుభవైకవైద్యమో

**అదే ఆత్మ చిత్-చిన్మాత్రం**

**ప్రత్యక్షావగమం** (గీ9-2)

ప్రత్యక్షంగా అనుభవింపబడేదే ఆత్మ. ఏ అనుభవంవల్ల, దేహాదిఅనుభవాలు పరోక్షానుభవాలుగానూ, మిథ్యానుభవాలుగానూ, జగత్తు లేనిదిగానూ అయిపోతున్నవో అదేఆత్మ.

**అందుకే ఆత్మ చిత్**

వినశ్యత్సు అవినశ్యన్తమ్ (గీ13–27)

నశించే దేహాలలో నాశనంకానిదీ, నశించే దేహాదిఅనుభవాలలో నశించని అనుభవమూ, త్రిగుణమయమైన దేహాదిప్రకృతిలో నిస్త్రైగుణ్యమైనదీ, ద్వంద్వమయమైన దేహాదిప్రకృతిలో నిర్ద్వంద్వమైనదీ, మిథ్య అయిన సర్వంలో సర్వత్ర వాస్తవమైన ఏకమూ

బ్రహ్మ నిత్యచిద్ఘనం అక్షతం (మహో.ఉ.4–119)

సదా సర్వత్ర ప్రత్యక్ చిన్మాత్రమైనదీ, నాశనంలేని చిత్ స్వభావమైనదీ

న ద్వితీయోఽస్తి కశ్చిత్ (నారాయణ ఉ–2)

ఏ అనుభవంలో రెండవపదార్థం లేదో, ఆత్మ= నేను అనే నిజస్వరూప చిత్ స్వభావానుభవం = స్వానుభవం తప్ప ఆత్మ–నేను అనే పదములుకూడా లేవో---- దేహం లేదో---- దేహాదిప్రకృతి లేదో---- షడ్వికారములు–షడ్రిపులు–షడూర్మ్ములు–పంచకోశాలులేవో---- జాగ్రత్–స్వప్న–సుషుప్తి అవస్థలు లేవో---- స్థూల–సూక్ష్మ–కారణశరీరాలు లేవో---- త్రిగుణములూ–ద్వంద్వములూ లేవో---- సర్వజగత్తూ లేదో---- సర్వమూ లేదో----

అదే ఆత్మ చిత్–చిన్మాత్రం.

యా నిశా సర్వభూతానామ్, తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని, సా నిశా పశ్యతో మునేః. (గీ2–69)

అందరికీ అక్కరలేని ఆత్మయొక్క చిత్ స్వభావాన్నే గ్రహించి అందరికీ కావలసిన జగత్తును ససేమిరా కన్నెత్తికూడా చూడకుండా, ఆత్మయొక్క చిత్స్వభావం తెలుసుకోవటానికి అందరూ రెటమతంలో ఉంటే అంతకంటే తీవ్రమైన రెటమతంలో ఉండాలి అభ్యాసకుడు జగత్తునందూ, ఐశ్వర్యభోగాలయందూ. ఇది అభ్యాసంలో కిటుకు నాయనా! ఇది రహస్యం. ఈ రహస్యం తెలుసుకొని

య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదగ్ం సర్వం భవతి.
(బృ.ఉ.1–4–10)

ఎవరు అసలు సిసలైన అభ్యాసంచేత తనను బ్రహ్మగా తెలుసుకుంటాడో, తనను ఆత్మ–చిత్స్వరూపంగా తెలుసుకుంటాడో, ఇతః పూర్వమున్న దేహాది వాసనలనూ–ద్వంద్వభావాలనూ–సర్వకామములనూ విడిచిపెట్టాడో, అప్పుడు సర్వవిత్ అవుతాడు–సర్వజ్ఞుడవుతాడు–సర్వుడవుతాడు–చిన్మాత్రుడవుతాడు.

యది దేహం పృథక్కృత్య చితి విశ్రామ్య తిష్ఠసి,
అధునైవ సుఖీ శాన్తః బన్ధముక్తో భవిష్యసి. (అష్టావక్రగీత 1–4)

దేహవాసనలో చిక్కుకొని, దేహభావాన్నే మననం చేస్తూ, కోరికలతో అలమటిస్తూ, దేహవాసనాదృష్టితోనే విచారిస్తూ, ఎవరు–ఎన్ని చెప్పినా,

శాస్త్రమే చెప్పినా, భగవంతుడే చెప్పినా దేహవాసనా దృష్టితోనే అన్వయించుకుంటూ, దేహంలోనే చైతన్యం, దేహంలోనే ప్రకాశం, దేహంలోనే జ్ఞానం దేహంతోకూడిన చిత్ స్వరూప (తప్పుడు)భావాలు

**అనే నీ ఇప్పటి దుర్వ్యవస్థకు స్వస్తి చెప్పి**

ఈ పుస్తకంలో విచారించుకున్న శాస్త్రవాక్యాల ధోరణిని పట్టుకొని, నీ దేహంతో ఏవిధంగానూ సంబంధంలేని చిత్ తత్త్వాన్ని=ఆత్మచిత్ స్వభావాన్ని గుర్తించి – గ్రహించి–ఆచరించి, స్థిరంగా ఆత్మయొక్క చిత్స్వభావంలోనే నిలువగలిగేవాడవే అయితే ఇప్పుడే-ఇక్కడే మోక్షసుఖాన్ని పొందుతావు. నీ గమ్యం ఇదే. మానవకర్తవ్యం ఇదే నాయనా! కనుక, శాస్త్రసమ్మతమైన అభ్యాసం చెయ్యి. నీ నిజస్వరూప చిన్మాత్రసుఖాన్ని పొంది ఆనందించు తండ్రీ! తల్లీ!

**అందుకే ఆత్మ చిత్-చిన్మాత్రం**

ఓం తత్ సత్

ఓం కృష్ణానంత ముకుంద మురారే! వామన మాధవ గోవింద!
శ్రీధర కేశవ రాఘవ విష్ణో! శ్రీనారాయణ చిద్రూప!

ప్రథమ ముద్రణ శ్రీకృష్ణజయంతి, ఆగష్టు, 1994 : 1000ప్రతులు

# జహి శత్రుం కామరూపం దురాసదమ్

న జాతు కామః కామానాం ఉపభోగేన శామ్యతి,

హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే. (నా.ప.3-37)

ఇదుగో!

ఇప్పుడు ఉద్యోగం దొరికితే హాయిగా ఉంటుంది.

అది అయిన తర్వాత ప్రమోషన్, తర్వాత ఇంకొకటి-

ముందు పెళ్ళీ, తర్వాత పిల్లలూ, తర్వాత

వాళ్ళ చదువూ-వాళ్ళ పెళ్ళిళ్ళూ, మనుమలూ, మనుమరాండ్రూ-

ముందు ఇల్లూ, తర్వాత పైన మేడా,

దాని తర్వాత కొడుకులకూ-కూతుళ్ళకూ యిళ్ళు, మనవళ్ళకీ-

ముందు సైకిలూ, తర్వాత మోటారుసైకిలూ, కారు-

రిక్రియేషన్‌కి సర్కస్, పిక్‌నిక్, విహారయాత్రలూ-

ఈవిధంగా,

ఒకదాని వెనుక ఒకటి ఎడతెగకుండా, అంతులేకుండా,

కోటిగుణంగా వృద్ధిపొందుతున్న కోరికలు-

జాతు=ఒకప్పటికీ ఉపభోగేన= వాటిని అనుభవించినందువల్ల

న శామ్యతి = తృప్తి చెందదు (తృప్తి చెందవు)

హవిషా కృష్ణవర్త్మేవ = అగ్నిలో హవిస్సు ఎంతవేసినా తృప్తిచెందక,

వేసినకొద్దీ శిఖలు పైకి లేచినట్లుగా

భూయః ఏవ = మళ్ళీ మళ్ళీ మళ్ళీ మళ్ళీ

అభివర్ధతే = పెరుగుతూనే ఉంటుంది (ఉంటయ్)

**తగ్గటం=తృప్తిచెందటం అనేది ఉండదు**

కనుక, సాధక సోదరసోదరీమణులారా!

**పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవటానికీ**

**మానవకర్తవ్యాన్ని పాటించటానికీ**

**వాయిదాలు వేయవద్దు**

ఉండూ! ఈఒక్క కోరికా పూర్తిచేసుకొని వస్తా.

ఇంకా ఒక అమ్మాయి పెళ్ళి ఉంది. అదికాస్తా అయిందనిపిస్తే-
పెద్దవాడు చేతికి అంది వస్తే-

ఇంకా ఎంత ఉందండీ! రెండేళ్ళేగా! రిటైర్ అయిన తర్వాత వస్తా.
అప్పుడు తీరిగ్గా మొదలు పెట్టా-

ఏదీ! సంసారంలో తీరితేనా! వస్తా!
ఎప్పుడో వస్తా!! వచ్చేస్తా!!! తప్పక మొదలు పెట్టా.
మొదలు పెట్టితీర్తా.

ఈజన్మలో కాకపోయినా, ఎప్పటికైనా, మీ ఆశ్రమంలో గోడమీదపాకే పురుగుగానైనా పుట్టి, మీసత్సాంగత్యంలో పాల్గొంటా-

అంటూ,

కోరికలు విడవలేక, పూర్వవాసనల్నే ఆఘ్రాణిస్తుంటే,
కోరికలు తీరవు అలవాట్లు మారవు భావాలు చెదరవు
వాసనలు మాడవు తత్త్వం అర్థం కాదు
మానవజన్మ వమ్ము అవుతుంది అంతిమకాలం ఆసన్నమవుతుంది
అప్పుడు వృథాగా చచ్చిపోవలసిందే
కనుక, తల్లులారా తండ్రులారా!
కోరికలు తీరిన తర్వాత సంసారంలో తీరిక కలిగినప్పుడు
ఒంట్లో ఆరోగ్యం చిక్కినప్పుడు మనస్సులో సమస్యలు తీరినప్పుడు
ఎప్పుడో నాకిష్టమైనప్పుడు అన్నీ బాగున్నప్పుడు
సాధన మొదలుపెట్టా అనే సోమరితనాన్ని పెంచుకోకండి.
కోరికలు తీరడంగానీ సంసారంలో తీరిక దొరకటంగానీ
ఒంట్లో ఆరోగ్యం చిక్కటంగానీ మనస్సులో సమస్యలు తీరటంగానీ
ఇష్టంకలగటంకానీ అన్నీ బాగుండటంగానీ

## కొన్ని కోట్లజన్మలకుకూడా జరగని మాట

ఇటువంటి అసందర్భప్రలాపాలు కట్టిపెట్టి,
ఈ రోజే, ఇప్పుడే సాధన మొదలుపెట్టండి.
మాధవునికటాక్షానికి పాత్రులు కావటానికి కంకణం కట్టుకోండి.
వర్జ్యాలూ, వారాలూ, మీనమేషాలూ, రాహుకాలాలూ, కేతుకాలాలూ
చూచుకుంటూ కాలం వృథాచెయ్యకండి.

ఓం తత్ సత్

# గీతాఽమృతమహోదధయే నమః

ఓం

కృష్ణానంద ముకుంద మురారే! వామన మాధవ గోవింద!
శ్రీధర కేశవ రాఘవ విష్ణో! శ్రీనారాయణ చిద్రూప!
యద్ ॥ అక్షరపద-భ్రష్టమ్, మాత్రాహీనం చ ॥ యద్భవేత్,
తత్ సర్వం ॥ క్షమ్యతాం ॥ దేవ!, శ్రీకేశవ! ॥ నమో ఽస్తు తే.
వాసుదేవ! ॥ నమో ఽస్తు తే
నారాయణ! ॥ నమో ఽస్తు తే

ఓం ॥ నమో । భగవతే వాసుదేవాయ
నమః ॥ పురుషోత్తమాయ
నమస్ ॥ సర్వలోకగురవే
నమస్ ॥ సర్వలోకపిత్రే
నమస్ ॥ సర్వలోకపితామహాయ
నమస్ ॥ సర్వలోకప్రపితామహాయ
నమస్ ॥ సర్వలోకప్రధానాయ
నమస్ ॥ సర్వలోకేశ్వరాయ
నమస్ ॥ సర్వలోకవిశిష్టాయ
నమస్ ॥ సర్వలోకసుఖప్రదాయ
నమస్ ॥ సర్వలోకహర్త్రే
నమస్ ॥ సర్వలోకనిధయే
నమస్ ॥ సర్వలోకనిధానాయ
నమస్ ॥ సర్వలోకహితాయ
నమస్ ॥ సర్వలోకహితకరాయ
నమో విష్ణవే ॥ ప్రభవిష్ణవే

సర్వస్య చాహం ॥ హృది ॥ సన్నివిష్టః,
మత్తస్ స్మృతిర్ ॥ జ్ఞానమ్ అపోహనం చ,
వేదైశ్చ సర్వైర్ ॥ అహమేవ వేద్యః,
వేదాన్తకృద్ ॥ వేదవిదేవ చాహమ్.

మన్మనా భవ ॥ మద్భక్తః, మద్యాజీ ॥ మాం నమస్కురు,
మామేవైష్యసి ॥ యుక్త్వైవమ్, ఆత్మానం ॥ మత్పరాయణః.

ఓం
జగద్గురవే నమః
ఓం

కర్తా ఽపి వా ॥ కారయితా ఽపి నాహమ్,
భోక్తా ఽపి వా ॥ భోజయితా ఽపి నాహమ్,
ద్రష్టా ఽపి వా ॥ దర్శయితా ఽపి నాహమ్,
సో ఽహం ॥ స్వయంజ్యోతిర్ అనీదృగాత్మా.

ఓం

గురుర్ బ్రహ్మా ॥ గురుర్ విష్ణుః, గురుర్ ॥ దేవో మహేశ్వరః,
గురుస్ ॥ సాక్షాత్ పరంబ్రహ్మా, తస్మై ॥ శ్రీగురవే ॥ నమః.

ఓం

శ్రీగురు–చరణారవిన్దాభ్యాం ॥ నమో నమః

ఓం

శ్రీగురు–చరణారవిన్దయుగళమ్,
గృహీత్వా ॥ హస్తాభ్యామ్,
శిరసి, నయనే, వక్షసి
వహామి.

ఓం తత్ సత్